


ఎప్పటిదీ ధర్మం?!?




రాజధానీ నగరంనుండి ప్రతినెలా వెలువడే 'యువ' కథలూ కార్టూనులూ చదువరులను ఆకర్షిస్తూంటయి. ప్రారంభంలోనే ప్రచురింపబడిన మీ సంపాదకీయ వ్యాసం సమర్ధవంతంగా, విమర్శనాత్మకంగా వుండి మరల మరల చదవాలనే భ్రమ పుట్టుతూంది. ఈ నెలలో మీరు వ్రాసిన వ్యాసం "విశాఖపట్టణం వద్దనే అయిదవ ఉక్కు-ఫ్యాక్టరీ 'సంపూర్ణమయినది నిర్మింపబడవలె" ననునది నిజమైనవాదన.

ఇటులనే ప్రతినెలా మీ వ్యాసరచన ద్వారా ఆంధ్రప్రజల వాదనను బలపరుస్తూ, రాష్ట్రపురోగమనానికి మీ సహకారం ఎంతైనా అవసరం కాగలదు.

డి. సత్యనారాయణ
కాకినాడ

ఆగస్టు నెల 'యువ'లో శ్రీ అవసరాల నారాయణరావు రచన "మెత్తని చెప్పుదెబ్బ" చాలా బాగుంది.

బి. యం. రావు
విజయవాడ

ఆగస్టు నెల "యువ" చాలా సర్వాంగ సుందరంగా యున్నది. ఒక్కొక్క కథ ఒక్కొక్క మణిపూస అంటే నమ్మండి. ప్రభాతకుమార్ ముఖర్జీగారి "కుంకుమబరిణ" పెద్ద కథ నన్నెంతో ఆకర్షించింది. ఆ కథకు వేసే చిత్రాలు చాలా బాగున్నాయి. ప్రచురించిన మీరు ప్రశంసాపాత్రులు. కార్టూనులు నన్ను కడుపుబ్బ నవ్వించి కవ్వించాయి.

"ముఖచిత్రం శాంతిప్రియ" నన్ను ఆనందపరచింది. పనిలేని మంగలి మరల-తిరిగి-ప్రచురించగోరుతాను.

వి. ఆదినారాయణరావు
విజయనగరము—2

ఆగస్టు నెల యువలో మీరు ప్రచురించిన 'అంతర్జ్వాల' చాలా బాగా ఉన్నది. భాస్కరం వత్సలను డైరీ వ్రాయవద్దని చెప్పినప్పుడు వత్సల పడే బాధ నేను పడినట్లుగానే వున్నది? రచయిత్రి గొల్లపూడి రాజ్యలక్ష్మిగార్కి నాహృదయ పూర్వక అభినందనలు? ఇంత మంచి కధలు ప్రచురించుచున్న యువ ఎడిటర్ గార్కి చాలా థ్యాంక్సు.

కుమారి కె. రోజారాణి
కడవకదురు

ఆగష్టు నెల సంచికలో ప్రచురించిన "మెత్తని చెప్పుదెబ్బ" రచన చాలా బాగుంది. రచయితకు మా ధన్యవాదాలు.

టి. పద్మకుమారి, హైదరాబాదు

"ఆలయాన వెలసిన ఆదేవుని రీతి
యిల్లాలే యీజగతికి జీవన జ్యోతి"

Roopkala

పద్మనాభం సమర్పించు
రేఖా & మురళీ ఆర్ట్సు వారి

# దేవత

దర్శకత్వం: K.హేమాంబరధరరావు
నిర్మాత: B.పురుషోత్తం

వాణీ రిలీజ్

VIJAYA PUBLICITIES

# యువ

## సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 12 సెప్టెంబరు, 1965 సంచిక 3


విశాఖపట్టణంలో ఉక్కు-ఫాక్టరీని స్థాపించడానికి ఆటంకాలు చాలా తయారవుతున్నవి. ఏమయినాసరే సేలంలో ఫాక్టరీని స్థాపించడానికి మదరాసు ప్రభుత్వం పట్టుబట్టుకు కూర్చున్నది. మదరాసు ప్రభుత్వం పరరాష్ట్రాల అభివృద్ధికి ఆటంకం కలిగేలాగున తమ రాష్ట్రాభివృద్ధికి చేసే ప్రయత్నాలను కాదనడానికి ఎవరికీ ధైర్యమున్నట్లు లేదు. ఈనాడు భారతదేశంలో అన్నివిధాలా చాలా ముందుకు వచ్చిన రాష్ట్రం మద్రాసు రాష్ట్రమే. అయినప్పటికీకూడా, ఇరుగుపొరుగు రాష్ట్రాలలో ఏ ప్రాజెక్టు ప్రారంభించడానికి ఆలోచనలు జరిగినా, దానికి ప్రతిగా ఒక ప్రాజెక్టును తయారుచెయ్యడం, దానికి అవసరమైన పరిశీలనా కార్యక్రమాలను కేంద్రప్రభుత్వంతో సంప్రతించకుండానే జరిపడం, ప్రాథమిక కార్యకలాపాలు పూర్తి అయినవి కనుక ఆ ప్రాజెక్టును మా రాష్ట్రంలోనే పెట్టితీరాలి అని పట్టుబట్టి తమ ప్రయత్నాలను సార్థకంచేసుకోవడం మదరాసు రాష్ట్రానికి పరిపాటి అయింది సేలం ఉక్కు-ఫాక్టరీ విషయంలో మదరాసు అవలంబించిన విధానం అదే. చిట్టచివరకు, సేలంలో ఉక్కు-ఫాక్టరీని పెట్టకతప్పనిపరిస్థితి ఏర్పడింది. ఈ ఫాక్టరీ నిర్మాణానికి అవసర చర్యలను తీసుకొనడానికి కేంద్రప్రభుత్వం అంగీకరించింది. నాల్గవ పంచవర్ష ప్రణాళికలో దేశంలో, ఇప్పుడున్న మూడు ప్రభుత్వ ఉక్కు-ఫాక్టరీలు కాక మరొక ఉక్కు-ఫాక్టరీని స్థాపించడానికి నిర్ణయించిన కేంద్రప్రభుత్వం, సేలంలో

పెట్టబోయేనాటితో రెండు ఫాక్టరీలను స్థాపించవలసివస్తోంది. సేలంలో ఒకటి పెట్టినట్లయితే, మరొకదానినికూడా స్థాపించడం సంభవిస్తుందో, లేక డబ్బు చాల దనే నెపంతో దానిని వాయిదావెయ్యడమో, లేక అసలు మానివెయ్యడమో జరుగు తుందేమో తెలియదు.

ఏమంటే, నాల్గవ ప్రణాళికలో స్థాపించబోయే ఉక్కు ఫాక్టరీకి సూచింపబడిన మూడు స్థానాలలో ఒకటి సేలం. సేలంలో ఎలాగా ఒక ఫాక్టరీని పెడుతూన్నప్పుడు, ఇంకొకచోట మరొక ఫాక్టరీని పెట్టడం అవసరంలేదు అనే వాదం అక్కడక్కడా వినపడుతూవున్నది. ఈ వాదం బలిసి, కేంద్రప్రభుత్వం యీ వాదానికి లొంగిపోయిన ట్లయితే, నూరుసంవత్సరాల తరువాతకూడా ఆంధ్రదేశం బాగుపడడానికి వసతి దొరకదు. ఒకవేళ సేలంలో ఉక్కు ఫాక్టరీకాక, మరొక ఉక్కు ఫాక్టరీనికూడా స్థాపించడం జరిగేటట్లయితే, దానిని ఎక్కడ స్థాపించాలి అనే విషయంలోకూడా ఆంధ్రదేశానికి వ్యతిరేకంగా ప్రచారం ప్రారంభమైంది.

ఉక్కు ఫాక్టరీని స్థాపించడం విషయంలో ప్రత్యేక పరిశీలన జరిపిన ఆంగ్లో-అమెరికన్ కన్సార్టియంవారు, విశాఖపట్టణం అన్నివిధాలా అనుకూలంగా వున్నదని తమ అభిప్రాయాన్ని ప్రకటించారు. ఈ అభిప్రాయం పక్షపాతంతో కూడుకుని వున్నదనే ప్రచారం ఒకటి మెల్లిగా ఆరంభమైంది హోస్పేటలో ఉక్కు ఫాక్టరీ స్థాపించడానికి, విశాఖపట్టణంకన్నా ఎక్కువ వసతులు వున్నా, విశాఖపట్టణానికి అగ్రస్థానం ఇస్తూ అభిప్రాయాన్ని ప్రకటించడంలో, ఆంగ్లో-అమెరికన్ కన్సార్టియం, ఉక్కుశాఖామంత్రి ఆంధ్రుడు కావడం దృష్టిలో పెట్టుకొని, ఆయనను మెప్పించడానికి ప్రయత్నించిందనే అభిప్రాయాన్ని ఇటీవల మదరాసులోని ఒక ఇంగ్లీషుపత్రిక ప్రకటించింది. ఇలాటి మెత్తటి ప్రచారాలవల్ల, ఆంధ్రులకు అన్యాయం జరిగే అవకాశం క్రమక్రమంగా ఏర్పడుతున్నది.

విశాఖపట్టణంలో ఉక్కు ఫాక్టరీ నిర్మాణం పూర్తి అయినదాకా, అక్కడ ఫాక్టరీ పూర్తిగా ఆంధ్ర రాష్ట్రానికి దక్కుతుందని మనం నమ్మడానికి వీలులేని పరిస్థితి ఏర్పడింది. ఆంగ్లో అమెరికన్ కన్సార్టియం సూచించిన ప్రకారం ఉక్కు ఫాక్టరీని విశాఖపట్టణంలోనే పెట్టాలని, ఆంధ్రు లందరూ ఒక్కుమ్మడిగా కేంద్ర ప్రభుత్వం మీద వత్తిడి తేవాలి. కేంద్ర ప్రభుత్వం పెట్టబోయే పరిశ్రమ లన్నిటినీ, ప్రారంభించే ప్రాజెక్టు లన్నిటినీ మదరాసు రాష్ట్రంలోనే స్థాపించాలనీ, అలా స్థాపించకపోతే కేంద్ర ప్రభుత్వం దక్షిణ దేశంమీద శీత కన్నువేసిందనే భావం ప్రజలలో పాతుకొనిపోతుందనీ, దక్షిణదేశం అంటే మదరాసు రాష్ట్రమే ననీ

జయప్రదమైన ప్రచారం సాగించుతూ వున్న మదరాసు ప్రభుత్వం, కేంద్రప్రభుత్వం ప్రాజెక్టుల నెన్నిటినో తన రాష్ట్రంలో ఏర్పరచుకొన్నది.

దక్షిణదేశం అంటే మదరాసు మాత్రమే కాదనీ, దక్షిణంలో వున్న రాష్ట్రాలలో మదరాసు పారిశ్రామికంగా చాలా ముందుకు వచ్చింది కనుకనూ, ఆంధ్ర రాష్ట్రం చాలా వెనుకబడి వుంది కనుకనూ, కేంద్రప్రభుత్వం ఇకముందు పెట్టబోయే పరిశ్రమ లన్నిటినీ, మదరాసుతోనూ, మైసూరుతోనూ సమానంగా ఆంధ్ర రాష్ట్రంకూడా అభివృద్ధి పొందేవరకూ ఆంధ్ర రాష్ట్రంలోనే పెట్టాలనీ మనం ఆందోళన చెయ్యాలి.

ఇలాటి ఆందోళన ఫలవంతం కావాలంటే, ఇది ఒక పార్టీవల్ల అయేదికాదు. కాంగ్రెసు, కమ్యూనిస్టు, స్వతంత్ర, ప్రజాపక్షాలన్నీ కలసి ఆందోళనచేయాలి. రాష్ట్ర శాసనసభలో ఏకగ్రీవంగా తీర్మానాలు జరగాలి. పార్లమెంటులోని ఆంధ్ర సభ్యులంతా కలసి ప్రధానమంత్రినీ, ప్రెసిడెంటునూ ఆంధ్రరాష్ట్రానికి న్యాయం జరిగేటట్టు చూడమని అర్థించాలి.

విశాఖపట్టణంలో ఉక్కు ఫాక్టరీని స్థాపించడానికి కేంద్ర ప్రభుత్వం ఏ విధమయిన ఆటంకాలను సూచించినా, ఆంధ్ర శాసనసభ్యులూ, ఆంధ్రమంత్రులూ, పార్లమెంటులోని ఆంధ్రసభ్యులూ, కేంద్ర ప్రభుత్వంలోని ఆంధ్రమంత్రులూ రాజీనామా ఇవ్వాలి.

ఉక్కు ఫాక్టరీ నిర్మాణం ఆంధ్రులకు ఒక సమస్య. ఇది ఆంధ్రుల గౌరవానికే కాక, ఆంధ్రజాతి మనుగడకే సంబంధించినది ఉక్కు ఫాక్టరీ ఆంధ్రలో పెట్టకపోతే, ఆంధ్రలోని ముడి ఇనుము పరరాష్ట్రానికి పోతుంది. ఆంధ్రలో పరిశ్రమలు అభివృద్ధికి రావు. ప్రజల జీవన ప్రమాణం పెరగదు.

దేశమంతకీ చెందిన కేంద్ర ప్రభుత్వపు డబ్బుతో పెట్టిన నైవేలీ ప్రాజెక్టులో వుత్పత్తి అయే విద్యుచ్ఛక్తిని, పొరుగున వున్న ఆంధ్ర రాష్ట్రానికి కొంత ఇవ్వడానికి నిరాకరిస్తున్న మదరాసు ప్రభుత్వం ఆంధ్ర రాష్ట్రపు పారిశ్రామికాభివృద్ధిని సహిస్తుందని మనం భ్రమపడరాదు. మన అభివృద్ధికి మనం కృషి చెయ్యవలసిందే. మన హక్కుల రక్షణకు మనం ఆందోళన సాగించవలసిందే. ఈ విషయంలో ఉదాసీనత చూపే ఆంధ్రుడు — సామాన్య పౌరుడైనా, శాసన సభ్యుడైనా, మంత్రి అయినా, పార్లమెంటు సభ్యుడైనా కేంద్రమంత్రి అయినా క్షమార్హుడు కాడు. విశాఖపట్టణంలో ఉక్కుఫాక్టరీని సంపాదించుకోలేకపోతే, మనం తల యెత్తి తిరుగలేము. ఒక రాష్ట్రంగా ముందుకు రాలేము.



# చిత్రావార్తలు



మాస్కోయందు జరిగిన చతుర్థ అంతర్జాతీయ చలనచిత్ర ప్రదర్శనల సందర్భాన రాజకపూరు దంపతులు క్రెమ్లిన్‌కు వెళ్ళినప్పటి చిత్రం.



శ్రీమతి ఇందిరాగాంధీ మాస్కోలో పత్రికాప్రతినిధులను కలుసుకున్న దృశ్యం.



అగ్రస్థావరాలలో జవాన్‌లకు శిక్షణ నిస్తున్న దృశ్యం.



'దార్ ఎస్ సలాం' ఎగ్జిబిషన్‌లో ఇండియా ప్రదర్శనను తిలకిస్తున్న టాన్‌జానియన్స్.

· గల్పిక

# వచనకవితా - 'మహాపరుగు శ్రీ'

—గోపాలచక్రవర్తి

ఆ మహానగరంలో వచనకవులు ఎక్కువయ్యారు. వీళ్ళందరిదీ ఇంచుమించు ఒకే మనస్తత్వం. బస్సు దిగుతూన్నప్పుడో ఎక్కుతూన్నప్పుడో ఎవడైనా పరిచయస్థుడు కనబడగానే జేబులోనుంచి కట్టలు తీస్తారు. "అన్నా ఈ పద్యం విను" అనగానే పరిచయస్థుడు ఒక్కొక్కప్పుడు ఏడుపుమొహం పెట్టి ఈ వచన కవి కబంధహస్తాల్లోనుంచి తప్పించుకోవడానికి ప్రయత్నం చేస్తాడు.

ఇటీవల ఒక చెప్పుకోదగ్గ సంఘటన జరిగింది. ఆ రోజు ఏదో పర్వదినం. నగరంలో ఆటల పోటీలూ, పాటల పోటీలూ జరుగుతున్నాయి. ఎల్లెడలా సంగీతం వినిపిస్తున్నది. ఒకచోట రన్నింగురేసు జరపడానికి కొందరు ఉత్సాహ వంతులు ప్రయత్నం చేస్తున్నారు. ముగ్గుతో గీతలు వేసారు. పందెంలో పాల్గొనేవాళ్ళంతా బరిమీద నిలబడ్డారు. సరిగా ఆ సమయంలో ఏమైందంటే, ఒక ప్రేక్షక మిత్రుణ్ణి ఒక గిరజాల వచనకవి చూశాడు. జేబులోంచి కట్టలు తీయ బోతున్నాడు. మిత్రుడు గుండె పీచుపీచు మంది. ఒక పర్వదినం అనవసరంగా పాడయిపోతున్న దనే భావం కలిగింది. రన్నింగ్ రేస్ పర్యవేక్షకుడు విజిల్ వేశాడు. పదిమంది పరుగు మొదలుపెట్టారు. వచనకవిగారి మిత్రుడుకూడా పరుగుకు లంకించుకున్నాడు ఎమిపరుగు అది! పందెపు గుర్రాలుకూడా అలా పరిగెత్తవు రామబాణంకూడా అంత వడిగా వెళ్ళదు. గమ్యస్థానం వొచ్చే స్తున్నది. సైకిళ్ళమీద జనం వెంబడిస్తున్నారు. వచనకవి మిత్రుడు అకస్మాత్తుగా గీత దాటాడు. పరుగులో నెగ్గాడు. ట్రాఫీ గెల్చుకున్నాడు. ఆ రోజున అతనిని ఊళ్లో బ్యాండుతో ఊరేగించారు. రన్నింగ్ రేస్‌లో నెగ్గినందుకు 'మహాపరుగు శ్రీ' అనే బిరుదుకూడా ఇచ్చారు.

నీతి: వచనకవితవలన ఎన్నో ప్రయోజనాలు.

చదవండి, ప్రకటనలు ఇవ్వండి!

# 'ఆంధ్ర ప్రదేశ్'

ప్రతి కుటుంబమూ చదవవలసిన సచిత్ర మాస పత్రిక
ఇంగ్లీషు, తెలుగు, ఉర్దు, హిందీ భాషలలో ప్రచురించబడుచున్నది.
సర్క్యులేషన్ :- 82,000 ప్రతులు.
ప్రకటనలకు ఉత్తమ సాధనం.

ప్రకటన రేట్లు

| భాష | 2వ, లేక 3వ పూర్తి కవరు పేజీ రేటు | పూర్తి పేజి రేటు | 2, 3 కవరు పేజీలు కాక యితర సగం పేజీలకు రేటు |
|---|---|---|---|
| | రూ. | రూ. | రూ. |
| ఇంగ్లీషు | 400 | 300 | 150 |
| తెలుగు | 500 | 400 | 200 |
| ఇంగ్లీషు, తెలుగు (సంయుక్తంగా) | 600 | 500 | 250 |
| ఉర్దు లేక హిందీ | 75 | 50 | 25 |
| ఉర్దు, హిందీ (సంయుక్తంగా) | 100 | 75 | 40 |

ఇతర వివరములకు సంప్రదించండి:-

టి. రామచంద్రరావు
డైరెక్టర్
సమాచార, పౌర సంబంధ శాఖ
హైదరాబాదు.

# సాగరసంగమము

ఆనందారామం

[చాలా వింతపరిస్థితిలో సుధాకర్‌కు మానస పరిచయమై, అతనిలో ఆమెపై ప్రేమ అంకురించింది. సుధాకర్ పినతల్లికూతురు నిరంజని అతని విషయం తెలుసుకొని మానసకూ తమకూ ఎంతో అంతరం ఉన్నదని చెపుతుంది. కాని సుధాకర్ మానస మీది ప్రేమను మరల్చుకోలేకపోయాడు]

—తరువాత

## 3

రాత్రి పదిగంట లయింది. భోజనాలు పూర్తి చేసి అందరూ నిద్రపోతున్నారు. చీపురు చప్పుడు వినిపించి మానస పక్కమీదనుంచి లేచివచ్చింది. అన్నపూర్ణమ్మగారు వంటిల్లు కడుక్కుంటున్నారు.

"అమ్మా! ఇంత వయసు వచ్చీ నీకెందు కీ యాతన? నువ్వు ఇవతలకు రా, నేను కడుగుతాను." అంటూనే రెండడుగులు ముందుకు వేసింది మానస.

అన్నపూర్ణమ్మగారు గాభరా పడిపోతూ "ఆ! ఆ! మానసా! నువ్వు లోపలకు రావద్దు. నేను కడుక్కుంటాను. నువ్వు పోయి పడుకో." అంది.

మానస ఆగిపోయి "అదేమమ్మా! నీ మడికి నేనుకూడా పనికిరానా?" అంది. ఆమె కంఠధ్వనిలో ఏదో ఆవేదన అవ్యక్తంగా ధ్వనించింది. వెంటనే అన్నపూర్ణమ్మగారు తను చీపురు క్రింద పడేసి బయటకు వచ్చి కూతురిని దగ్గరగా తీసికొని ఆర్ద్రకంఠంతో "అయ్యో! ఎంతమాటన్నావే? నాకు లోకమంతా నీ తర్వాతనే! ఆ ఒక్క దేవుడి గడిమాత్రం నా కోసం, నా ఒక్కదానికోసం అని కేటాయించుకొన్నాను. నువ్వు వీల్లేదంటే అది కూడా వదిలేస్తాను." అంది. ఆమె కంఠస్వరంలోనూ ఏదో గంభీర విషాదం దోబూచులాడింది. మానస కరిగిపోయింది.

"వద్దమ్మా! ఊరికే నువ్వు కడుక్కుంటూంటే చూడలేక అన్నాను. నీకెలా తృప్తిగా ఉంటే అలాగే చేసికో!" అంటూ వెళ్ళి మళ్ళీ మంచంమీద పడు




కుంది. ఆ రాత్రి నిశ్శబ్దతలో అన్నపూర్ణమ్మగారు మళ్ళీ స్నానం చేస్తున్న చప్పుడు చక్కగా వినిపించింది మానసకు. తనను ముట్టుకున్న కారణంగా, తిరిగి స్నానం చేసి మరీ దేవుడి గదిలోకి వెళ్తుంది. తను నిష్కారణంగా తల్లికి మరింత కష్టం కలిగించినందుకు చాలా బాధపడింది మానస. అయినా తన తల్లికి, మరీ, ఇంత చాదస్తమేమిటో? కన్నకూతుర్ని ముట్టుకుంటే

కూడా తిరిగి స్నానం చెయ్యాలా? అమ్మ దినచర్య అంతా ఈ మడి తడుల తోనే గడుస్తుంది. తనకు జ్ఞానం వచ్చిన దగ్గర్నుంచీ ఒక్కసారయినా అమ్మా, నాన్నగారూ కులాసాగా మాట్లాడుకోగా చూడలేదు. నాన్నగారు అమ్మకెంతో గౌరవమిస్తారు. ప్రతి విషయంలోనూ, ఆమె సలహా పాటిస్తారు. అయినా చిలిపిగా అల్లరిగా మాత్రం ఎన్నడూ మాట్లాడరు కొంపదీసి, నాన్నగారితో మాట్లాడటానికి కూడా అమ్మకు తన మడి అడ్డం కాదుగదా! అయినా, ఇద్దరూ మాత్రం తనమీద అమృతం వర్షిస్తారు. అమ్మ మరీను. తనే ప్రాణం, తనే లోకం. ఒక్కరోజు కాలేజినుండి రావడానికి, ఒక్క క్షణం, అలస్యమయితే చాలు, అమ్మముఖం చూడాలి. లోకంలోని ఆవేదన అంతా తన ముఖంలోనే నివాసం చేస్తుంది. దేవత అమ్మ. తన మూలంగా అమ్మ మనస్సుకు ఎన్నడూ ఏ విధంగానూ నొప్పి కలుగకూడదు. తను కాలెజీనుండి వచ్చి బట్టలు మార్చుకుని, స్నానం చేసి మరీ లోపలకు వస్తే అమ్మ నవ్వుతూ "ఈ చాదస్తాలన్నీ నాలో జీర్ణించుకు పోయి, ఎలానూ నన్ను వదలవు. నీకుకూడా ఎందుకూ?" అంటుంది.

"మరి కాలేజీ బట్టలతో వస్తే ఇంట్లో తిరగనిస్తావా?" ఆశ్చర్యంగా అంది తను.

"ఆ! ఇల్లంతా నీ ఇష్టం. ఎలా తిరిగినా నే నేం అడగను. నా దేవుడిగది మాత్రం నాకు వదిలెయ్యి, చాలు!" అంది

అమ్మ అలా అనడానికి తనమీది వాత్సల్యమే కారణమని తన ఊహ. అయినా అమ్మ అలా అన్నంత మాత్రాన, తను అమ్మకిష్టంలేని పనులు చేయగలదా? సాయంత్రం కాలేజీనుండి వచ్చి స్నానం చేస్తుంటే. అమ్మ కళ్ళలో ఎంతజాలీ!! "ఇంకా నిద్రపోలేదా మానసా?" పీట తలక్రింద పెట్టుకొని కటికనేలమీద నడుం వాల్చబోతూ అడిగారు అన్నపూర్ణమ్మగారు.

తనతల్లి అలా పడుకోవడం మానస ఎంతమాత్రం సహించలేదు. అయినా ఆమె అశక్తురాలు ఎన్ని విధాల మానస ప్రయత్నించినా తల్లిని మంచం మీద కానీ, పరుపుమీద కానీ, చివరకు చాపమీదకానీ పడుకోబెట్టలేకపోయింది. ఒకరోజు మానస తనుకూడా క్రింద పడుకొని "నువ్వు మంచంమీద పడుకొంటేనే కాని, నేనూ పడుకోనూ," అని పట్టుబడితే అన్నపూర్ణమ్మగారు, ఎన్ని విధాల లాలించి బుజ్జగించినా మానస తనపట్టు విడువలేదు. చివరకు అన్నపూర్ణమ్మగారు విసిగి "మానసా! నువ్వు క్రింద పడుకోటానికి వీలులేదు, లేచి మంచంమీద పడుకో," అని ఆజ్ఞాపించింది. అన్నపూర్ణమ్మగారు సాధారణంగా ఎవ్వరినీ ఆజ్ఞాపించదు.




---

ఎప్పుడూ వెన్నెలవలె మందహాసం వెలిగే ఆమె ముఖం గంభీరమయి శాంత దృఢ స్వరంతో ఆజ్ఞాపించినపుడు మాత్రం, ఆ ఆజ్ఞను కాదనేశక్తి ఆ ఇంట్లో ఎవరికీ ఉండదు. మానస అంత పట్టుదలా ఏమయిపోయిందో, వెంటనే లేచి మంచంమీదకు వచ్చేసింది. ఇవాళ్ళ తల్లి కటిక నేలమీద పడుకుంటూంటే, మళ్ళీ మానస కెంతో కష్టం కలిగింది. వద్దని చెప్పే సాహసంమాత్రం లేదు.

"అమ్మా! నువ్వన్ని విషయాలలోనూ, ఎంతో సంస్కారం కలదానిలాగా ప్రవర్తిస్తావు. ఇంత తీవ్రమైన మడి ఏమిటమ్మా!" అంది.

"ఏం? ఇలా మడిగా ఉండటం సంస్కారం కాదంటావా?" అంది అన్నపూర్ణమ్మ.

"ఎవరినీ ముట్టుకోకూడదనటం, ముట్టుకుంటే స్నానం చెయ్యాలనడం, కులతత్వం, ఇదంతా సంస్కారమంటారా!"

"సంస్కారమని దేన్నంటారో దేన్ననరో నాకు తెలియదే మానసా! కానీ, నేను హిందూకుటుంబానికి చెందినదాన్ని. ప్రాచీన హైందవ సంప్రదాయానుసరణమే నా లక్ష్యం. కులవిభజన మన జాతీయ జీవన విధానానికి తగినది ఇన్ని కులా లున్నాయి. ఏది ఎక్కువ, ఏది తక్కువ అన్న ప్రశ్నలేదు. దేని ఎక్కువ దానిది; ఎవరి ఆచారాలు వాళ్ళవి.

వాళ్ళవాళ్ళ మనస్తత్వాలను బట్టీ, అనుసరించే జీవనవిధానాన్ని బట్టీ ఆచారాలూ, సంప్రదాయాలూ ఉంటాయి 'నాకు కులం పట్టింపు లేదు. అంతా ఒకటే' అని నోటితో అంటూ, ప్రవర్తనలో మాత్రం కులపక్షపాతం చూపించేవాళ్ళందర్నీ ఏమంటావు? ఒక విధానం నా కలవాటయింది. అది అమాంతంగా మార్చుకోవలసినంత దోషంకానీ, అవసరంకానీ నా కందులో కనుపించలేదు. ఇంకో కులంవాళ్ళను ముట్టుకోను. నిజమే. కాని, నా మనసుకి మాత్రం ప్రపంచంలోని వ్యక్తు లందరూ సమానమే! అందర్నీ ఒక్కలాగ అభిమానిస్తాను ధర్మము కాలాధీనము. కానీ అన్ని ధర్మాలకూ అతీతమయినది హృదయము. దీనిని నీ గురువుగా స్వీకరిస్తే నువ్వెప్పుడూ న్యాయమార్గంలోనే నడుస్తావు. ఈ ఆచారాలు వదిలివేయుటానికి నా హృదయం అంగీకరించదు. అత్యంత సున్నితమైన నా హృదయాన్ని క్షోభింపచేసి కులతత్వాన్నీ, ఆచార సంప్రదాయాల్నీ వదలుకోవలసిన అవసరమే మొచ్చింది చెప్పు? ఇంకొక సంగతి; ఇదంతా కేవలం నా ఒక్కదానికే సంబంధించినది ఇంకెవర్నీ, చివరకు నిన్ను గూడా, నేను ఇదే మార్గంలో నడవమని శాసించను. మీకు న్యాయమని తోచిన మార్గంలో మీరు నడవండి."

ఇంక మాట్లాడవలసింది లేనట్లు అటు తిరిగి కళ్లు మూసుకొన్నారు అన్నపూర్ణమ్మగారు. మానసకూడా విధిలేక కళ్ళు మూసుకుంది. కానీ. తిరిగి తిరిగి తల్లిమాటలే ఆమె గుండెలలో ప్రతిధ్వనిస్తున్నాయి. తను తన తల్లిని అనుసరించకపోయినా ఆమె అభ్యంతరపెట్టదు. కానీ. తన తల్లిని వ్యతిరేకించటమే! అమ్మో! జన్మలో అలాంటిపని జరగదు. అయినా కులతత్వం హైందవ జాతీయ జీవన విధానంలో జీర్ణించుకుపోయింది. విదేశీయ పరిపాలనా ప్రభావం వలననే ఇది దురాచారమనే అభిప్రాయం ప్రజలలో వ్యాప్తమయింది కానీ మొదటి నుండీ ఇటువంటి కులాచారాలను పాటించుకొంటూనే మనవారంతా సుఖసంతోషాలతో నివసించారు విదేశీయులను అన్నివిధాలా అనుసరిస్తున్నాం మనం ఎందుకు అనుకరించాలి? ఎవరి అలవాట్లూ, ఎవరి సంప్రదాయాలూ ఎవరు వదులుకొంటున్నారూ ఒక్క మనం మాత్రం వెంగళప్పల్లా ఎవరినిపడితే వారిని అనుకరించడానికి తయారవుతున్నాం ఈ ఆలోచనల మధ్య ఎప్పుడో నిద్రపట్టేసింది మానసకు.

## 4

రాత్రి భోజనాలయిన తరువాత మానస మంచంమీద పడుకొని ఏవో నవల చదువుకొంటూంది, "మానసా!" అని పిలచిన ధర్మారావు గొంతుక వినిపించి చప్పున లేచికూర్చుంది. ఆ సమయంలో సాధారణంగా ధర్మారావు ఎప్పుడూ





"చూడమ్మా! నీవు ఎం. ఏ. చదువు, పిహెచ్. డి. చదువు,
కాని, పాలిటిక్స్‌లో మాత్రం దిగొద్దు."

మానస గదిలోకి రాడు దానితోడు అతని ముఖం ఎప్పటిలా ప్రశాంతంగా లేకుండా అదోక మాదిరిగా ఉండటంతో మానస అతనివంక వింతగా చూస్తూ "ఏం కావాలి బావా?" అంది

"నువ్వు కొంచెం సేపు డాబామీదికి రాగలవా?"

ధర్మారావు గొంతు వణికింది మానస మరింత తెల్లబోయింది. వెంటనే లేచి "అమ్మ నడిగివస్తాను" అని వంటింట్లోకి వెళ్ళింది. ధర్మారావుముఖం కొద్దిగా నల్లబడింది. చేతులు వెనక్కు కట్టుకొని అశాంతిగా అటూ ఇటూ తిరుగసాగాడు. కొద్ది క్షణాలలోనే మానస వచ్చి "అమ్మ వెళ్ళమంది; రా!" అంటూ తనే పైకి దారి తీసింది.

ద్వాదశిచంద్రుని చల్లని కాంతులలో పైకి ప్రాకిపోయిన మాధవీలత నీడలు దోబూచులాడుతుంటే ఇద్దరూ డాబా పైన కూర్చున్నారు.

"నాతో కొంచెంసేపు ఇక్కడికి రావడానికికూడా అమ్మ నడగాలా. మానసా?" అన్నాడు ధర్మారావు.

అతని గొంతు జీరలో, అతని హృదయంలోని ఆవేదన స్పష్టంగా ప్రతిబింబిస్తోంది.

ఇంతచిన్న విషయానికి బావ ఎందుకింత బాధపడాలో మానస కర్థంకాలేదు.

"ఇందులో తప్పేముంది! అమ్మ నడగకుండా ఏ పనైనా చేశానా బావా?"

"ఒకవేళ్ళ అత్తయ్య నిన్ను పైకి వెళ్ళవద్దని అందే అనుకో! అప్పుడు?"

"మానేస్తాను!" నిశ్చింతగా అంది మానస. ధర్మారావు ముఖం పూర్తిగా నల్లబడింది. లోగొంతుకతో "అంతేనా? పోనీ, కనీసం రాలేకపోయినందుకు బాధపడ్తావా ?"

మానస కీ సంభాషణంతా అయోమయంగా ఉంది.

"నువ్వివాళ చాలా చిత్రంగా మాట్లాడుతున్నావు బావా! ఎందుకిలా నన్ను ఇరుకున పెడ్తున్నావూ ?"

"చాలా చిన్నప్పటినుంచీ మనం కలిసి మెలిసి తిరుగుతున్నాం మానసా! అయినా ఇప్పటికీ నిన్ను సరిగా అర్థం చేసికోలేకపోతున్నాను."

"అంత తలపగలకొట్టుకోవలసిన అర్థం కాని దేముంది బావా నాలో? ఐనా, ఒకవేళ అర్థం కాకపోతే మాత్రం కొంప మునిగిపోయేదేముంది?"

ధర్మారావు బరువుగా నిట్టూర్చాడు.

"నువ్వు ఎదుటి వ్యక్తుల్ని బొత్తిగా అర్థం చేసుకోలేవు మానసా!"అన్నాడు.

మానస ధర్మారావు కభిముఖంగా కూర్చుని మాట్లాడుతున్నదల్లా గిరుక్కున వెనక్కు తిరిగింది. ఎంతకూ మానస దగ్గర్నుంచి ఏ సమాధానమూ రాకపోయేసరికి ధర్మారావు మళ్ళీ "మానసా" అని పిలిచాడు; అప్పటికీ మానసదగ్గర్నుంచి సమాధానం రాకపోవటంతో, ధర్మారావు చటుక్కున కూర్చున్నచోటునుంచి లేచి, మానస ప్రక్కగా వచ్చి తన చేతులతో ఆమె ముఖాన్ని తన వైపుకు తిప్పుకొని నీళ్ళు నిండిన ఆమె కళ్ళు చూసి, ఆశ్చర్యంతో, బాధతో, "నిన్నంత నొప్పించానా మానసా ?" అన్నాడు. ఆశించని ఈ హఠాత్సంఘటనకు మానస విచలితురాలై, వణికిపోతూ తన ముఖాన్ని ధర్మారావు చేతులనుండి తొలగించుకొని అక్కడినుండి లేచి గోడ కానుకొని నిలబడింది. ధర్మారావు తనుకూడా లేచి, ఆమెకు కొంచెం దగ్గిరగా వచ్చి, నన్ను క్షమించు మానసా! ఇంక క్రిందకు పోదాం పద." అన్నాడు.

మానస తలెత్తి, కళ్ళు తుడుచుకుని, "ఇంతకూ నువ్వు నన్ను పైకి పిలిచింది, నన్ను తెలివితక్కువ దాన్నని చెప్పి ఉడికించటానికా?" అంది.

ధర్మారావు పోబోతున్నవాడు ఆగి ఆశ్చర్యంగా మానస ముఖంలోకి చూశాడు. ఆమె కన్నీటికి కారణం, కేవలం ఉడుకుమోతుతనమే అని అర్థమయిన తరువాత అతని గుండెలలోంచి కొండంత బరువు దింపినట్లయింది. "ఇప్పటికీ నేను చెప్పదలచుకొన్నది నీ కర్థం కాలేదా?" అన్నాడు నమ్మలేనట్లు.



"నేను తెలివితక్కువదాన్నని నువ్వే అన్నావుగా!" రోషంగా అంది మానస.

ధర్మారావు నవ్వి "నాకు మెడ్రాస్‌లో ఉద్యోగ మయింది," అన్నాడు.

"అది చెప్పడానికా ప్రత్యేకం ఇక్కడకు లాక్కొచ్చావు? ఆ సంగతి నాకు తెలిసిందేగా!"

"అదికాదు..."

ఇంకా సస్పెన్సేనా?"

ధర్మారావు ఏం మాట్లాడకుండా అటూ ఇటూ తిరగడం మొదలు పెట్టాడు. మానస అసహనంగా తన చూపులతో అతనిని వెంబడించసాగింది. ధర్మారావు ఆగి మానస ముఖంలోకి చూస్తూ "నతో నిన్నుకూడా మెడ్రాస్ తీసికెళ్దా మని అనుకొంటున్నాను," అన్నాడు.

మానస నిర్ఘాంతపోయింది.

"అదెలా సాధ్యం· అమ్మ ఒప్పుకుంటుందా?"

"నువ్వు నా భార్య వయినపుడు ఎవరు మాత్రం ఒప్పుకోక ఏం చేస్తారూ? మానసా నిన్ను వదిలి ఉండాలనే ఆలోచననుకూడా నేను సహించలేకపోతున్నాను నేను చెప్పదలచుకున్న దింతే! నీ సమాధానం చెప్పు."

మానస తల వంచుకుని అలానే స్థాణువులా నిలబడింది. ఎంతకూ ఆమె దగ్గరనుండి ఎలాంటి ప్రతివచనమూ రాకపోవడంతో ధర్మారావు తిరిగి "ఏదో ఒకటి మాట్లాడు మానసా!" అన్నాడు.

మానస నెమ్మదిగా తలెత్తి వణుకుతున్న గొంతుకతో అంది —

"ఇట్లాంటి విషయంలో నా సమాధాన మేముంటుంది బావా! అమ్మ సమాధానమే నా సమాధానం."

"అత్తయ్య సమాధానంగురించి నాకేం సందేహం లేదు, కానీ నువ్వు చెప్పేదేమీ లేదా?"

మానస తన కనురెప్పలు బరువుగా ఎత్తి లిప్తమాత్రం అతని కళ్ళలోకి చూసి రెప్పలు వాల్చుకుంది.

"సరే! క్రిందకు పద." అంటూ మెట్లవైపు నడిచాడు ధర్మారావు. మానస మౌనంగా అతడి ననుసరించింది.

## 5

ధర్మారావు తన నిర్ణయాన్ని, అన్నపూర్ణమ్మగారికి తెలియజేయగానే, ఆవిడ నెత్తిన పిడుగుపడినట్లయింది. కాతర స్వరంతో "వీల్లేదు ధర్మా! మానస నీ భార్య కావటానికి వీల్లేదు. మీ మనసులో ఇలాంటి ఆలోచన రాకూడదని నేను జాగ్రత్త పడుతూనే ఉన్నాను. చివరకు భయపడినంతా అయింది. మానస నీ భార్య కావటం పూర్తిగా అసంభవం ధర్మా!" అంది.

ఆశించని ఈ సమాధానానికి ధర్మారావు ఒక్క క్షణం నిర్ఘాంతపోయాడు. మరుక్షణం అతనికి లోకమంతా గిర్రున తిరుగుతున్నట్లు అనిపించసాగింది. తనదే నని నిశ్చయంగా నమ్మిన మానస తనది కాకుండా పోతుందా? ఎందుకూ? తన కేం తక్కువని? ఒక్కసారిగా అతని కేదో కారణం స్ఫురించింది. ఆ కారణం తోచగానే అతని హృదయం కసితోనూ, అవమానంతోనూ భగ్గున మండింది. పరుషకంఠంతో "నన్ను క్షమించవత్తయ్యా! మీ, నా అంతస్థులు గమనించకుండా నా కోరిక బయటపెట్టడం నాదే పొరపాటు. నన్ను క్షమించు." అంటూనే బయటకు నడిచాడు.

"ధర్మా, ధర్మా!" నిలవలేక కూలబడిన అన్నపూర్ణమ్మగారి గొంతునుండి వెలువడినది పిలుపుకాదు, ఆర్తనాదం.

చివరకు ధర్మ తన నెంత నీచంగా అర్థం చేసికున్నాడన్నదే, ఆమె అవేదన. తన హృదయంలో అనుక్షణమూ "పూర్ణా! మానసను మాత్రం మన ధర్మ భార్యగా చెయ్యకు ఇదొక్కటే నా చివరి కోరిక," యీ మాటలే ప్రతిధ్వనిస్తూంటై.

తన అన్న మరణశయ్యమీద ఉండి తనను కోరిన చివరికోరిక అది. అన్నకు ప్రమాదంగా ఉందని తెలిసి ప్రయాణమైంది తను. ఎక్కడినుంచో మానస పరుగున వచ్చి కాళ్ళను చుట్టుకుంది. అప్పటికది మూడేళ్ళ పాప! తన భర్త బలవంతంగా దాన్ని తీసికెళ్ళబోయారు. అది గోలపెట్టి ఏడ్చింది సహించలేక తనే చేతులు చాచి మానస నందుకుని "అది నా కూతురు నాతోటే, అమే ఉంటుంది." అని మానసను తీసికొనే బయలుదేరింది.

తాను చేరేటప్పటికే అన్న పరిస్థితి చాలా విషమించింది ఇవాళో రేపో అనేలా ఉన్నాడు. తనను చూడగానే అన్న కళ్ళు మెరిశాయి. "వచ్చావా పూర్ణా! నువ్వు వస్తావని నాకు తెలుసమ్మా! నువ్వు నిజంగా అన్నపూర్ణవే!" అన్నాడు




"ఆఖరికి ఇక్కడ తేలావన్నమాట"

"ఆదేమిటన్నయ్యా! నేను రా కేమవుతానూ? నీకు పరాయిదాన్నా?' అంది.

అన్నయ్య అతికష్టంగా మాట్లాడాడు "మీ వదిన అదృష్టవంతురాలు అంతా సుఖంగా ఉన్నప్పుడే దాటిపోయింది ఇద్ద రాడపిల్లల్ని మింగేశాను. ఈ ధర్మ ఒక్కడే మిగిలాడు. వాడిని నీ చేతులలో పెడుతున్నాను తల్లివైనా తండ్రివైనా నువ్వే!''

తనకు కన్నీళ్ళు కాల్వలు కట్టాయి. "అలా మాట్లాడకన్నయ్యా! జబ్బు నయమైపోతుంది అయినా, ధర్మ విషయం నువ్వు నా కంతగా చెప్పాలా? నా కళ్ళల్లో పెట్టుకొని పెంచుకొంటాను వాడికేలోటూ రానియ్యను," అంది.

అన్నయ్య కళ్ళు తృప్తిగా మూతపడ్డాయి ధర్మారావుకోసం కళ్ళతో వెతికాడు. అల్లంతదూరాన, మానసా ధర్మా కేరింతలు కొడుతూ ఆడుకోవటం అతనికి కనుపించింది. అంతటి నీరస స్థితిలోనూ వెంటనే అసహనంగా లేవబోయి తూలాడు తను పట్టుకొని సమంగా పడుకోబెట్టింది.

ఒక్కసారి తన కళ్ళలోకి తీక్షణంగా చూశాడు. తను తలవంచుకొంది అన్నయ్య బరువుగా నిట్టూర్చి "పూరా! నిన్నేమైనా, అనే అధికారం నాకులేదు కానీ, ఎలాంటి పరిస్థితుల్లోనూ, మానసా ధర్మలను భార్యా భర్తలను కానియ్యనని మాటియ్యి" అని చెయ్యి చాపాడు

తను కన్నీళ్ళు ఆపుకుంటూ, "నా కంఠంలో ప్రాణం ఉండగా ఒక్కనాటికీ అలా జరుగదు," అని జాపిన అతని చేతిలో చెయ్యి కలిపింది. అన్న తెలివితో ఉన్న ఆఖరి రోజు అదే! ఆ మరునాడే ఆతడీ లోకాన్ని వదిలిపెట్టాడు. తను అన్నకిచ్చిన వాగ్దానం పాటించడానికే శాయశక్తులా ప్రయత్నిస్తూ ఉంది. ధర్మారావు కూడా బుద్ధిమంతుడు. చక్కగా చదువుకొని ప్రయోజకుడయ్యాడు ఒకే ఇంట్లో నివసించటం వల్ల కలిగే కొద్దిపాటి చనువు తప్ప, ఏ రకమైన అనుబంధాలూ, మానసా ధర్మారావుల మధ్య ఏర్పడకుండా ఉండడానికి తను చిన్నప్పటినుండీ కృషి చేసింది. అయినా, చివరకు తను భయపడినట్లే జరిగింది. మానస మనసు ఎలా ఉందో? విషాదకరంగా తన మూలంగా ఆ లేత హృదయాలు ఎంత క్షోభిస్తాయో, కానీ తనేం చేయ్యగలదూ? ఈ లోకంలో లేని తన అన్నకు మరణశయ్యమీద ఇచ్చిన వాగ్దానాన్ని తను ఎలా భంగం చెయ్యగలదూ?

ఆ రోజు ఉదయమే బయటకు వెళ్ళిన ధర్మారావు ఆ రోజూ, ఆ తరువాత రెండు రోజులయ్యాక కూడా ఇంటికి చేరకోలేదు. అన్నపూర్ణమ్మకు మనసు మనసులో లేదు; తిండి నోటికి పోలేదు; కంటికి కునుకు రాలేదు; చివరకు నిత్యమూ భక్తిశ్రద్ధలతో కావించే భగవదారాధనలో కూడా ఆమె మనసు నిలువలేదు. మానస ముఖంలో ఎక్కడా కళాకాంతులు లేవు కాలుకాలిన పిల్లిలా ఇల్లంతా కలయతిరుగుతూంది బెంగగా తల్లిముఖంలోకి చూస్తుంది, అయితే నోరువిప్పి మాత్రం ఏం మాట్లాడలేక పోతూంది. ఆనాటిరాత్రి ధర్మారావు చూపిన భావోద్వేగం ఇప్పుడిప్పుడే అర్థం కాసాగింది. ఆ రాత్రేకాదు, అప్పుడప్పుడు ధర్మారావు. వ్యంగ్యంగా సూచించిన కొన్ని భావాలు కూడా యిప్పుడే అర్థ మవుతున్నాయి.

విచిత్రం! ఇన్నాళ్ళనుండీ ఇంత సన్నిహితంగా ఉన్నా ఒక్కసారికూడా బావపట్ల తన మనసులో అలాంటి భావమే రాలేదు ధర్మారావు గంభీర హృదయుడు. ఏ విషయంలోనూ, లేకిగా తేలిపోడు. అతని సౌందర్యానికి గాంభీర్యము ప్రత్యేకాకర్షణ నిస్తుంది

మానస ఇదమిత్థ మనలేని ఆవేదనతో కృంగిపోతూంది. తనలో యింత ఆవేదన ఎందుకూ? అమ్మ తమ వివాహానికి ఆటంకం తెలిపినందుకా? కాదేమో ననిపిస్తుంది. ధర్మారావు తనంతట తాను ఆ ప్రసక్తి తెచ్చేవరకూ, వివాహం గురించి తాను ఆలోచించనే లేదు. తరువాతనయినా ఎందుకనో, దాన్ని గురించి ఎక్కువగా ఆలోచించలేక పోతూంది. అమ్మ అంగీకరించే ఉంటే ధర్మారావును వివాహం చేసికొని




ఉండేది తన ఆవేదన అమ్మ కాదన్నందుకు కాదు. అమ్మ కాదన్నప్పటి ధర్మారావు ముఖంలో స్పష్టంగా ద్యోతకమయిన దుర్భర విషాదాన్ని తలచుకొనీ, అదు యీ మూడునాలుగు రోజులుగా ఇంటికి రాకపోవడంలో అతడనుభవిస్తున్న వ్యధను తలచుకొనీ.

ఆ తరువాత వారం రోజులకుగాని ధర్మారావు ఇంటికి జేరుకోలేదు. ఈ వారం రోజులూ, అన్నపూర్ణమ్మగారు దుర్భరమైన అశాంతితోనే గడిపారు.

ఎవరితోనూ, ఏం మాట్లాడక తన వస్తువులు సర్దుకుంటున్న ధర్మారావు దగ్గిరకు వచ్చింది మానస.

"ఇంతమంది నిలా క్షోభ పెట్టి ఇక్కడినుండి వెళ్ళిపోయే అధికారం నీకు లేదు బావా? అమ్మను చూడు!"

చివరిమాటలు ధర్మారావు వినిపించుకోలేదు,

"నేను వెళ్ళిపోవటం, నీకు బాధ కలిగిస్తుందా, మానసా?"

కళ్ళలో నీళ్ళు తిరుగుతుండగా, ముఖం పక్కకు తిప్పుకుంది మానస

ధర్మారావు ఉప్పొంగిపోయాడు. ప్రతి విషయమూ మన మనసులోని భావానుగుణంగా దర్శింపగలగటం- మానస కన్నీళ్ళు మండుతున్న అతని హృదయాన్ని పన్నీటిజల్లులా తాకాయి. అ తవరకూ అనుభవించిన ఆవేదన మంచులా కరిగిపోయింది. ఆర్ద్రస్వరంతో "నిన్ను కాదనేశక్తి నాలోదు మానసా? నీ అనుమతి లేకపోతే, నేనేమి

చెయ్యలేను." అన్నాడు.

మానస హాయిగా నవ్వింది.

"నీలో మెత్తదనంగాక, కోపం కూడా ఎంత తీవ్రంగా ఉంటుందో చాలా చక్కగా చూపించావు బావా!"

"నా కసలు కోపంలేదు," నవ్వుతూ అన్నాడు ధర్మారావు.

"దీ న్నేమంటారో!"

ధర్మారావు సమాధాన మియ్యలేదు. అన్నపూర్ణమ్మగారు ఆ క్షణంలో ఏమీ ఆలోచించే స్థితిలో లేరు. ధర్మారావుపట్ల ఆమె మనసులో నిండివున్న అనురాగమంతా వెల్లువగా ప్రవహించసాగింది. దగ్గర కూర్చుని బంతిపెట్టి తినిపించింది. ఎక్కడకు వెళ్ళావని కాని, ఎందుకు వెళ్ళావని కాని, ఒక్క మాటయినా అడుగ లేదు. మానస అంతకంటే అతడిని ఒక క్షణమైనా విడవకుండా కూడా కూడా తిరగసాగింది. ఆరోజంతా ఏవిధయిన కల్లోలమూ లేకుండా అందరికీ చాలా హాయిగా గడిచిపోయింది. ఆ మరునాడు అన్నపూర్ణమ్మగారు వీలు చూసుకొని ధర్మారావును తనదగ్గర కూర్చోపెట్టుకుని సంభాషణ ప్రారంభించింది.

"ధర్మా! పదేళ్ళ పాపడుగా ఉన్నప్పుడు నా ఒడిలోకి వచ్చావు. ఈ నాటికీ, నన్నర్థం చేసికోలేవురా?"

అన్నపూర్ణమ్మగారి మాటలకు సిగ్గుతో తలవంచుకున్నాడు ధర్మారావు.

"క్షమించ త్తయ్యా! నా కన్నతల్లిని నే నెరుగను. కానీ, నీ దయవల్ల మాతృ ప్రేమనుమాత్రం సంపూర్ణంగా అనుభవించాను. తల్లిలేని కొరత నాకేనాడూ అనుభవంలోకిరాలేదు. నీమీది కోపంతో నేను వెళ్ళిపోలేదు. కానీ..."

ధర్మారావు ఆగిపోయాడు. అన్నపూర్ణమ్మ హృదయం బరువైంది. ధర్మారావు చెప్ప దలుచుకున్న దామెకు తెలుసు. ఆమె పెదవులు వణికాయి.

"నాకు తెలుసు ధర్మా! నువ్వూ మానసా నా కళ్ళపండువుగా, భార్యాభర్తలు కావటంకన్న ఈ వయసులో నేను సంతోషింపదగింది మరొకటిలేదు. కానీ, మీ నాన్నగారికి నేను చేసిన వాగ్దానాన్ని పాలించే నిమిత్తమే, నీ కంతకఠినమైన సమాధాన మియ్యవలసి వచ్చింది."

ధర్మారావు తెల్లబోయాడు.

"చాలా విచిత్రంగా మాట్లాడుతున్నావ త్తయ్యా!"

"విచిత్రం కాదు బాబూ! నిజంగానే అలా జరిగింది. మీ నాన్నగారి చేతిలో చెయ్యివేసి, తన కొడుకును నా అల్లుడుగా ఏనాడూ చేసికోనని ప్రమాణం చేశాను. ఏది ఏలా జరిగినా ఆ ప్రమాణానికి భంగం కలిగించటం నా తరం కాదు ధర్మా!"

ధర్మారావుకు తల తిరిగింది. తను తిరిగి వచ్చినప్పటి అ త్తయ్యా, మానసల ఆదరణను చూసి, మానస తనదేనని నమ్మాడు. ఇప్పుడిక ఆ ఆలోచనకే



"పిల్లాడు, కేర్ మనగానే మూర్ఛపోయ్యాడు. ఆరుగురు ఆడపిల్లల తరువాత ఈసారికూడా ఆడపిల్ల అనుకున్నట్లున్నాడు."

తావులేదు. అత్తయ్యను తనకు జ్ఞానం వచ్చినప్పటినుండీ తెలుసు. ఆమె మాటలలో సత్యాసత్యాలను శంకించే శక్తి తనకు లేదు.

"అత్తయ్యా! నాన్నగా రావిధంగా కొట్టటానికి కారణమేమిటో నీకుతెలుసా?"

అన్నపూర్ణమ్మగారి ముఖం తెలతెల పోయింది.

"తెలుసు—కానీ చెప్పమని అడగకు. పరిస్థితుల ప్రాబల్యంవల్ల తప్పనిసరి అయితే తప్ప, ఆ సంగతులేవీ నేను ఎక్కడా చెప్పదలచుకోలేదు."

ఇక ఆ సంభాషణ పొడిగించటం ఇష్టం లేనట్లు అన్నపూర్ణమ్మగారు అక్కడి నుంచి లేచిపోయారు.

## 6

ఒక్కసారి మానసతో ఏకాంతంగా మాట్లాడాలని ధర్మారావు విశ్వప్రయత్నం చేస్తున్నాడు. కానీ, సాధ్యపడటంలేదు. మానస ఎప్పుడూ తల్లి వెంటే ఉంటోంది. అన్నపూర్ణమ్మగారి పక్కన ఉన్న మానసను వెనుకటిలా స్వతంత్రంగాపిల్చే ధైర్యం ధర్మారావుకు కలగటంలేదు. ఒక ప్రక్క నెలాఖరు మద్రాసులో డ్యూటీలో చేరవలసిన రోజు దగ్గిర కొస్తోంది. అకస్మాత్తుగా ధర్మారావు ఎప్పుడూ ఆశించని రీతిగా భగవంతు డాలసిని

కరుణించాడు. అన్నపూర్ణమ్మగారి బంధువుగా లోకతె ప్రసవించింది. ఎన్నడూ పెత్తనాలకూ, పేరంటాలకూ పోని అన్నపూర్ణమ్మను, ఆవిడ స్వయంగా వచ్చి "పాపకు, నీ ఆశీర్వాద మివ్వు పిన్నీ! నలుగుర్ని కన్నాను. కానీ, ఒక్కళ్ళూ దక్కలేదు. దీనినైనా నీ ఆశీర్వాద బలంవల్ల దక్కించుకుంటాను." అని ప్రార్థించి బలవంతపెట్టి తనఇంటికి తీసుకెళ్ళింది ఆ వచ్చిన బాంధవి కానీ, ఇటు అన్నపూర్ణమ్మగారు కానీ చిన్న పిల్ల అనే ఉద్దేశంతో మానసను రమ్మనక పోవటంవల్ల మానస ఆగిపోయింది.

"హమ్మయ్యా! ఇట్లాంటి క్షణం వస్తుందనే ఆశ పూర్తిగా వదులుకొన్నాను. ఎంతైనా పూర్తిగా దురదృష్టవంతుడ్ని కాను మానసా! ఏమంటావూ?" అన్నాడు ధర్మారావు తన మేనత్త అటు గుమ్మం దిగగానే!

మానస నిజంగానే ఆశ్చర్యపోయింది.

"ఎట్లాంటి క్షణం? ఏది అదృష్టం? ఏది దురదృష్టం?" అంది అయోమయంగా.

ధర్మారావు సమాధానం చెప్పకుండా మానస కూర్చున్న కుర్చీకి దగ్గరగా తన కుర్చీ లాక్కుని "నిజం చెప్పు మానసా! నేను కాస్త బాగుంటానా?" అన్నాడు.

మానస పకాలున నవ్వింది.

"డార్విన్ సిద్ధాంతం నీవల్ల ఋజువవుతుంది."

ధర్మారావుకూడా నవ్వి అంతలోనే గంభీరంగా "వేళాకోళం కాదు నిజంగా చెప్పు" అన్నాడు

మానస నిస్సంకోచంగా ధర్మారావు ముఖంలోకి చూస్తూ "నువ్వు చాలాచాలా చా.........లా బాగుంటావు బావా! నిజం!" అంది.

"నాకు కాస్త తెలివితేటలున్నాయా?"

"గంపెడు, తట్టెడు, బుట్టెడు, బోలెడు......"

"నేను భార్యా బిడ్డలకు తిండి పెట్టగలనా?"

"ఏమో! అది నాకు తెలియదు. ఎక్కడ లేనిదీ నీకే సరిపోదు"

"అదిగో మళ్ళీ వేళాకోళం — సరిగ్గా చెప్పు. సంపాదనపరుడి వనే అనుకోగలవా?"

"యూనివర్సిటీలో లెక్చరర్వి. నీకేం తక్కువ?"

"మరి! మరి! — నాభార్య కావటంకే స్త్రీకైనా వాంఛనీయమేనా?"

మానస ఉలికిపడింది. ఇప్పుడామెకు ధర్మారావు చెప్పబోయేది పూర్తిగా అర్థమయింది. కొంచెం ఆగి —

"కేవలం వాంఛనీయమే కాదు, బావా! అది ఆమె అదృష్టం! తన తల్లిదండ్రుల అనుమతితో నిన్ను చేపట్టగలిగే యువతి ధన్యురాలు" అంది.

మానస వేసిన ఈ ముందరి కాళ్ళ బందానికి గతుక్కుమని ఆమె తెలివిని మనసులో మెచ్చుకొన్నాడు. ఇక తను




ఏం చెప్పి ప్రయోజనం లేదని, అర్థమై ఊరుకోలేక తిరిగి "ఈ మాటలు నువ్వు మనస్ఫూర్తిగానే అన్నట్లయితే ఆ అదృష్టవంతురాలివి నువే అయి, నన్ను దురదృష్టవంతుడ్ని కాకుండా రక్షించలేవా?" అన్నాడు.

మానస వంచిన తల ఎత్తలేకపోయింది.

"నన్నెందుకిట్లా ఇరుకున పెడతావు బావా! నీకు తెలియని దేముందీ?"

"అన్నీ తెలుసు అందుకనే చెప్తున్నాను పెద్దవాళ్ళ అర్థం లేని పంతాలకు మన జీవితాలు ఆహుతి కావలసిందేనా! చిన్నప్పటినుండీ, ఒకరికోసం ఒకరుగా బ్రతుకుతున్న మనం ఎవరో ఎవరికో ఇచ్చిన వాగ్దానం కారణంగా దూరం కావలిసిందేనా?"

ఆవేశంలో ధర్మారావు ముఖం ఎఱ్ఱబడిపోయింది. అతని ఆవేశానికి తెల్లబోయింది మానస అతని మాటలలో ఒక్కటి కూడా ఆమె హృదయంలో సరిగా ప్రతిధ్వనించలేదు. ధర్మారావు అనుభవిస్తున్న ఆవేదనకు జాలి తప్ప, వేరొక భావోద్వేగత యేదీ ఆమెలో కలుగనే కలుగలేదు. మానస మాట్లాడక ఊరుకోవటం చూసిన అతడు, మానస చేతిని తన చేతిలోకి తీసుకొని "ఏమంటావు మానసా! ఎవరు అవునన్నా, ఎవరు కాదన్నా, మనం భార్యాభర్తలమే! నాతో మద్రాస్ వచ్చేయి. అక్కడ మనం లాంఛనప్రాయంగా పెళ్ళి చేసికోవచ్చు." అన్నాడు.

మానస మృదువుగా తన చెయ్యి విడిపించుకొని, అతడి ముఖంలోకి

చూసింది. ఆ ముఖం చూసేసరికి, ఆమె చెప్పాలనుకున్న అనేక విషయాలు ఆమె గొంతుకలోనే నిలిచిపోతున్నాయి. ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"నన్ను క్షమించు బావా! ఈ విషయం నువ్వు భావించినంత తీవ్రంగా నేను భావించలేకపోతున్నాను. అంతేగాక నాకు అమ్మ మాట వేదవాక్కు. నన్ను అమ్మ ఏ విషయంలోనూ నిర్బంధించదు. మనం మెడ్రాస్ పారిపోనక్కర్లేదు నేను పట్టుబడితే అమ్మ కాదనదు. కానీ, అమ్మ అభిప్రాయానికి వ్యతిరిక్తమయిన ఊహ కూడా నాకు రాదు. ఏనాడూ అమ్మ తన నోటితో మన వివాహం అసంభవ మని అందో, ఆనాటినుండీ నీ విషయంలో నాకా సంబంధమయిన ఆలోచన లన్నీ తుడిచిపెట్టుకుపోయాయి. నేను నిన్ను ఎప్పుడూ ప్రాణాధికంగా అభిమానిస్తాను. కానీ, పెళ్ళిప్రస్తావన మాత్రం వద్దు."

ధర్మారావు ఉసూరుమన్నాడు. అతనికిదంత పెద్ద దెబ్బకాదు. మానస దగ్గర నుండి ఏదో ఇటువంటి సమాధానమే ఆశించాడు. అయినా ఆశ చంపుకోలేక అడిగాడు – యుక్తవయస్కురాలు అయినా తనదైన అభిప్రాయం లేక 'అమ్మ అమ్మ' అనే ఈ మానస అతనికి ఆశ్చర్యాన్నీ, ఆవేదననూ, జాలినీకూడా కలుగచేసింది. వేదనతో గొంతు వణుకుతూ ఉండగా "అయితే మనిద్దరమూ జీవితాంతమూ ఇలా అవివాహితులుగానే ఉండిపోవలసిందేనా?" అన్నాడు.

మానస మరింత ఆశ్చర్యపోయింది. ఏమిటీ బావ? ఎంత ఆలోచించినా, ఇతని మనసు తనకు అర్థం కావటంలేదు. ఎందుకింత ఆవేదన? పైగా ఇలా మాట్లాడతాడేమిటీ?

మానస మౌనానికి ధర్మారావు కృంగిపోయాడు. మొదటిసారిగా మానస తూష్ణీభావానికి తల్లి అనంగీకారం ఒకటే కారణం కాదేమో నని అనిపించింది.

"క్షమించు మానసా! మనిద్దరం అన్నాను కదూ! ఎంత వెర్రివాణ్ణో చూడు నిన్ను వివాహం చేసికోవద్దనటానికి నేనెవర్ని? నీకు నచ్చిన యువకుడిని చేసికొని కలకాలం సుఖంగా ఉండు! నా మీద దయ ఉంచి నన్ను పిలిస్తే వచ్చి ఆశీర్వదిస్తాను."

అతని కళ్ళల్లో లీలగా సుడులు తిరిగిన నీళ్ళు చూసి మానస ద్రవించింది. తన బావ ఎంతటి గంభీరుడో, ఆమె ఎరుగును. అట్లాంటివాడు ఇంత బేలయి పోతూంటే, మానసకు కడుపులో దేవినట్లయింది. చటుక్కున ధర్మారావు రెండుచేతులూ పట్టుకుని "నీకు పుణ్యముంటుంది, ఇలా మాట్లాడకు బావా! నేను నిన్ను ఎంత అభిమానిస్తున్నానో చెప్పినా నమ్మలేవు, నిజం చెప్పాలంటే, ఎందుకనో, పెళ్ళినిగురించిన ఆలోచన లేనీ నన్ను కదిలించటంలేదు. నీ ఆవేదన చూడలేకపోతున్నాను. ఎందుకంత బాధ




పడాలో అర్థం కావటంలేదు కూడా। ప్రస్తుతం నాకున్న పెద్దకోరికల్లా, నువ్వు సంతోషంగా సుఖంగా ఉండాలనే। అమ్మ మాట కాదనటం కానీ, అమ్మ కనంగీకార మైన పని చేయటంకానీ నాకు పూర్తిగా అసంభవం. నాకోసం, నా మనశ్శాంతి కై హాయిగా నవ్వి, వెనుకటిలా మాట్లాడు బావా।" అంది ఆర్ద్రకంఠంతో.

ధర్మారావు బరువుగా నిట్టూర్చి, మానస చేతులనుండి తన చేతులు విడి పించుకొన్నాడు పేలవమైన చిరునవ్వు పెదవులమీదకు తెచ్చిపెట్టుకొని "ఇలాంటి ఆవేదన స్వానుభవైకవేద్యం మానసా! నీ శ్రేయోభిలాషిగా నీ కిలాంటి ఆవేదన అనుభవంలోకి రాకూడదని నే వాంఛి స్తున్నాను. సరే నే వెళ్తాను."

అంటూ ధర్మారావు లేవబోయాడు. అతనిని ఆపు చేస్తూ "నువ్వెందాక జీవి తాంతం అవివాహితుడిగా ఉంటా నన్నావు అలా వీల్లేదు బావా। నీకు తగిన కన్యను చూచి నువ్వు వివాహమాడి తీరవలసిందే। అలా చేస్తానని నాకు మాటివ్వు" అంది చేతులు జాపుతూ.

మానసకంఠంలో వాత్సల్యం తొణికిస లాడింది. సౌందర్యం రూపు కట్టిన ఆ ముగ్ధమోహన నిర్మలమూర్తిని చూస్తూ ధర్మారావు కొద్దిక్షణాలు అచేతనంగా నిలబడ్డాడు. తరువాత ఆమె జాపిన చేతిలో తనచేతిని ఉంచుతూ, "అలాగే మానసా। నువ్వు చెప్పినట్లే చేస్తాను. ఈరోజేకాదు, నా జీవితంలో ఏరోజూ నీ ఇష్టానికి వ్యతిరేకమయినపని చేయను. నీ శ్రేయోభిలాషీ, ఆప్తమిత్రుడూ ఏవేళలో నైనా, ఎట్లాంటి సహాయమైనా చేయగల వాడూ నీ బావ ఉన్నాడని గుర్తుంచుకో।" అని ఆమె సమాధానంకోసం ఎదురు చూడకుండానే అక్కడినుండి వెళ్ళి పోయాడు.

# 7

నిరంజనికికూడా మెద్రాస్‌లోనే ట్యూటర్‌గా ఉద్యోగం దొరికిందన్న సంగతి మానసకు అంతులేని ఆనందాన్ని కలిగించింది – నిరంజనిని కష్టం మీద ఒప్పించి, ధర్మారావుతోపాటే ప్రయాణం కట్టించింది – తన బావకు మంచికంపెనీ ఉంటుంది

ఆరోజే, నిరంజనీ ధర్మారావులు ప్రయాణ మవుతున్నారు – మానస, సుధాకర్ స్టేషన్‌కు వెళ్లారు. సుధాకర్ నవ్వుతూ నిలుచున్నాడు; కానీ, మానస మాత్రం ఒక్క క్షణమయినా ఆగకుండా, ధర్మారావు తన ఆరోగ్యం గురించి తీసికోవలసిన జాగ్రత్తలూ, ఆహార విషయంలో తీసికోవలసిన జాగ్రత్తా పదే పదే నొక్కి చెపుతోంది, ఉపన్యాస ధోరణిలో, ఆమె నిరంజని వంక తిరుగ నయినా లేదు. ఇంతలో గంట కొట్టారు. నిరంజని "మానసా! సెలవు. గుర్తుంచుకో!" అంది. దుఃఖంతో మానస గొంతు పూడిపోయింది మాటలు రాక అలానే అన్నట్లు తల ఊపింది. ధర్మారావు నిదానంగా "నన్ను తలుచుకొని బాధపడకు. సాధ్యమైనంత త్వరలో మర్చిపో," అన్నాడు.

ఆ మాటతో మానసకు కన్నీళ్ళాగ లేదు. స్టేషన్‌లో ఏడవటం సభ్యతకు విరుద్ధమని చేరుమాలుతో కళ్ళెంత ఒత్తుకుంటున్నా అవి స్రవిస్తూనే ఉన్నై. రైలు గుండె అదరగొట్టే పెద్ద కూతతో కదిలింది. నిరంజనీ ప్రకాశరావులు, మానసా సుధాకర్‌లు తమ దృక్పథం లోంచి దాటి పోయేంతవరకూ, చెయ్యి ఊపుతూనే ఉన్నారు.

వడిలిపోయిన మానస ముఖమూ, ఎఱ్ఱబడిన ఆమె కళ్ళూ, వణుకుతున్న ఆమె పెదవులూ సుధాకర్‌కు మరొక లాగ అర్థమయాయి. అతని హృదయం ఈర్ష్యతో, ఏదో అవ్యక్త వేదనతో కుత కుత ఉడికింది. ఇద్దరూ ప్లాట్‌ఫారం బయటకు వచ్చారు. శంకరశాస్త్రిగారి కారు డ్రైవరు మానసకోసం ఎదురు చూస్తున్నాడు. సుధాకర్‌వంక తిరిగి "మీరు కూడా మా కారులో రండి మీ ఇంటి దగ్గర డ్రాప్ చెయ్యమని డ్రైవరుతో చెపుతాను," అంది మానస

"అక్కర్లేదు లెండి. నాకు వేరే పనుంది." కొంచెం నిర్లక్ష్యంగా, విసురుగా అన్నాడు. మానస విస్తుపోయి చూసింది. తలవంచుకుని, నెమ్మదిగా కారులో కూర్చుంది. అమాయకమైన ఆమె చూపులకు సుధాకర్ కదిలిపోయాడు. చటుక్కున తనుకూడా వచ్చి డ్రైవర్ పక్కన కూర్చున్నాడు.

ఎక్కడికని మానస అడగలేదు –

సుధాకర్ ఏమీ చెప్పలేదు –

కిటికీలోంచి రోడ్డుమీదకు శూన్యంగా చూస్తూ కూర్చుంది మానస.

శంకరశాస్త్రిగారి ఇల్లు సమీపించింది.



అప్పటికి మానస ఈ లోకంలోకి వచ్చింది. సుధాకర్‌ను చూసి "అరెరె! క్షమించండి. మీ ఇంటిదగ్గరకు తీసికొని పొమ్మని చెప్పటం మర్చిపోయాను. మీరైనా చెప్పకపోయారా?" అంది కలవరపాటుతో.

సుధాకర్ నవ్వి "పరవాలేదులెండి. మీలాగే నేనూ, ఏదో ఆలోచిస్తున్నాను. సరే! ఇంక వెళ్తాను" అన్నాడు. మానస కంగారుగా "వద్దు వద్దు. మా డ్రైవరే మిమ్మల్ని మీ ఇంటిదగ్గర దింపుతాడు." అంది.

సుధాకర్ కొంచెం చిలిపిగా "అంతే కాపీ, మీ ఇంటిదాకా వచ్చినందుకు కాస్త టీ నీళ్లయినా ఇవ్వరన్నమాట" అన్నాడు.

మానస నాలుక కరచుకుని "మీరు లోపలకు రండి. నామనసు బాగుండలేదు. ఏంచేస్తున్నానో నాకే తెలియటంలేదు. లోపలకు రండి," అంది.

'నా మనసుకూడా బాగుండలేదు.' అనుకున్నాడు సుధాకర్.

సుధాకర్‌ను డ్రాయింగ్ రూమ్‌లో కూర్చోపెట్టి, మానస ఇద్దరికీ ఫలహారమూ, టీ తీసికొనివచ్చింది. వేడి వేడి టీ గొంతులో పడ్డాక, మానస కొంచెం తేరుకుంది. ఎన్నడూ, ఆలోచనను కానీ, ఆవేదనను కానీ ఎరుగని మానస, ప్రప్రథమంగా ఆమెకు కలిగిన కొద్ది మానసిక సంక్షోభానికి తట్టుకోలేక పోతూంది. ఎన్నడూ సుధాకర్‌తో హద్దు మీరి మాట్లాడనిది, ఒక విధమయిన కాతరస్వరంతో "నా మూలంగానే బావ అంత క్షోభపడ్తున్నాడు. కానీ, నే నేం చెయ్యగలను చెప్పండి" అంది పసిపిల్ల లాగ—

సుధాకర్ విస్తుపోయాడు......

"అదేమిటీ!? మీ బావను మీ రేం క్షోభపెట్టారు."

"అవునండీ! నేను కావాలని చెయ్యక పోయినా కారణం నేనే. మా బావ నన్ను పెళ్ళి చేసికోవా లనుకొన్నాడు. మా అమ్మ వీల్లేదంది. అమ్మ వీల్లేదంటే అది అసంభవమే దానికి కారణం నాకు తెలియదు తెలిసికోవాలని కూడా లేదు. నాకీ విషయం చాలా సామాన్యంగా ఉంది. బావమాత్రం విపరీతంగా బాధ పడుతున్నాడు. పసితనంనుంచీ బావా, నేనూ కలిసిమెలిసి ఆడుకున్నాం. చిన్న చిన్న చిలిపికజ్జాలుకూడా మా మధ్య ఉండేవి కావు చిత్రమేమిటంటే, బావ బాధపడుతున్నాడని తప్ప ఇంకో రకమైన ఆవేద నేదీ నా అనుభవంలోకి రావటం లేదు. అసలు నిజం చెప్పాలంటే, బావ మాటలూ, ఈ ఆలోచనలూ, అన్నీ ఒక గొడవలాగ అనిపిస్తున్నాయి నాకు. అట్లాంటి ఆలోచన లేవీ, నా కెన్నడూ రావు. నాకు బావఅంటే ఎంత అభిమాన మయినా నా చేతుల్లో లేనిదానికి నే నేం చెయ్యగలను?''

సుధాకర్ వీనుల్లో అమృతం వర్షించిన ట్లయింది అంతకు ఒక క్షణంకాలం క్రింద ఈర్ష్యతో ఉడికిపోయిన అతని హృదయం ఆనందంతో ఊగిపోయింది. పసిపిల్లలా, అమాయకంగా తనవంక చూసే మానస అతని మనసుకు దేవతా మూర్తిలా భాసించింది. పద్మాలలా స్వచ్ఛంగా, స్నిగ్ధంగా మెరుగులీను తున్న ఆ మెత్తనిపాదాల నొక్కసారి తన హృదయానికి హత్తుకో గలిగితే!

ఉన్నత విద్యా సంస్కారాల నల వరచుకున్న ఈ పూర్ణయవ్వనవతిలో, ఇంతటి అమాయకత్వం ఎలా చోటుచేసి కొందో? దీర్ఘనిద్రలో ఉన్న ఒకానొక రాకుమారిని, ఒకానొక ప్రియయోపాసి మధురచుంబనం మేల్కొలిపిందట! తా నంతటి అదృష్టవంతుడు కాగలడా? స్పందన ఎరుగని ఈ నిర్మల హృద యాన్ని ఉద్వేగభరితం చేయగలడా?

"ఏమిటండీ? ఈ లోకంలో ఉన్నారా?'' నవ్వుతూ అంది మానస.

"లేను.''

"లేరా?! అయితే ఏ లోకంలో ఉన్నారూ?''

"ఎప్పటికీ సర్వమానవాళికీ ధ్యేయమై, ఏనాడూ ఏవరికీ అందని ఒక సుందర నందనవనంలో.''

"బాబోయ్. మీరు కవులు కాదుగదా!"

"ఇంతవరకు కాననే అనుకుంటు న్నాను. దివ్యమైన వాతావరణంలో ఉన్న ప్పుడు ఎట్లాంటివాళ్ళకైనా కవిత్వం పుట్టుకొస్తుంది కాబోలు."

మానస అల్లరిపిల్ల!

"ఇంతకూ మీరు చెప్పింది కవిత్వమే నంటారు!'' అని పకపక నవ్వింది.

సుధాకర్ చెక్కిళ్ళు కొద్దిగా ఎఱ్ఱ బడ్డాయి. నవ్వినప్పుడు కొద్దిగా విడివడ్డ గులాబిరేకులవంటి ఆమె పెదవులనూ, వాటి మధ్య తళుక్కున మెరిసే తీర్చిన

పలువరసనూ చూస్తూ తనను తాను మర్చిపోయాడు. మానస తన నవ్వు ఆపి "క్షమించండి. ఎంతో చికాకుగా ఉన్న నా మనసు మీతో సంభాషణవల్ల ఉల్లాసపూరిత మయింది. మీకు చాలా థాంక్స్" అంది.

"అంతమాట అన్నందుకు మీకు థాంక్స్. మీ కింత మాత్రంగానైనా నేను ఉపకరించానంటే, అంతకంటె నాకు కావలసిం దేముందీ?"

మానసకు ఈ మాటలు విచిత్రగాం విన్పించాయి సంకోచంలాంటి దేదో భావం కలిగింది. వెంటనే ఏ సమాధానం చెప్పలేకపోయింది. ఇంతలో బయటి నుంచి కారుడ్రైవరు "అమ్మా! అయ్యా గారు ఎనిమిది గంటలకల్లా క్లబ్ దగ్గరకు రమ్మని చెప్పారు. నేను వెళ్ళనా?" అని కేక వేశాడు.

అప్పుడే మానసకు టైము దగ్గర దగ్గర ఎనిమిదయిందని తెలిసింది. బేలగా సుధాకర్ వంక చూసింది. వెంటనే సుధాకర్ లేచి నిల్చొని "కబుర్లలోపడి ఆలస్యమయింది. నేను వెడతాను." అని సెలవు తీసికొని వెళ్ళిపోయాడు. మానస బెదురుగా లోపలకు అడుగులు వేసింది మధురదరహాసప్రపూర్ణ మయిన అన్న పూర్ణమ్మగారి ముఖమండలం మానసలో శాంతిని నింపింది. ఆరాత్రి మానసకు సుధాకర్‌తో నడిచిన సంభాషణ ప్రతి అక్షరమూ తిరిగి తిరిగి గుర్తుకు రాసాగింది. ఆ విధంగా గుర్తుకు రావటం ఆమెకు అహ్లాదకరంగానే ఉంది కానీ. అందుకు కారణంమాత్రం ఆమె కర్థం కాలేదు. ఆ కారణం తెలిసికోవాలని ఆమె ప్రయత్నించలేదుకూడా.

# 8

నౌకరు ఆరోజు టపా అంతా తెచ్చి బల్లమీద పడవేయగానే మానస ఎంతో ఆదుర్దాగా తన ఉత్తరాలకోసం వెతికింది. మానసకు కావలసింది దొరికింది— ధర్మారావు వ్రాసిన ఉత్తరం. మూడు రోజుల కొకసారైనా ధర్మారావు అక్కడి పూర్తి వివరాల ఉత్తరం వ్రాస్తూంటాడు. మానస వెంటనే సమాధాన మిస్తూం టుంది. ఈసారి ధర్మారావు వ్రాసిన ఉత్తరం చాలా బరువుగా ఉంది ఇంత పెద్దఉత్తర మేమిటబ్బా! అనుకొంటూ, తన గదిలోకి వెళ్ళి ఉత్తరం విప్పింది.

డియర్ మానసా!

నీ కొక చాలా సంతోషం కలిగించే వార్త చెప్తున్నాను! ఏమిటో ఊహించు; ఉహూ! నీ తరంకాదు. నీ కలాంటి ఊహాలు రావు. నేను వివాహం చేసికోవడానికి నిశ్చయించుకున్నాను. ఒక్క నిమిష ఆగు. వివరాలు చెపుతాను.

ఆ అమ్మాయితో నాకు పూర్వ పరిచయం యేమంత లేకపోయినా, ఇక్కడ ఏర్పడ్డ పరిచయాన్ని బట్టి ఆమె నా కన్నివిధాలా గృహిణిగా తగిన దనిపించింది. ఒకనాడు యాదృచ్ఛికంగా

ఒక సంగీత సభలో కలుసుకున్నాము. ఆనాడే నా కామె బాగా పాడుతుందని తెలిసింది. నాకు సంగీత మంటే ఉండే అభిరుచివలన ఆమె స్నేహాన్ని వాంఛించాను. ఆమెకూడా స్నేహశీలి. ఆ తమిళ రాష్ట్రంలో ఆంధ్రుల మయిన మేమిద్దరమూ, కొంత సన్నిహితులమయ్యాము. రెండు రోజుల కొకసారైనా మేము ఎక్కడో ఒకచోట కలుసుకునేవాళ్ళం.

ఆమె రూపసికూడా! ఆమె అందాన్ని నీకు ఎలావర్ణించను? అమె నొక్కసారి చూసినవారు తప్పక ఆమె పునర్దర్శనాన్ని అపేక్షిస్తారు. సౌకుమార్యమూ; కాఠిన్యమూ, మృదుత్వమూ, ధృఢత్వమూ, ఉత్సాహమూ, కార్యదీక్ష, వినయమూ, ఆత్మవిశ్వాసమూ రంగరించుకొని ఉన్నాయి ఆమెలో. ఆమె నా జీవిత భాగస్వామిని అయితే అదృష్టవంతుడి ననేభావం నాలో క్రమంగా స్థిరపడింది! సభ్యతా విరుద్ధం కాని విధంలో నా ఉద్దేశ్యాన్నామెకు తెలియపరిచాను. నా పూర్వపుణ్యవిశేషంవలన ఆమె అంగీకరించింది నీకు గుర్తుందా! ఒకప్పుడు నీ కిష్టంలేని ఏపనినైనా నేను చేయనని నీకు వాగ్దానం చేశాను. అందుకే నీ అంగీకారంకోసం ఈ ఉత్తరం వ్రాస్తున్నాను ఒక్కవిషయం మానసా: ఆమెది పంచమకులమట! అయినా ఏకులమయితేనేం? ఈ కులమత భేదాలు మానవుడు ఒకనాటి సంఘనిర్మాణపద్ధతి ననుసరించి వృత్తి నాశ్రయించి నిర్ణయించుకున్నవి. వ్యక్తికి ప్రధానం గుణం కానీ కులంకాదు. విద్యావతివీ. సంస్కారవంతురాలవూ అయిన నువ్వు నా భావాలతో పూర్తిగా ఏకీభవిస్తావని నమ్ముతాను. నీ సమాధానం చూసి అత్తయ్యకూ, మామయ్యకూ వ్రాస్తాను. అటు ఆమె తరఫునుంచికూడా, ఏ విధమయిన ఆక్షేపణా ఉండదట. తొందరగా సమాధానం వ్రాస్తావుకదూ! నీ బావ,

ధర్మారావు..

ప్రథమంలో ఎంతో ఉత్సాహంతో ఆనందంతో ఆ వుత్తరం చదివిన మానసకు పంచమకులం అనగానే ఒకమాదిరి వెలపరం జనించింది. తన బావ వివాహం చేసుకో బోతున్నాడనే ఆనంద మంతా ఈ భావనతో తుడిచిపెట్టుకుపోయింది. ఇట్లాంటి వివాహంకంటె అసలు వివాహమే జరగకపోవటం నయమనే భావన కూడా ఆమె అంతరాంతరాలలో మెదిలింది. కానీ, అలా తన బావకు వ్రాయగలదా? ఒకవేళ వ్రాసినా తన మాట మన్నిస్తాడా? ఒకసారి బావ మనసుకు మానని గాయాన్ని కలుగజేసినదయింది. దాని కేదోవిధంగా ఉపశమనం కలుగుతూంటే మళ్ళీ తనే అడ్డుపడాలా! అయినా బావకు బుద్ధిలేదు. వెళ్ళి వెళ్ళి ఆ మాలపిల్లను ప్రేమించాలా- బ్రాహ్మణకులాలలో పిల్లలే లేనట్లు? మేనరికం లేదని తెలియగానే ఎంతమంది అమ్మ




చుట్టూ తిరగటంలేదూ? అయినా, ఏమిటో బావకి మొదటినుంచీ ఇదొకపిచ్చి!

మానస ఆలోచనాస్రవంతి ఇక్కడ చటుక్కున ఆగిపోయింది. ఈ పిచ్చి బావకేనా! తనకు లేదా? మానసకు ఆలోచించటం ఇష్టంలేకపోయింది. అదీగాక తనసంగతి వేరు. భిన్నవర్ణులతో తను స్నేహంకూడా గాఢంగా ఏర్పరచుకోదు.

అన్నిటికంటె అన్నపూర్ణమ్మగారి విషయమెలా తీసుకొంటారనేది మానసకు పెద్దదిగులైంది. జ్ఞానం వచ్చిన నాటినుండీ తనకు తెలిసిన ఆవిడ స్వభావాన్నిబట్టి దీనికావిడ ఎంతమాత్రం అంగీకరించరనేది నిశ్చయం. కాని, బావకు "నువ్వు కోరిన వివాహం వీల్లే"దని తనెలా వ్రాయగలదు? బావ తనమీద గౌరవముంచి అంగీకారంకోసరం వ్రాసినందుకు తానిచ్చే ప్రతిఫలం ఇదా? మానస మనసు ద్విధా ఊగిపోతోంది. ఆలోచించి, ఆలోచించి చివరకు ఒక నిశ్చయానికి వచ్చింది. ఈ ఉత్తరం తల్లికి చూపిస్తుంది. ఆవిడ అభిప్రాయాన్నిబట్టి బావకు సమాధానం వ్రాస్తుంది.

ఆ ఉత్తరం మానస చదవగా, వింటూండగానే అన్నపూర్ణమ్మగారి ముఖం రక్తపుబొట్టు లేనట్లు తెల్లబడింది. స్పృహ తప్పుతుందా అని మానస భయపడి, విచలితస్వరంతో "అమ్మా" అంటూ వచ్చి అన్నపూర్ణమ్మగారిని గట్టిగా పట్టుకొంది. ఆవిడ నిర్జీవంగా నవ్వి "నేనొక శిలని మానసా! నాకేమీకాదు" అన్నారు. ఉత్తరానికేం సమాధానం రాయమంటావని మానస అడగలేకపోయింది. వెంపెం పోయా, తల్లిముఖంలోకి చూస్తూ అలాగే కూర్చుంది. అన్నపూర్ణమ్మగారి చూపులు తన అన్న ఛాయాచిత్రంవంకకు మరిలాయి. గొణుగుతున్నట్లుగా, "అన్నయ్యా! నా మానసను ఇవ్వనని అనగలిగాను. ఇప్పుడు నేనేం చెయ్యగలనో చెప్పు," అన్నారు. మానస గాభరాగా, అన్నపూర్ణమ్మగారి వంటి

మీద చెయ్యి వేసి "అమ్మా" అంది. అన్నపూర్ణమ్మగారు ఆ చెయ్యిని మృదువుగా తొలగించి, "పిచ్చిపిల్లా! నా కింకా పిచ్చెక్కలేదులే! నా దురదృష్టం! అడుగడుగునా నాకు అగ్నిపరీక్షలే?" అన్నారు. ఆరాత్రి ఎన్నడూ లేనిది అన్నపూర్ణమ్మగారికి కొద్దిగా జ్వరం తగిలింది. మానస చుతిపోయి తల్లిని వదిలిపెట్టలేదు. జ్వరంలోకూడా ఆమె కటిక నేలమీద పీటను తలక్రిందపెట్టుకొని పడుకొన్నారు. ఆవిడ ముఖంవంక చూస్తూ పరుపుమీద పడుకోమని అనగలిగే సాహసం కలగలేదు. ఆరాత్రి మధ్యమధ్యలో చాలా చార్లు అన్నపూర్ణమ్మగారు "అన్నయ్యా వన్నేం చెయ్యమంటావు?" అని కలవరిస్తూనేఉన్నారు. మానస, ఈ వివాహానికి తల్లి అంగీకారం లభిస్తుందని ఆశ పెట్టుకోలేదు. కానీ, ఆవిడ ఇంతగా క్షోభిస్తారనికూడా ఊహించలేకపోయింది.

ఆ మరునాటికే అన్నపూర్ణమ్మగారికి జ్వరం తగ్గిపోయింది. కాని, ముఖం మాత్రం బాగా వడిలిపోయి, పూర్తిగా కళావిహీనమై ఉంది. మానస ఆవేదనతో తల్లి దగ్గర కూర్చుని "నువ్వు బాధపడకమ్మా; నీ కిష్టం లేకపోతే ఈ పెళ్ళిజరగదు. బావ నీ మాట కాదంటాడా? నేను వద్దని వ్రాస్తే బావ తప్పక ఈ పెళ్ళి మానుకుంటాడని నా నమ్మకం!" అంది. ఆ సంగతి అన్నపూర్ణమ్మగారికీ తెలుసు. ఆవిడ వేదన ధ్వనించే కంఠంతో "పోనీ మానసా! మాటిమాటకీ ఇలా వాడి ఆనందాన్ని భగ్నం కావించే అధికారాన్ని నా కెవరిచ్చారో చెప్పు. చిన్నప్పటినుండీ వాడిని పెంచాను. నిజమే! కానీ, దానికి ఇంత నిష్ఠురమయిన ప్రతిఫలాన్ని కోరమంటావా?" అన్నారు.

మానస తల వంచుకొంది. మానస మనసులోనూ ఇవే ప్రశ్నలు కదలాడుతున్నాయి ఏం సమాధానమియ్యగలదూ? అన్నపూర్ణమ్మగారు బరువుగా నిట్టూర్చారు. "అంతే! ఎప్పుడూ, అంతే! తా నొకటి తలిస్తే దైవ మొకటితలుస్తాడు," అన్నారు.

అంతలో మానస "ఏం కాదమ్మా! నువ్వు తలిచిన దానికి వ్యతిరేకంగా దేవుడుకూడా ఏం చెయ్యలేడు. ఇవాళే బావకు ఈ వివాహం ఎంతమాత్రం వద్దని వ్రాస్తాను. మనమీద ఏమాత్రమైనా ఆపేక్ష ఉంటే మానుకొంటాడు. బాధపడతాడు. నిజమే! అయితేనేం? ఇప్పరలో మాత్రం గాయపడి, ఆగాయాన్ని మాన్పుకోలేదా! మనం ప్రయత్నించి బావకు అన్నివిధాలా అనుకూలంగా ఉండే అమ్మాయిని అతనికి భార్యను చేద్దాం. కాలమే అన్ని గాయాలనూ మాన్పుతుంది" అంది.

అన్నపూర్ణమ్మగారు ఆశగా, దిగులుగా "అలా సాధ్యమౌతుందా?" అన్నారు.

"ఎందుకుకాదూ! తప్పక అలాగే జరుగుతుంది;" దృఢంగా అంది మానస. ఆ మాటలు విన్న అన్నపూర్ణమ్మగారి ముఖంలో ఆనందరేఖలు విరిశాయి. ఆ వెలుగు చూసిన మానస సంతృప్తిగా ధర్మారావుకు ఉత్తరంరాయటానికిలేచింది.

(సశేషం)

# వర్షంలో తాజ్

జానకి అడిగింది— "ఏం కట్టుకు రాను?"

"చీరె." అన్నాడు భానుమూర్తి.

"బావుందిలెండి జోకు! ముందు ఏ చీరె కట్టుకురానో చెప్పండి!"

"ఎక్కణ్ణా వర్షంలో చీరె, వెనకాలో చీరె కట్టుకుంటారేవిటి?"

"తర్వాత నవ్వుతాను గాని. ఈ తెల్లచీరె కట్టుకువస్తే బాగుంటుందా?"

"నువ్వా? చీరె?"

అబ్బ! చీరెప్పుడూ బాగానే వుంటుంది—చెబుదురూ?"

"నువ్వు ఏ చీరె కట్టుకున్నా బావుంటావని పెళ్ళయిందగ్గర్నుంచీ చెబుతున్నాను."

"మానేయండి. మీరేం చెప్పనక్ఖర్లేదు."

"అరె — అప్పుడే అయిదున్నర! సాయంత్రం చివరికొచ్చేసింది. ఏదో వొకటి త్వరగా కట్టుకు వచ్చేయాల. ఆలస్యం చేస్తే మళ్ళీ యిప్పట్లో తాజ్ మహల్ చూసే భాగ్యం కలగదు



మనకి;" అని భార్యని వేగిరపరచి బాల్కనీ పిట్టగోడ దగ్గరికి నడిచాడు భానుమూర్తి.

విషజ్వరం వచ్చి బ్రతక దనుకున్న జానకి, బ్రతికి మనిషైన తర్వాత—తనకి విషజ్వరం వచ్చినట్టుగా సెలవు పెట్టి, భార్య 'రిలీఫ్' కోసం భారత దేశంలో కళాఖండా లన్నీ ఆమెకు చూపించేందుకు బయలుదేరి వచ్చాడు భానుమూర్తి. దేశంలో చరిత్ర మిగిల్చిన చక్కటి కళాసంపత్తిని భార్యాభర్త లిద్దరూ దాదాపు పూర్తిగా చూడటం అయిపోవచ్చింది. భానుమూర్తి పెట్టిన సెలవుకూడా అయిపోవచ్చింది. చూడవలిసినవాటిలో చివరికి మిగిలిన అపూర్వమైన కట్టడాన్ని చూసి యింటి ముఖం పట్టే వుద్దేశముతో ఆగ్రా చేరుకున్నారు. తనకి సెలవు లేదు. కనుక మర్నాడే బయలుదేరి తీరాలి. అందు కని ఆ సాయంత్రమే త్వరగా తాజ్ మహాల్ చూసి పోవాలని భార్యని తొందర పెట్టాడు భానుమూర్తి.

సిగరెట్టు వెలిగించి, బాల్కనీ పిట్టగోడ నానుకుని దూరంగా చూశాడు. కంటికి సుదూరంలో చిన్నదిగా, ముద్దుగా కనిపించింది తాజ్. వెనక నల్లటి మబ్బు పరుచుకున్న ఆకాశంమీద తెల్లటి మరకలాగ వుంది - ఎప్పుడో భారతీయ చరిత్రలో రాజ్యం చేసిన వారి మనసుల్లోని ప్రేమకి ప్రతీకలా వుంది.

తెల్లటి తాజ్‌ని చూడగానే భాను మూర్తి మనస్సులో మాసిపోయి మరుగునపడిన జ్ఞాపకాలు, లేచి వొళ్లు దులుపుకుని వెలికి వచ్చాయి.

ఆ వ్యక్తులు మరణించినా, వారి ప్రేమమాత్రం అందమైన రూపంతో గర్వంగా ప్రపంచం ముందు నిలబడింది. కాని, తనూ రేవతీ బ్రతికివుండగానే తమ ప్రేమ మరణించింది. అప్పట్లో—తనూ, రేవతీ ఎంతగానో ప్రేమించుకున్నారు. నిజానికీ రేవతి-యిప్పుడు కంటిముందు మెరుస్తున్న తాజ్ కంటె బాగుంటుంది. ఆమె పెదాల వెనక పైవరుసలోంచి క్రమం తప్పి బైటికి తొంగిచూసే తెల్లటి 'యిన్నీజారు పన్ను' తెలుపు, తాజ్ తెలుపుకంటే చిక్కగా వుంటుంది. అసలు తను రేవతిని ప్రేమించింది ఆ పన్ను చూసేగా! ముఖంలో ముత్యం పొదిగినట్టు వుండేది రేవతి ముందు పన్ను. క్రమం తప్పిన పన్నులోకూడా అంత అందం వుంటుందని తనకి అప్పుడే తెలిసింది. కాని తర్వాత అలా తెలియడమే తన జీవితాన్ని విషాదపరచి మలుపు తిప్పింది.

* * *

కొన్నాళ్ళు ప్రేమజీవితం గడిపాక-తనూ రేవతీ వొకనాడు పెళ్ళికి సిద్ధపడ్డారు. ఆ రోజు—తండ్రి పోయాక అన్నీ తనే అయిన అమ్మ చెవిని, ఈ

శుభవార్త వేదామని వుత్సాహంతో ఇంటికి వెళ్ళ, అమ్మతో తను గోపాల రావుగారి అమ్మాయి రేవతిని పెళ్ళి చేసుకోదలిచానని చెప్పాడు. అప్పుడు అమ్మ నివ్వెరపోయి చూసింది.

"అవునమ్మా! నేనూ, రేవతీ ప్రేమించుకున్నాం" అన్నాడు.

అమ్మ వొకేమాట చెప్పింది–"నా కిష్టం లేదురా భానూ! వద్దు," అని. తను ఆశ్చర్యపోయాడు. తల్లి యిలా విముఖత చూపిస్తుందని తనసలు వూహించలేదు. కారణం అడిగాడు. మొదట్లో శంకించింది. తను ప్రాధేయ పడ్డాడు. మొండికేశాడు. ఆమె చెప్పక తప్పలేదు.

....తండ్రి పోయాక పాతికేళ్ళ అమ్మలో అందం, కన్నీళ్లు తప్ప తర్వాత ఏమీ మిగల్లేదు. గోపాల్రావు గారు అమ్మకి అన్నయ్యవుతారు. నాన్న పోయాక ఆవిడ, తన అన్న గారి దగ్గరకి వెళ్ళిపోయింది. రోజులు గడిచాయి. మంచితనాన్నీ, అందాన్నీ సహించలేని పాడులోకం మాట లతో ఆవిడని బాధించింది. చివరికి ఒకరోజు, తన రక్తం పంచుకుపుట్టిన స్వంత అన్నగారే ప్రజల మాటల్ని నమ్మి అనుమానిస్తూ మాట్లాడేసరికి, ఆవిడ అహం దెబ్బతింది. అమ్మకి వ్యక్తిత్వం వుంది. అభిమానం వుంది– నా అన్నవి, నా అన్నవాడివి అను కున్న నువ్వుకూడా నన్ను అనుమా నించావు. నన్ను పెంచిన యిల్లు నా మంచితనాన్ని గుర్తించలేకపోయింది. ఇన్నాళ్ళు నా జీవితానికి పాతబడీ, నా వ్యక్తిత్వాన్ని అపార్థం చేసుకున్న ఈ పాడుకొంపా, ఈపాడుమనుషులూ నాకు వద్దు– అని ఉత్తరం వ్రాసి పారిపోయి వచ్చేసింది. తన్ను తీసు కుని, చెల్లెలు దూరమయ్యాక, మావయ్య ఆ వెలితిని భరించలేక తిరిగిరమ్మని కోరాడు; ఉత్తరాలు వ్రాశాడు. అయినా అమ్మ నిరాక రించింది...

అమ్మకి పట్టుదల హెచ్చు. "నన్ను అనుమానించిన ఆ పాడుకొంపలోకి నేను వియ్యాపురాలిగా అడుగు పెట్ట లేను. ఈ పెళ్ళి వద్దురా భానూ!" అని ఖండితంగా చెప్పింది; ఆ మాటలు తను వినలేదు. రేవతి అందం ప్రేమా వాటిముందు అమ్మ, అమ్మమాటలు స్వల్పంగా కనిపించాయి.

"నేను రేవతినే పెళ్ళి చేసుకొంటా నమ్మా?" అని దృఢంగా చెప్పాడు. ఆ మాటకి అమ్మ కళ్ళు పెద్దవి చేసి చూసింది. "నా మాట వినవా?" అంది. తను మాట్లాడలేదు. అమ్మ గొంతు వణికింది. దగ్గిరిగా వచ్చి అంది. "అభిమానం విలువ నీకు తెలియదురా భానూ! బాధలు పడినదాన్ని, అన్నీ తెలిసినదాన్ని, మీ అమ్మని; నామాట

కాదనకురా? యిన్నాళ్ళూ, నీలో మీ నాన్నని చూసుకు బతుకుతున్నాను. ఇప్పుడు నాకు దూరమైపోయి మాట్లాడ తావురా? నిన్నెప్పుడూ, ఏదీ అడుగ లేదు. ఈ ఒక్కటీ కాదనకురా?— ఇటు చూడు! నీకు పుట్టుకిచ్చాను. నిన్ని చేతుల్లోనే పెంచాను. ఇంతవాణ్ని చేశాను. ఒరే భానూ? నీ చేతులు పట్టుకుంటాను. నామాట కాదనకు." అమ్మ కళ్ళల్లోంచి నీళ్ళు కారాయి. అమ్మ ఏడిచింది. తనకు తెలిసినంత వరకూ ఏడిచే అమ్మకళ్ళని అంతకు ముందు ఒకేసారి చూశాడు— తన చిన్నతనంలో తననూ, అమ్మనీ వదిలి నాన్న పోయినప్పుడు— అదొక్కటే తనకి బాగా జ్ఞాపకం. అమ్మగొంతు వణుకుతున్నప్పుడు ఆ స్పందన తను భరించలేకపోయాడు. తనకు కన్నూ ముక్కూ చేతులూ యిచ్చిన అమ్మ, తన చేతులు పట్టుకుని ప్రార్థించడం తనను వివశుణ్ణి చేసింది. కౌగిలించు కుని, గుండెల్లో ఆర్ద్రత పొంగిపోగా, అమ్మ చెవిలో—'నీ మాట వింటానమ్మా'- అని చెప్పాడు. అప్పుడు, ఆమె తన బుజాలమీద చేతుల్తో రాసినప్పుడు- 'నేను కని పెంచిన కొడుకు'— అన్న తృప్తి ఆ స్పర్శలో స్పష్టమయింది. ప్రేమనీ, రేవతినీ కాదన్నా, అమ్మని సంతోష పెట్టాననే తృప్తి తనకి ఉన్న తంగా తోచింది. జరిగిన విషయమంతా

తర్వాత రేవతికి చెప్పాడు. తనను మరిచిపొమ్మన్నాడు. హాయిగా మరొ కర్ని పెళ్ళి చేసుకోమన్నాడు. అంతా ఒక కల అనుకోమన్నాడు. రేవతి గుండెలు పగిలేలా ఏడిచింది, ప్రార్థిం చింది, వేడుకుంది, మోసం చేశావంది, దూషించింది— 'నువ్వా' ప్రేమా ఎప్పుడూ నాతో వుంటారనుకున్నాను. చివరికి ప్రేమని మిగిల్చి, నువ్వు నన్ను వదిలేసి వెళ్ళిపోతావా భానూ!—నాకు ఒకే సారి ప్రేమించడం చేతనవును. నిన్ను మరిచిపోవడం నా తరంకాదు;' అని అమాయకంగా ఏడిచింది. తను ఏడవకపోయినా, ఏడుస్తున్నట్టు ముఖం పెట్టాడు. 'నేనేం చెయ్యగలను?' అని చేతగానివాడిలా మాట్లాడాడు. 'నేను నిన్ను నిజంగా ప్రేమించాను. నాది మోసంకాదు, నన్ను నమ్ము;' అన్నాడు. మరి కొద్దిక్షణాలు ఆమె దగ్గిర వుంటే తను మారిపోతానేమో నని భయం వేసింది. వెంటనే తిరిగి వచ్చేశాడు. ఆ మరుసటి సంవత్సరమే రేవతికి పెళ్ళయింది. అమ్మ తన పెళ్ళి విషయం కదిపినప్పుడల్లా ఏదో సాకుతో వాయిదా వేసేవాడు. రేవతి జ్ఞాప కాలతో చిక్కిపోసాగాడు. ఈ సంగతి ఏలా తెలిసిందో రేవతికి — చివరి కొక నాడు తన్ను ఒంటరిగా కలిసి — ఆమె తృప్తికోసమేనా పెళ్ళి చేసుకుని సుఖ పడ మని ప్రాధేయపడింది. పైగా

చూస్తూ - 'ఎంత బాగుందో' అంది భర్తతో.

భానుమూర్తి నిశితంగా తాజ్ వేపు చూశాడు. వర్షంలో తడుస్తోంది. మరి పది శతాబ్దాలు పోయింతర్వాత ఆ ప్రజలకి తాజ్ రూపం యిలా వుంటుంది కాబోలు అనుకున్నాడు. ఏకధారగా కురిసే వానవల్ల భానుమూర్తికి పాంటూ, షర్టూ వొంటికి అతుక్కుపోయి చలి పుడుతోంది. జానకికి ఎల్చటి తెల్లచీరే, తెల్లజాకెట్టూ చర్మంలో కలిసిపోయినట్టయి మనసులో సిగ్గు పుడుతోంది. ఆమె, తాజ్‌కి పక్కగా నిటారుగా నిలబడి ఆకాశం వైపు చూస్తున్న స్తంభం కేసి నడుస్తోంది.

"అలా ఎక్కడికి వెళ్తున్నావు?" అడిగాడు.

"ఆ స్తంభాన్ని చూడాలని వుంది. ఎంత చక్కగా నిలబడిందో! రండి చూసివద్దాం!"

"ఎక్కువగా తడిస్తే మళ్ళీ నీకు జ్వరం వస్తుంది."

"వస్తే నాకేం? మీరున్నారుగా సేవ చేసేందుకు?" నవ్వుతూనే అటువైపు నడిచింది. భానుమూర్తికి అడుగు పడలేదు. క్షణంసేపు అలాగే నిలబడి, తడిసి ఇనుమడించిన జానకి అందాన్ని వెనుకనుండి చూస్తున్నాడు. ఇంతలో తాజ్ లోపలనుండి, 'భానూ!' అన్న పిలుపు వినబడింది — తనకి బాగా గుర్తు — ఆ పిలుపు రెండేళ్ళు పాతది. తల తిప్పి తాజ్ వైపు చూశాడు.

ముఖద్వారం మధ్య ఒంటరిగా తనవైపు చూస్తూ నిలబడివుంది 'రేవతి'— క్షణం ఆశ్చర్యపడి, తేరుకున్న భానుమూర్తి రేవతివైపు కదిలాడు. రెండేళ్ల క్రితం చూసిన మనిషి-రేవతి. పోలిక మారినట్టు కనిపించింది. పెదాల్లో అమాయకత చెదిరి, పట్టుదల సిద్ధమౌతోంది. పై వరుసలో తొంగిచూసే పన్ను వుండవలసినచోటు ఖాళీగా, వెలితిగా వుంది. అతన్ని చూడగానే— ఆమె కళ్ళల్లో కొత్త వుత్సాహం, ఆశా చిగురించాయి. దగ్గరికి వచ్చి నిలబడిన భానుమూర్తి కళ్ళల్లోకి చూస్తూ మెల్లగా '—భానూ!' అంది, "నన్ను గుర్తు పట్టావా?"

అతను చిరునవ్వు నవ్వి మాట్లాడాడు.

"లేకేం. నువ్వు గుర్తుపట్టలేనంతగా ఏం మారిపోలేదు. మీ ఆయన ఎక్కడ?

రేవతి చెప్పింది—

రేవతి భర్త పేరు పాండురాజు; పేరుబడ్డ పళ్ళడాక్టరు. ముప్ఫయి యేళ్ళ పాండురాజు పొట్టిగా, దిట్టంగా, ఎర్రగా పండులా వుంటాడు. వృత్తిమీద అభిమానం మెండు. పొద్దుటినుంచీ సాయంత్రంవరకూ తన పనిలో నిమగ్నుడై వుంటాడు. పళ్లు లేనివాళ్ళని చూస్తే, వాళ్ళకి కొత్త

పళ్ళు కట్టేవరకూ అతనికి నిద్రపట్టదు. ప్రతీ విషయంలోనూ చాలా ఖండితంగా వుంటాడు.

శోభనం గదిలో పాండురాజు రేవతిని మొదటిసారిగా యిలా పలకరించాడు.

"నీ ముందుపన్ను అలా పైకి పొడుచుకునస్తే బాగులేదు. తీసేసి అందమైన కొత్తపన్ను కడతాను."

రేవతి వెంటనే కలవరపడింది. కాని మాట్లాడలేదు. ఆ రాత్రి గడచింది. చాలా రాత్రులు గడిచాయి. రోజూ పాండురాజు పంటి విషయం కదిపేవాడు. ఆమె సమాధానం చెప్పకుండా మాట తప్పించేది. అతనితో ముభావంగా మసిలేది. పాండురాజు పన్నుగురించి మాట్లాడినప్పుడల్లా, ఆమెకు భానుమూర్తి గుర్తుకు వచ్చేవాడు. అద్దంలో మొహం చూసుకున్నప్పుడల్లా, భానుమూర్తి మెచ్చిన ఆ పన్ను తెల్లగా, మరింత తెల్లగా కనిపించి పాతప్రేమని గుర్తు చేసేది. రేవతి మనస్సుని కదిపి, కళ్ళల్లో నీటిని తెప్పేది. తన దురదృష్టాన్ని మరింతగా తలపుకు తెచ్చేది. చితికిపోయిన తన గతంమీద పగ తీర్చుకుంటున్నట్టు కనిపించేది. భానుమూర్తి లేకపోతే తనకు బ్రతుకే లేదనిపించింది. హఠాత్తుగా ఏ రాత్రిపూటో భానుమూర్తి దగ్గరకి లేచిపోవాలనిపించేది. అవునుమరి! అన్నీ పోయాక భానుమూర్తి ప్రేమకి మంచిసాక్ష్యంలా నిలచిన ఆ పన్ను తనకి ప్రాణంకంటే ఎక్కువ. దాని పునికి లేకుండా తానెలా బ్రతకగలదు?

పాండురాజు పట్టుదల మానలేదు. ఒకరోజు నిలదీసి అడిగాడు.

"పన్ను ఎత్తుగా వుంటే నేను సహించలేను. వృత్తిలో ప్రవేశించాక ఈ చేతుల్తో వెలసంఖ్యలో పళ్ళు పీకాను, కట్టాను. అలాంటిది అందానికి అడ్డం వచ్చే భార్యపన్ను తీయలేకపోవడం నా చేతకాని తనమే అవుతుంది. ఆ పన్ను చూస్తే నాకు తోచదు. నిద్రపట్టదు. నీరసించిపోతాను. కాబట్టి యివాళ దాన్ని తప్పకుండా తీసేస్తాను." అన్నాడు

రేవతి దిమ్మెరబోయింది. "వద్దు ఈ పన్ను నా ప్రాణం. దీన్ని ముట్టుకోకండి! కావలిస్తే నా దంతాలు—"

"నీకు ప్రాణమైతే నాకు ప్రాణసంకటం. ఎప్పట్నుంచో చూస్తున్నాను; ఇంత చిన్న విషయానికి ఎందుకు నీకింత మంకుపట్టు? ఏ రోజు కా రోజు పంటి విషయం కదిపినప్పుడల్లా మాట మారుస్తావు. ఏం? నువ్వు అందంగా కనబడుతుంటే చూసుకోవాలని, నిన్ను కట్టుకొన్న నాణ్ణి నాకు వుండదూ? ఏమిటా ముభావం? చాలా రోజులు నీ ముక్తసరి మాటలకీ, ముభావానికీ




సహించాను. ఇక నాలో సహనం లేదు. నశించిపోయింది. ఏం? నేనంటే నీ కిష్టం లేదా? లేకపోతే ఇప్పుడే నీ ఇష్టాలకి నిన్ను వదిలేస్తాను." అన్నాడు ఉద్రేకంగా. ఉద్రేకం వల్ల మరింత వ్యగ్రబడింది పాండురాజు ముఖం. అతనికి పళ్ళు కట్టడం కేవలం వృత్తే కాదు. ప్రాణంతో పిచ్చివుత్సాహం. పెద్ద ఆసక్తి. రోగి పరాకులోవుంటే అతను గొంతుకలోకూడా పళ్ళు కట్టేస్తాడు.

"మాట్లాడవేం?" అతను గర్జించాడు.

రేవతిలో పాతప్రేమ ఒక్కసారిగా గుండెలు చీల్చుకుని బైటికి వచ్చింది. తృప్తి లేని ఆ జీవితం తనకి ప్రేమ ముందు చేదుగా అనిపించింది. తనకి మంచి జీవితం కావాలి. మనస్సు దోచిన భానుమూర్తి కావాలి. వశం తప్పిన తను, భర్తతో నిజం చెప్పేసింది. పాండురాజు బాగా కాల్చిన ఇనుప కనికలా అయిపోయాడు. సమ్మెట దెబ్బలకి వణికినట్టు, భార్య మాటలకి కోపంతో వణికిపోయాడు.

"అసలు పెళ్ళి చేసుకున్నప్పుడే నీ పళ్ళూడగొట్టి మళ్ళీ కట్టి, పొమ్మన వలసింది - ఇప్పుడైనా మించిపోయింది లేదు. నీకు విడాకు లిచ్చేస్తాను. నా కంటికి కనిపించకుండా వెళ్ళిపో." అని పిప్పిపన్ను తీసి అవతల పారేసినట్టు, ఇంట్లోంచి పొమ్మని పంపించేశాడు. తనకి విడాకు లిచ్చేశాడు. తను ఒంటరిదైపోయింది. భానుమూర్తి దగ్గరకు పోవాలనుకుంటే ఉనికి తెలియలేదు.

మనస్సు బాగా పాడయిపోయింది. చివరికి ఒంటరితనాన్ని తోడు చేసుకుని, వాతావరణం మారితే ధైర్యం చిక్కుతుందనే ఆశతో చాలా చోట్లు తిరిగింది. అజంతా గుహాలు చూసింది; హంపీ శిథిలాలు చూసింది. ఇప్పుడు తాజ్‌ని చూడాలని వచ్చింది.

* * *

రేవతి చెప్పిందంతా విని, రెండు క్షణాల మౌనం తర్వాత భానుమూర్తి మాట్లాడాడు.

"మరి నీ పన్నేమైంది?"

"బాత్రూమ్‌లో జారి పడ్డాను. ఊడిపోయి ఎక్కడో పడిపోయింది. ఎంత వెతికినా కనిపించలేదు. అన్నీ పోయాక నా ఒంటరితనం మధ్య ఆసరాగా నిలిచిన అదొక్కటీ లేకుండా పోయింది. చివరికి వొంటరిదాన్నయిపోయాను." మిగిలిన బాధ ఏదో ఆమె గొంతులో స్పష్టమయింది.

"పోతే పోయిందిలే. కొత్తది కట్టించుకోవచ్చు. ఉండు! జానకిని పిలుచుకువస్తాను. వద్దన్నా వినకుండా వర్షంలో తడిసిపోతోంది," అని వెనక్కి తిరిగాడు.

—ఇదేమిటి? అలా కొంచెమైనా బాధ లేకుండా మాట్లాడాడు. అయితే తన భాను తనగురించి ఆలోచించటం మానేశాడా? తన ప్రేమని మరిచిపోయాడా? ముఖము మీద అలాంటి చిరునవ్వు మెరుస్తుందని తను కలలో కూడా అనుకోలేదు. భార్యని మరిచి, తనతో గంటల తరబడి మాట్లాడుతాడనుకొంది. తన వొంటరితనం అతనికి తృప్తినిస్తుందనుకొంది. కాని, తను వూహించిన విధంగా జరగలేదు. పరాయివాడిలా మాట్లాడాడు. రేవతి వొళ్ళు ఒక్కసారి గగుర్పొడిచింది.

వెంటనే ముందుకి నడుస్తున్న భానుమూర్తిని వెనక్కి పిలిచింది. అతను వచ్చాడు. దగ్గరగా వచ్చాడు. అబ్బ! ఎంత దగ్గరకి!—

'యిప్పుడు భానుమూర్తి తనలో కలిసి బ్రతకడానికి సిద్ధపడితే—ఎంత బాగుణ్ణు? కాని ఎలా?' అనుకుంటూ జాలిగా అతని కళ్ళల్లోకి చూస్తూ అంది: "కాసేపు ఒక్కడివీ నాతో మాట్లాడవూ?"

"ఏం మాట్లాడను?"

"ఏదో ఒక్కటి - తాజ్ నీ కెలా వుందో చెప్పు!"

'పగటో వర్షంలో చూశాను. ఊహించినంత బాగాలేదు. ఏదో మసక వెల్తుర్లో సమాధిని చూసినట్లే వుంది. నువ్వొచ్చేటప్పటికి వర్షం లేనట్టుంది?"

"వర్షం లేక పోయినా, కళ్ళల్లో నీరుందిగా. ఆ కన్నీటి వెనక నాకూ మసగ్గానే కనబడింది."

"ఏడిచావా?"

"ఊఁ—"

"ఎందుకూ?—"

"ఏమీ లేదు. షాజహాను తాజ్ మహల్ కట్టించి తన ప్రేమ గొప్పదని తెలియచేశాడు. నా కలాంటి అవకాశం ఏమీ లేకుండాపోయింది. ఆఖరికి నా గుండెల్లో నేను కట్టుకున్న తాజ్ కూడా కన్నీటిలో కరిగిపోయింది. అందుకే ఏడుపొచ్చింది." జాలిగా పెగిలిన ఆ మాటలు ఆమె గొంతులో బాధని కదిపాయి.

"గుండెల్లో సమాధి కాదు—దేవాలయం కట్టుకోవాలి." ఆమె తడి కళ్ళతో అతని ఒకసారి చూసింది. "భానూ! పెళ్ళయింతర్వాత నీకు నేనెప్పుడయినా జ్ఞాపకం వచ్చానా?" ఆమె ప్రశ్నలో ఏదో తెలియని ఆసక్తి కనిపిస్తోంది.

"ఎందుకు రాలేదు? గంట క్రితం బాల్కనీ మీదినించి తాజ్‌ని చూసినప్పుడు నువ్వే జ్ఞాపకం వచ్చావు. కాని ఏడవలేదు నేను." అతను చిరునవ్వుతో సమాధాన మిచ్చాడు.

ఇందాకటి ఆసక్తి ఈసారి ఆమె కళ్ళల్లోంచి తొంగిచూసింది. అయితే పెళ్ళయాక నన్ను తలుచుకుని నువ్వెప్పుడూ బాధ పడలేదూ?"

"నిన్ను తలుచుకుని బాధ పడిం తర్వాతేగా జానకిని పెళ్ళి చేసుకున్నాను." భానుమూర్తి పేలవంగా నవ్వాడు. క్షణం తర్వాత ఆమె ఆశగా చూస్తూ అంది.

"భానూ! మనిద్దరం కలిసి బ్రతుకుదామా?"

అతను విచలితుడయ్యాడు.

"నది వచ్చి సముద్రంలో కలుస్తానంటే సముద్రం వద్దంటుందా భానూ?"

"వద్దనలేదు. ఆ కలయిక భరించలేక ఉప్పుగా అయిపోతుంది. అయినా సముద్రమంత లోతైంది కాదు నా మనస్సు. నేను మగవాడిని." అతను ఆగాడు. "ఆరోజు నువ్వే నన్ను పెళ్ళి చేసుకోమని బలవంత పెట్టావు. మళ్ళీ యిప్పుడు బలవంతంగా పెళ్ళిబంధాన్ని తెంచుకు రమ్మంటున్నావు. నేను యంత్రాన్ని కాను."

"అవును; అప్పుడు నిన్ను పెళ్ళికి బలవంత పెట్టాను. నీ బాధ చూడలేక, నీ వొంటరితనం చూడలేక. నీ మీది ప్రేమతో నువ్వు—నువ్వు సుఖపడాలనే ఆ పని చేశాను. ఎందుకంటే అప్పట్లో రెండేళ్ళపాటు మన దగ్గిరతనాన్ని పెంచుకున్న ప్రేమసౌఖ్యాలు జ్ఞాపకాలై ఇంకా యీ గుండెల్లో కదులుతున్నాయి కనుక. కాని, అప్పుడు నువ్విలా దూరమయిపోతావనే ఆలోచన లేకపోయింది నాకు. వుంటే జన్మలో అలాంటి పని చేసేదాన్నే కాదు." ఆమె నరాల కదలికలో చైతన్యం నశించింది.




"తప్పు రేవతీ! నీ పరిస్థితిలో వున్న ఏ ఆడదీ యిలా మాట్లాడ కూడదు. నా గురించి ఆలోచనలు మాని, మరో పెళ్ళి చేసుకొని, నీ జీవితం సుఖవంతం చేసుకో."

"నువ్వేగా నా జీవితానివి!"

"చూడు రేవతీ! ఎంతో ప్రయత్నించి నే నిప్పుడు జానకి మీద రెండవసారి ప్రేమను పెంచుకోగలిగాను. నిన్ను మరచిపోగలిగాను. యిదంతా జానకిలో అమాయకత, పసితనం వల్లే జరిగింది. తనకి జీవితంలో నా అంత దగ్గర వ్యక్తి లేని నమ్ముతుంది. నన్ను పిచ్చిగా ప్రేమిస్తుంది. పిచ్చాసుపత్రికి వచ్చి చనిపోవలసిన జానకిని ఆ దేవుడు తృప్తి బ్రతికించింది. దయ చేసి దాన్ని నాశనం చెయ్యకు. నా సంగతి పూర్తిగా తెలిసిన జానకీ, నాలో ఏ లోటూ లేదని నమ్మిన జానకీ, తన చుట్టూ వున్న లోకంలో తనమీద నాకంటే ఎక్కువగా ఎవ్వరూ సానుభూతి చూపరనుకునే జానకి నా ప్రవర్తనలో యిప్పుడు తప్పటడుగు చూసి, సహించి, భరించి ఎలా తట్టుకోగలదు రేవతీ? - నా కోసం కాదు - నా భార్య తృప్తికోసం-ఆరోగ్యమంతా పోగొట్టుకొని కేవలం మనస్సు ఆసరాతో బ్రతికే జానకికోసం - నిన్ను వేడుకుంటున్నాను." భానుమూర్తి మనస్సంతా అతని మాటల్లో కనబడింది.

వర్షం యింకా నాల్గురోజులపాటు యిలాగే కురుస్తానన్నట్లు ధారాపాతంగా పడుతోంది.

సమాధులమీద షాండ్లియర్ గాలి

విసురుకి విసుగ్గా, రేవతి చెవి జూకాల్లా వూగిసలాడుతోంది.

ఆమె కళ్ళల్లో నిర్వేదం నిలిచింది.

"పిచ్చిదాన్ని! తాజ్‌లాగా నా ప్రేమకూడా చరిత్రలా ఎప్పుడూ నిలిచి పోతుం దనుకున్నాను. చివరకి నా కేం మిగిలిందని? నువ్వు దూరమైపోయావు. పరాయివాడివై పోయావు ఇంత జరిగినా, ఈ పాపు ప్రేమ, చేసుకున్న పాపంలాగ, నన్ను పట్టుకు వదలకుండా వుంది." ఒక్కసారి అతని కళ్ళల్లోకి చూసింది - "ఎందుకో నిన్నింకా ప్రేమించా లనిపిస్తూంది భానూ! యిలా వొక్కసారి విను - నా గుండె లెలా కొట్టుకుంటున్నాయో నీకోసం!" అని తటాలున మెడచుట్టూ చేతులు వేసి, భానుమూర్తి తలని తన వక్షంలో దాచుకుని బావురు మంది రేవతి. అతను కదలబోతే, బలంగా పెదాలు ముద్దు పెట్టుకొంది. రేవతి రొమ్ములో మెత్తటి హాయినీ, దేహంలో వెచ్చటి వేడిమినీ, అధరాల్లో ఏకాగ్రమైన ప్రేమనీ గుర్తు చేసిన ఆ అనుభూతి రెండేళ్లు పాతది. కాబట్టి భానుమూర్తి రెండు క్షణాల పాటు అలాగే వుండిపోయాడు. అతని కా క్షణం స్త్రీ ప్రేమలో గల స్థైర్యం, సాహసం విశద మయ్యాయి.

తర్వాత అతను ప్రయత్నంమీద రేవతిని విడిపించుకుని, చెదిరిన పెదాల్ని సరిచేసుకుని, పొడినాలికను తడి చేసుకుని, వివర్ణంగా చూశాడు.

"నీకు సరిగా ప్రేమించటంకూడా చాతకాదు. నీకు చేతనయిందల్లా వొక్కటే - పెద్ద బలహీనతని పెంచుకుని దాన్నే ప్రేమనుకుని మోస పోవడం."

ఆమె ముఖంలో, అతనితో కలిసి బతకాలనే కోరిక తప్ప మరేభావం లేదు. బహుశా ప్రేమంటే అదేనేమో!

ఇంతలో వున్నట్టుండి వెనక ఏదో క్రిందపడిన శబ్దం వినపడింది.

భానుమూర్తి వెనక్కి తిరిగి చూశాడు.

జానకి!--

పాలరాతి గోడపక్కన జానకి కుప్పలా కూలివుంది.

"జానకీ!" అని వొక్క వుదుటున భార్యవేపు పరిగెత్తాడు భానుమూర్తి.

వర్షం హోరు తప్ప, మరేశబ్దం వినిపించడంలేదు. రేవతి వచ్చి భార్యమీదికి వంగున్న భానుమూర్తిని ఆత్రంగా అడిగింది—

"ఏమైంది?"

"మెదడు పగిలి చచ్చిపోయింది." భానుమూర్తి పెదాల్ని తోసుకువచ్చిన ఆ మాటల్లో తన సుఖాన్ని ఆమె వురి తీసిందన్న భావం స్ఫురించింది.

అవును భర్త ఎంతో మంచివాడనుకున్న తృప్తితో జీవిస్తూ, అతనిలో 'తప్పు'ని కలలోకూడా వూహించ

డానికి సిద్ధపడని మనస్సు. మాసి. చాలదూ మస్తిష్కం స్తంభించడానికి?
భరి చలేకపోయి వుంటుంది. అది వూహించని ఈ సంఘటనకి భాను



మాఘమాసంలో ఒకనాటి రాత్రి ఆఖరుజామున ఒక యాత్రికుల పడవ గంగా సాగర సంగమంనుంచి తిరిగివస్తున్నది. ఒక ముసలివాడూ, ఒక యువకుడూ తప్ప మిగిలినవారంతా నిద్రపోతున్నారు. యువకుడితో ఏదో మాట్లాడుతూ ఉండిన వృద్ధుడు నావికుడికేసి తిరిగి, "ఇవాళ ఈ పడవ ఎంతదూరం ప్రయాణం చేస్తుంది?" అని అడిగాడు.

చెప్పలేమన్నాడు నావికుడు. రాత్రి పెద్ద తుఫానుకొట్టి పడవలు చెల్లాచెదరై పోయాయి. వృద్ధుడు నావికుణ్ణి నానామాటలూ అనసాగాడు.

"వాణ్ణెందుకు తిడతారు? దైవికంగా జరిగినదానికి వాడేం చేస్తాడు?" అన్నాడు యువకుడు.

"నీకేం, చెబుతావు. ఇరవైఅయిదు కుంచాల భూమిలో పండిన పంటంతా ఎత్తుకుపోయారుట. పిల్లాజెల్లా గలవాణ్ణి; ఏడాదిపొడుగునా ఎలా పోషించేది?" అన్నాడు వృద్ధుడు. ఆయన కీ దుర్వార్త గంగాసాగర సంగమంలో, తన వెనకగా వచ్చిన యాత్రికులు చెప్పారు.

"ఇంటిదగ్గర మంచీ చెడ్డా చూసేవాడు లేనప్పుడు మీరీ ప్రయాణం చెయ్యవలిసింది కాదు."

"ఎందుకూ? తొంభై నిండాయి. ఇప్పుడన్నా పరలోకంగురించి జాగ్రత్త పడవద్దూ?"

"మర్మం తెలిస్తే, ఇంటిదగ్గర ఉంటే అన్ని యాత్రలూ చేసిన పుణ్యం సంపాదించవచ్చు."

"మరి నువ్వెందు కొచ్చావ్?"

"సముద్రం చూడటానికి." అని యువకుడు సముద్రం అందం స్మరిస్తూ శ్లోకం చదవసాగాడు.

వృద్ధుడు శ్రద్ధగా నావికుల సంభాషణ విన నారంభించాడు. నావికులకు తాము ఏ నదిలో ఉన్నదీ, ఏ ప్రదేశంలో ఉన్నదికూడా తెలియదు; వాళ్ళు భయపడుతున్నారు.

యువకుడు పడవ పైభాగానికి వెళ్ళి చూశాడు. అన్నిపక్కలా పొగమంచు దట్టంగా కమ్మింది. తీరమూ, నక్షత్రాలూ, ఆకాశమూ, చంద్రుడూ ఏమాత్రమూ తెలియరావటంలేదు. యువకుడీ సంగతి వృద్ధుడితో చెప్పాడు. నిద్రచెదిరిన ప్రయాణీకులంతో అలజడి సాగింది. ఈ గోలకు నిద్రపోతున్నవాళ్ళుకూడా లేచి, అందరూ ఒక్కుమ్మడిగా, "ఒడ్డు పట్టించండి" అని కేకలు వెయ్యసాగారు. కాని ఒడ్డు ఎక్కడ ఉన్నదీ తెలిస్తేగద చేరటానికి?

యువకుడు నావికుల కొక సలహా ఇచ్చాడు: త్వరలో సూర్యోదయమై, పొగ మంచువిచ్చినాక అన్ని వివరాలూ తెలుస్తాయి; ప్రస్తుతానికి తెడ్లు వెయ్యటం ఆపి, పడవను దాని మానాన ప్రవాహంవెంబడి పోనివ్వటం మంచిది. నావికులు అలాగే చేశారు. ప్రయాణీకులకు ప్రాణభయం పట్టుకున్నది మగవాళ్లు దుర్గాస్తవం చేస్తున్నారు. ఆడవాళ్ళు అందరూ కలిసి ఏడుస్తున్నారు. తన కొడుకును గంగాసాగర సంగమంలో వదేసివచ్చిన స్త్రీ ఒక్కతెమాత్రం ఏడవటంలేదు.

సూర్యుడు ఉదయించాడు. పొగమంచు విచ్చిపోయింది ప్రయాణీకు లందరూ పడవ పైభాగానికి వచ్చి, చుట్టూ కలయజూశారు. పడవ ఒక నదీముఖంలో ఉన్నది. నదిఒడ్డు ఒకటి పడవకు సమీపంలోనే ఉన్నది గాని రెండోది కనుచూపు మేరలో లేదు. సూర్యుడున్న దిక్కునుబట్టి మిగతా దిక్కులు తెలిశాయి సమీపంలో ఉన్నతీరం సముద్రపు పడమటితీరం. సముద్రజలం నీలంగా ఉంది. అందులో వచ్చిపడే నదినీరు తెల్లగాఉంది. ఆ నది రసూల్‌పూర్ నది.

మరికొంత సేపటికి నదికి పోటువస్తుంది అప్పుడు పడవ నదికెగువగా వెళ్ళవచ్చు ఈ లోపుగా ప్రయాణీకులు తీరాన కాలకృత్యాలు తీర్చుకుని, వంట చేసుకుని భోజనం చెయ్యవచ్చునని నావికులు చెప్పారు. పడవ ఒడ్డుకు చేరింది ప్రయాణీకులు కాలకృత్యాలు తీర్చుకున్నారు గాని, వంట చేసుకోవటానికి వంటచెరుకు లేదు. అంతదూరాన చిట్టడవి ఉన్నది గాని, అందులో క్రూరమృగాలుంటాయని ప్రయాణీకులు భయపడ్డారు.

యువకుడు—అతని పేరు నవకుమారుడు—గొడ్డలి తీసుకుని బయలుదేరుతూ, తాడు పట్టుకుని తనవెంట మరొకణ్ణి ఎవణ్ణయినా రమ్మన్నాడు. ఒక్కడూ కదలలేదు.

"సరే, భోజనాలప్పుడు మీ సంగతి చెబుతాను," అంటూ నవకుమారుడు ఒక్కడే బయలుదేరాడు ఎత్తునుంచి చూస్తే ఎక్కడా జనసంచారం లేదు కనుచూపుమేర దాకా చిట్టడవి. అందులో వంటచెరకు దొరకదు. పెద్దచెట్టుకోసం వెతుక్కుంటూ నవకుమారుడు నదివెంబడి చాలాదూరం వెళ్ళవలసివచ్చింది.

అతను కట్టెలు కొట్టి, మోపుకట్టి, ఎన్నడూ అలవాటు లేకపోయినా దాన్ని నెత్తిన పెట్టుకుని, అలుపుచేత మధ్యమధ్య ఆగి విశ్రాంతి తీసుకుంటూ, తిరిగి రావటానికి చాల ఆలస్యమయింది. అతన్ని ఏ పులో ఈడ్చుకుపోయి ఉంటుందని మిగతా ప్రయాణీకులు భయపడ్డారు, కాని వాళ్ళు అతనికి అండగా బయలుదేరలేదు.

ఇంతలో నది పొంగసాగింది. ఇప్పుడు పడవలో తీరాన ఉండటం ప్రమాదం. నావికులు కట్టుతాళ్ళు విప్పి పడవను ప్రవాహమధ్యానికి తీసుకుపోయే యత్నం

ఆరంభించారు. ఈ పని పూర్తి అయేలోపలనే ఒడ్డున ఉన్న ఇసుకతిన్నెమీదికి నీరు పొంగింది. ఒడ్డునఉన్న యాత్రికులు తమ వంటసామగ్రిని అక్కడే వదిలేసి గబగబా పడవలోకి ఎక్కారు. ప్రవాహవేగాన పడవ రసూల్‌పూర్ కేసి పోసాగింది. దాన్ని నావికులు మందప్రవాహంలోకి అతికష్టంమీద లాగే సమయానికి వారు ప్రవాహం వెంబడి ఉత్తరంగా చాల దూరం వెళ్ళిపోయారు.

నవకుమారుడికోసం పడవ వెనక్కు వెళ్ళాలా, వద్దా అన్న సమస్య వచ్చింది. పడవను వెనక్కు తీసుకుపోవటానికి ప్రయాణీకులు ఒప్పుకోలేదు. వెనక్కు పోయిన పడవ తిరిగి నడికి పోటువచ్చినదాకా మళ్ళా కదలలేదు. ఈ లోపల రాత్రి అయిపోతుంది. అందరూ పస్తు ఉండాలి. అసలు నవకుమారుణ్ని ఏ పులో అదివరకే లాక్కుపోయిఉంటుంది!

పడవ ముందుకే పోయింది.

కట్టెలమోపుతో పడవ ఉండినచోటుకి వచ్చిన నవకుమారుడు పడవ కనిపించక పోయేసరికి భయపడ్డాడు. తోటి యాత్రికులు తన నీ నిర్జనప్రదేశంలో ఒంటరిగా విడచివెళ్ళిపోతారని అతనికి తట్టనుకూడాలేదు పడవలోవాళ్ళు తనకోసం వెతుక్కుంటూ వస్తారనే నమ్మకంతో అతను చాలాసేపు అక్కడే నిలబడ్డాడుకూడా. కాని పడవ రాలేదు. ఒకవేళ అది పోటువేగానికి కొట్టుకుపోయి ఉంటుందేమో! పోటు తగ్గగానే తిరిగి వస్తుందనుకున్నాడు. పోటు తగ్గింది. పడవ రాలేదు. పోటు మళ్ళి హెచ్చింది. మరొకసారి తగ్గింది. సూర్యాస్తమయంకూడా కావచ్చింది.

"పడవ మునిగి అయినా ఉండాలి, లేక మిగిలినవాళ్ళు నన్ను విడిచిపెట్టి వెళ్ళిపోయి అయినా ఉండాలి," అనుకున్నాడు నవకుమారుడు. ఈ మాట అనుకోగానే అతని గుండె నీరయిపోయింది.

అతను చాలా విషమస్థితిలో పడ్డాడు. చుట్టుపక్కల ఎక్కడా ఒక గ్రామం గాని, ఆశ్రయంగాని, నరసంచారంగాని లేదు. తిండి లేదు. అతడు తాగే నీరు కూడా లేదు; సముద్రజలం కలవడంచేత నదీజలంకూడా ఉప్పే.

చీకటిపడింది. సముద్రపుహోరూ, అప్పుడప్పుడూ మృగాల అరుపులూ తప్ప మరొక శబ్దమే లేదు. నవకుమారుడు కాలు కాలిన పిల్లిలాగా ఆ ఇసుకప్రాంతంలోనే అటూ ఇటూ తిరిగాడు. శీతాకాలం ఆ రాత్రికి గొరుబయట గడుపోవటమూ, క్రూర మృగాల పాలపడటమూ అతనికి తప్పేటట్టు కనిపించలేదు.

తిండిలేకా, తిప్పటవల్లా అతనికి అలసట కలిగింది. అతను ఒక ఇసుక

దిబ్బకు చేరగిలబడి కూర్చుని త్వరలోనే నిద్రపోయాడు. శరీర మానసిక శ్రమలు నిద్ర కలిగిస్తాయి.

అతను తిరిగి నిద్ర మేలుకునేసరికి ఇంకా రాత్రిగానే ఉన్నది. తనను ఏ క్రూర మృగమూ తినెయ్యనందుకు ఆశ్చర్యపడుతూ అతను చుట్టూ కలయజూసేసరికి, దూరంగా మంటలు మండుతున్నట్టుగా వెలుగు కనిపించింది. ఆ వెలుగు అంత కంతకూ జాస్తి అవుతున్నది. అతని మనసులో ఆశ తలఎత్తింది. అతను లేచి ఆ వెలుగు కనిపించేదిక్కుగా చిట్టడవికి అడ్డంపడి నడవసాగాడు. ఆ మంటలు కొండవిదయ్యాలేమోనన్న అనుమానం అతనికి కలిగింది. కాని భయపడటం ప్రాణ రక్షణకరం కాబోదనుకుని అతను ముందుకు సాగాడు.

అతను ఒక ఎత్తయిన ఇసుకగుట్టను చేరుకున్నాడు. దాని పైభాగానే మంటలు మండుతున్నాయి. అక్కడే ఒక మనిషి ఆకారం కూడా ఆకాశానికి అంటించినట్టుగా కనబడుతున్నది. నవకుమారుడు ఇసుకగుట్టపై నెక్కి, అక్కడి దృశ్యాన్ని చూసి, కొయ్యబారిపోయాడు.

సుమారు యాభై ఏళ్ళ వయసుగల వ్యక్తి, మొలకు పులితోలు చుట్టుకుని, తలలేని మనిషి మొండెంమీద కూర్చుని ఏదో ధ్యానం చేస్తున్నాడు. శవంతాలూకు తలమొండెం నుంచి వేరై కొంచెం ఎడంగా పడిఉన్నది, ఆ మనిషి, ఎవడో కాపాలికుడు ఆయన జుట్టూ గడ్డమూ ఆయన శరీరం పైభాగాన్ని కప్పేస్తున్నాయి ఆయన మెడలోని రుద్రాక్షమాలలో అక్కడక్కడా మనిషి ఎముకలు గుచ్చిఉన్నాయి. ఆ ప్రాంతంలో అనేక మానవాస్థిపంజరాలు పడి ఉన్నాయి. కుళ్ళు కంపు కొడుతున్నది. నవకుమారుడికి ముందుకు పోవటానికి గాని, వెనక్కు రావటానికి గాని కాళ్ళాడలేదు. అతను కాపాలికులను గురించి విని ఉన్నాడు.

కాపాలికు డతన్ని చూసికూడా చాలాసేపు ధ్యానంలోనే ఉండి, చివరకు, "ఎవరు నీవు?" అని అడిగాడు.

"బ్రాహ్మణ్ణి!" అన్నాడు నవకుమారుడు.

"కూర్చో," అనేసి కాపాలికుడు తన పనులలో తాను నిమగ్నుడయాడు.

నవకుమారుడు కూర్చోలేదు, నిలబడే ఉన్నాడు. చాలాసేపటికి కాపాలికుడు శవం మీదినుంచి లేచి, "నా వెంటరా," అని నవకుమారుడితో అన్నాడు.

"తమరు ఏం చెయ్యమన్నా చేస్తాను. ఆకలిదప్పులతో ప్రాణాలు పోతున్నాయి. మీ వెంట వస్తే తినటానికేమైనా దొరుకుతుందా?"

"భైరవీమాత నిన్ను ప్రేరేపిస్తున్నది. అన్నం దొరుకుతుంది."

కాపాలికుడివెంట నవకుమారుడు బయలుదేరాడు. దారిలో ఇద్దరూ మాట్లాడుకో లేదు. చిట్టచివరకి మెల్లిగా వారు చాలాసేపు నడిచి ఒక పర్ణకుటీరం చేరుకున్నారు. కాపాలికుడు విచిత్రంగా ఒక కర్రను వెలిగించాడు. కుటీరములోపల చాపలూ, పులిచర్మాలూ పరిచిఉన్నాయి అక్కడ ఒక నీటికుండా, పళ్ళూ, కందమూలాలూ ఉన్నాయి.

"పళ్ళతోనూ, కందమూలాలతోనూ ఆకలి తీర్చుకుని, కుండలోని నీరు తాగి, పులిచర్మంమీద పడుకుని నిశ్చింతగా నిద్రపో నేను తిరిగి కనిపించేదాకా ఈ కుటీరం వదిలిపోకు.'' అని హెచ్చరించి కాపాలికుడు వెళ్ళిపోయాడు. నవకుమారుడు కొన్నిపళ్ళు తిని, కషాయంలాగా ఉన్న నీరు తాగి, పులిచర్మంమీద పడుకుని వెంటనే నిద్రపోయాడు.

సూర్యోదయం తెల్లవారుతూనే అతను లేచి, కుటీరం బయటికి వచ్చాడు. కాపాలికుడి వెంట ఉండటం అతనికి ఇష్టంలేదు. ఇంటికి పోవాలని ఉన్నది. కాని కాపాలికుడు చెప్పకపోతే అతనికి మార్గం తెలియదు. కాపాలికులకు అతీతశక్తు లుంటాయి. అందుచేత ఈ కాపాలికుడికి కోపం తెప్పించటం మంచిదికాదు.

రెండుజాములు దాటింది. నవకుమారుడికి ఆకలి దహించుకుపోతున్నది. కుటీరంలో ఇప్పుడు తినటాని కేమీలేదు. కాపాలికుడు రాలేదు. మూడోజాము కూడా గడవనిచ్చి నవకుమారుడు కుటీరం వదిలి, పళ్ళకోసం వెతుకుతూ బయలుదేరాడు. కొద్దిదూరంలోనే ఒక ఇసకదిబ్బమీద ఉన్న చెట్లకు తినదగినపళ్ళు కనిపించాయి. వాటిని కడుపునిండా తిని ముందుకుసాగాడు. అతను అడవిలోపడి నడుస్తూ త్వరలోనే దారి తప్పాడు. కుటీరం ఏ దిక్కుగా ఉన్నదీ తెలియలేదు. అంతదూరాన సముద్రఘోష వినిపించింది అతను అటుకేసి వెళ్ళి, సముద్రతీరం చేరి, తెల్లని ఇసుకలో చాలాసేపు కూర్చున్నాడు.

చివరకు పగటికాంతి క్షీణించసాగింది. ఇంక తాను కుటీరం వెతుక్కొంటూ బయలుదేరాలని గ్రహించి నవకుమారుడు లేచి, వెనక్కుతిరిగి ఒక వింతవ్యక్తిని చూశాడు. ఆమె ఒక అందమైన స్త్రీ. ఆమె జుట్టు విరబోసుకున్నది. అది ఆమె భుజాలనూ, చేతులనూ కప్పి మోకాళ్ళదాకా వేళ్ళాడుతున్నది. ఆశ్చర్యంతో అతని కంఠం ముడుచుకుపోయి, నోట మాట రాలేదు.

కొంతసేపు ఇద్దరూ ఒకరినొకరు చూసుకున్నాక ఆమె, "బాటసారీ, దారి తప్పావా ?" అని అడిగింది.

ఆమె కంఠం చాలా శ్రావ్యంగా ఉంది. అత నేమీ జవాబు చెప్పలేదు.

"నా వెంట రా," అంటూ ఆమె దారితీసింది. కొంతదూరం ఇద్దరూ నడిచినాక అడవిలో ఒక మలుపుతిరిగి ఆమె మరి కనిపించలేదు. నవకుమారుడుకూడా ఆ మలుపు తిరిగి, ఎదురుగా ఉన్న కుటీరాన్ని చూశాడు.

అతను కుటీరంలో చాలాసేపు ఆ స్త్రీని గురించే ఆలోచిస్తూ ఉండిపోయాడు. ఆమె ఎవరు? మనిషా, దేవతా, కాపాలికుడి మాయాసృష్టా? అతని కేమీ అంతు చిక్కలేదు.

కుటీరంలో కర్ర ఒకటి వెలుగుతున్నది బియ్యమూ, ఇతర వంటసామానులూ పెట్టిఉన్నాయి. నవకుమారుడు వంట చేసుకుని తిని, పడుకుని నిద్రపోయాడు. మర్నాడు నిద్ర లేస్తూనే అతను కాలకృత్యాలు తీర్చుకోవటానికి సముద్రతీరానికి వెళ్ళాడు ఇప్పుడతనికి దారి తెలుసు. నిన్న కనబడిన స్త్రీ మళ్ళీ కనిపిస్తుందేమో నన్న ఆశతో అతను సాయంకాలందాకా అక్కడే తారాట్లాడి, హతాశుడై, సూర్యుడస్తమించాక కుటీరానికి తిరిగి వచ్చాడు.

అతను కుటీరానికి చేరేసరికి లోపల కాపాలికుడు ధ్యానంలో ఉన్నాడు. నవకుమారుడాయనను పలకరించి, "ఇంతకాలం తమ దర్శనం లభించలేదు," అన్నాడు.

"వ్రతంలో మునిగిఉన్నాను." అన్నాడు కాపాలికుడు.

"ఇంటికి పోదామంటే దారితెలియదు. దారిఖర్చుకుకూడా నా వద్ద ఏమీలేదు. తమరు సహాయం చేస్తారని ఆశ."

"నా వెంట రా," అంటూ కాపాలికుడు లేచి బయటికి నడిచాడు. ఆయన తన కోరిక నెరవేర్చుతాడన్న ఆశతో నవకుమారుడాయన వెనకగా బయలుదేరాడు.

దారిలో అతనిభుజంమీద ఎవరో మెత్తగా చెయ్యివేసినట్టయి, వెనక్కితిరిగి చూశాడు. ఆమె కనిపించి, మాట్లాడవద్దని సైగచేసింది. అతను ఆగిపోయాడు. కాపాలికుడు వెనక్కితిరిగి చూడకుండా ముందుకు సాగిపోయాడు.

కాపాలికుడు చాలాదూరం వెళ్ళాక ఆమె అతనితో [illegible] స్పష్టంగా, "ఎక్కడి కిలా పోతున్నావు? వెళ్ళకు. వెనక్కితిరిగి పారిపో," అం[illegible], అతని జవాబు కోసం నిరీక్షించకుండా ఎటో మాయమయింది.

నవకుమారుడు కొంతసేపు ఏ నిర్ణయమూ చేయలేక, చిట్టచివరకు, "ఎందుకు పారిపోవటం! ఎలా పారిపోవటం?" అనుకున్నాడు.

ఇంతలో, ముందు వెళ్ళిన కాపాలికుడు వెనక్కి తిరిగివస్తూ, "ఏం ఆలస్యం చేస్తున్నావు?" అని కేకపెట్టాడు. నవకుమారుడు తన ఆలోచనలను కట్టిపెట్టి

కాపాలికుడివెంట నడవసాగాడు. వారొక మట్టిగోడల ఇంటిపక్కగా వెళ్ళేటప్పుడు ఆ స్త్రీ దారికి అడ్డంగా పరిగెత్తుతూ, "ఇప్పుడైనా పారిపో! కాపాలికులు నర మాంసంతో పూజలు చేస్తారని తెలీదా?" అన్నది.

ఈ మాటలు కాపాలికుడికి వినిపించాయి. ఆయన "కపాలకుండలా!" అని కేక పెట్టాడు.

ఆమె అన్న మాటకు ముచ్చెమటలు పోస్తున్న నవకుమారుణ్ణి కాపాలికుడు చెయ్యి పట్టుకుని తీసుకుపోసాగాడు. ఆ నరహంతకుడి స్పర్శకు ఒళ్ళంతా కంపరమెత్తి అతను, "చెయ్యి వదలండి," అన్నాడు. కాపాలికుడు మాట్లాడలేదు.

"నన్నెక్కడికి తీసుకుపోతున్నారు?"

"పూజా గృహానికి!"

"ఎందుకు?"

"వధించటానికి."

ఇది విని నవకుమారుడు తన చెయ్యి విడిపించుకోవటానికి పెనుగులాడాడు. అతని చేతి ఎముకలు విరిగినంత పని అయిందిగాని కాపాలికుడి పట్టు సడలలేదు. నిస్సహాయుడై అతను కాపాలికుడి వెంట పూజాస్థలానికి వెళ్ళాడు. అక్కడ మండు తున్న కట్టెలనూ, దాని చుట్టూ తాంత్రిక పూజాద్రవ్యాలనూ, మనిషి కపాలంలో కల్లునూ చూసి అతను, తాను శవం కావలసి ఉన్నదని తెలుసుకున్నాడు.

కాపాలికుడు నవకుమారుణ్ణి బలిష్ఠమైన అడవి లతలతో కట్టనారంభించాడు. నవకుమారుడు తన బలమంతా ఉపయోగించికూడా కాపాలికుడి ప్రయత్నాన్ని భగ్నం చెయ్యలేకపోయాడు. ఆయనది గజబలంలాగా కనబడింది.

"మూర్ఖుడా, ఎందుకు పెనగులాడుతున్నావు? ఇవాళ నీ మాంసం భైరవికి నైవేద్యం అవుతుంది. నీ జన్మ తరించబోతున్నది," అన్నాడు కాపాలికుడు. ఆయన నవకుమారుణ్ణి దృఢంగా బంధించి ఒకపక్క ఉంచి, ప్రారంభ పూజకు ఉపక్ర మించాడు.

తన ఆఖరు క్షణం సమీపించిందని గ్రహించిన నవకుమారుడు తన ఇష్టదేవతను ధ్యానించి, తన జీవితాన్ని స్మరించి, రెండు కన్నీటి చుక్కలు రాల్చాడు.

అంతలో కాపాలికుడు తన ప్రాథమిక పూజ పూర్తిచేసి లేచి ఖడ్గం చేతబట్ట బోయాడు. కాని ఆ ఖడ్గం ఆయన ఉంచినచోట కనిపించలేదు. చుట్టుపక్కలకూడా అది లేదు. ఆయన కపాలకుండలను గట్టిగా కేకవేశాడు, కాని జవాబు రాలేదు. ఆయన కుటీరంకేసి గబగబా నడుచుకుంటూ వెళ్ళిపోయాడు.



ఆ సమయంలో కపాలకుండల తన చేతులలో ఖడ్గం పట్టుకుని అక్కడికి వచ్చింది. తాను కత్తి దొంగిలించానని చెప్పి, ఆమె ఆతనికట్లు కోసేసి, "పారిపో. నావెంట రా! దారి చూపుతాను," అన్నది.

ఆమె ముందు పరిగెత్తుతుంటే నవకుమారుడు ఆమె వెనకనే పరిగెత్తాడు.

ఈలోపల కాపాలికుడు కుటీరమంతా వెతికాడు. ఖడ్గంజాడలేదు. కపాలకుండల జాడకూడాలేదు. పూజాస్థలానికి వచ్చిచూస్తే నవకుమారుడుకూడా లేడు. అతన్ని బంధించిన లతలు తుంపులు తుంపులై పడిఉన్నాయి. జరిగినదంతా కాపాలికుడికి అర్థమయింది. నవకుమారుణ్ణి వెతుకుతూ బయలుదేరిన కాపాలికుడు, అది సాధ్యం కాదని గ్రహించి, చాలా మేర కనిపిస్తుందనే ఆశతో ఒక ఎత్తయిన ఇసకగుట్టమీది కెక్కాడు. దురదృష్టవశాన వర్షంనీరు ఆ గుట్ట లోపలిభాగాన్ని గుల్లచేసింది. కాపాలికు డెక్కగానే గుట్టశిఖరం ఒక్కసారిగా కూలిపోయింది. దానితోబాటు కాపాలికుడుకూడా కూలిపోయాడు.

అక్కడ నవకుమారుడు ఆ అంధకారంలోపడి కపాలకుండల వెనకగా పరిగెత్తుతూ, మధ్యలో అప్పుడప్పుడూ దారితప్పి, చివర కామె కొంగు పట్టుకుని పరిగెత్తవలసి వచ్చింది. అలా వెళ్ళి వారు అర్ధరాత్రివేళకు ఒక దేవాలయంవద్దకు చేరారు. ఆలయ ప్రహరీగోడ నానుకునిఉన్న ఇంటితలుపుమీద కపాలకుండల తట్టింది. ఇల్లుగలమనిషి వచ్చి తలుపు తీసింది.

ఆ ఇంట్లో ఉంటున్నవ్యక్తి, పక్కనేఉన్న గుడికి పూజారిణీ, అధికారిణీ కూడానూ. ఆమె వయస్సు సుమారు నలభై. కపాలకుండల లోపలికి వెళ్ళి ఆమె చెవిలో నవకుమారుడిసంగతి రహస్యంగా చెప్పింది. వృద్ధురాలు అనుమతించగా ఆమె అతన్ని లోపలికి పిలిచింది. పూజారిణి అతనితో, ఈపూట కిక్కడే రహస్యంగా ఉండు రేపుఉదయం నీకు మీ యింటికి వెళ్ళే దారి చూపుతాను." అన్నది.

ఆమె అతన్ని తన పడకగదిలో పడుకోమనిచెప్పి, అతనికి పక్క తయారు చేస్తూంటే కపాలకుండల సముద్రతీరానికి తిరిగి వెళ్ళటానికి సిద్ధమయింది.

"వెళ్ళకు. కొంచెంసేపుండు. నీతో మాట్లాడాలి," అన్నది పూజారిణి.

ఇద్దరూ ఏకాంతంగా మాట్లాడుకున్నారు. కాపాలికుడివద్దకు తిరిగి వెళితే కపాలకుండలకు ప్రమాదం ఉన్నదని పూజారిణి అన్నది.

"అది నాకు తెలుసు. కాని తిరిగి వెళ్ళక నే నెక్కడ ఉండను?" అని కపాలకుండల అడిగింది

"ఈ యువకుడివెంట వాళ్ళ దేశం వెళ్ళు."

"వెనక నీ శిష్యుడివెంట నేను వెళ్ళటానికి నువు ఒప్పుకోలేదే?"

"అప్పుడు నీకు ప్రాణంమీదికి రాలేదు. అదీగాక నా కింకొక ఆశకూడా ఉన్నది. జగన్మాత ఏమంటుందో తెలుసుకుందాం పద." అంటూ పూజారిణి ఒక దీపం తీసుకుని, కపాలకుండలను వెంట బెట్టుకుని కాళీవిగ్రహంవద్దకు వెళ్ళింది. ఆమె ఒక

బిల్వపత్రాన్ని తీసుకుని ఏదో ధ్యానం చేసి దేవి పాదాలపైన వేసి, దానికేసి చూసింది అది కింద పడలేదు

"చూశావా అమ్మాయ్? దేవి అనుమతించింది. నువ్వీ కుర్రవాడివెంబడి నిస్సంకోచంగా వెళ్ళవచ్చు. ఎవరో పరాయిదానిగా నిన్ను వెంటబెట్టుకుని తన వాళ్ళమధ్యకు వెళ్ళటం అతనికీ అవమానకరమే. అందుచేత మీ రిద్దరూ పెళ్ళి చేసుకుని బయలుదేరటం మంచిది. పెళ్ళి కాకుండా నువ్వితనివెంట వెళ్ళటం నాకే ఇష్టంలేదు," అన్నది పూజారిణి.

ఆమె మరీమరీ చెప్పినమీదట కపాలకుండల, "నువ్వు చెప్పినట్టే చేస్తానుగాని, ఈ కాపాలికుడు నన్ను చాలాకాలంగా పోషించాడు. ఈయనను వదిలిపెట్టి వెళ్ళటం నాకు బాగాలేదు." అన్నది.

"నిన్ను ఊరికే పోషించా డనుకున్నావా? ఒకతె కన్యాత్వం నష్టమైతేగాని అతడిపూజ సిద్ధించదు. తంత్రశాస్త్రం చదువుకున్నానులే. ఆయన్ను వదిలిపెట్టి పారిపోయినంతమాత్రాన నువ్వు కృతఘ్నురాలివై పోవు. ఆయన కింకా సిద్ధి కలుగ లేదు. గనక దూరాన ఉన్న నీ కేమీ భయం వుండదు. కాని దగ్గిరలో ఉంటే నీకు ప్రమాదం ఉన్నది అందుచేత నువు వెళ్ళిపో"

ఈ మాటలన్నీ విన్నమీదట కాపాలకుండల పెళ్ళికి ఒప్పుకున్నది. ఇద్దరూ ఆలయంనుంచి ఇంటికి తిరిగివచ్చారు. పూజారిణి కపాలకుండలను ఒక గదిలో ఉంచి, నవకుమారు డున్నచోటికి వెళ్ళి, "నిద్రపోతున్నావా బాబూ?" అని అడిగింది. అతను లేదన్నాడు. ఆమె అతన్ని ప్రశ్నించి అతని పేరు నవకుమారుడనీ, అతను రాఢాశాఖకు చెందిన బ్రాహ్మడనీ, వాళ్ళది వంధ్యఘటగోత్రమనీ, అతని నివాసం సప్తగ్రామమనీ తెలుసుకున్నది అతను తనకు పెళ్ళి అయినట్టు ఆమెతో చెప్పాడు.

కాని ఆ పెళ్ళి వివరాలు తను చెప్పలేదు. అతనికి రామగోవిందఘోషనేవాడి కూతురు నిచ్చి చేశారు. పిల్లపేరు పద్మావతి. ఆమె పదమూడేళ్ళ పిల్లగా, ఇంకా పుట్టింటనే ఉండగా, ఆమె తండ్రి సపరివారంగా పూరీయాత్ర వెళ్ళాడు.

ఆయన అక్కడినుంచి తిరిగి వచ్చేటప్పుడు ఒరిస్సాలో పఠానులకూ, మొగలులకూ యుద్ధం ఆరంభమయింది రామగోవిందఘోషునూ, ఆయన పరివారాన్నీ పఠానులు పట్టుకున్నారు చివర కాయన వాళ్ళ క్షేమమునుంచి బయటపడటానికి ఇస్లాం మతం పుచ్చుకున్నాడు జాతిభ్రష్టుడైన ఆయనను బంధువులు చేరనివ్వారుకారు. తన వియ్యంకుడు జాతిభ్రష్టుడైనప్పుడు కోడలిని తెచ్చుకుంటే తననుకూడా అయిన

వాళ్లు వెలి వేస్తారని భయపడి నవకుమారుడితండ్రి కోడలిని వదిలేశాడు. అందుచేత నవకుమారుడికీ, అతని భార్యకూ సంధానం జరుగనేలేదు.

తండ్రి అనంతరం నవకుమారుడు తన మామగారిని గురించీ, భార్య గురించీ ఆచూకీ జరిపాడు గాని లాభం లేకపోయింది. రామగోవిందఘోషు తనవాళ్ళతో సహా ఢిల్లీకి పోయి, మంచి ఉద్యోగం దొరుకుతుందని రాజమహలులో చేరాడు. వాళ్ళ పేర్లన్నీ తురకపేర్లయాయి. అందుచేత నవకుమారుడికి భార్య సంగతి తెలియలేదు తెలిసినా కూడా ప్రయోజనంలేదు. అతను రెండో పెళ్ళి చేసుకోలేదు.

కులీనుడైన బ్రాహ్మడు రెండు పెళ్ళిళ్ళు చేసుకున్నా తప్పు లేదనుకున్నది పూజారిణి. ఆమె నవకుమారుడితో, "నాయనా, కపాలకుండల నీ ప్రాణాలు కాపాడి తన ప్రాణాలమీదికి తెచ్చుకున్నది ఆ కాపాలికుడు మహాభయంకరుడు. ఆమెను కాపాడే మార్గం చూడు," అన్నది.

"ఆమె ప్రాణాలకు నా ప్రాణాలు అడ్డేస్తాను. కావలిస్తే ఆ కాపాలికుడివద్దకు నేను తిరిగి వెళతాను," అన్నాడు నవకుమారుడు.

"వెర్రివాడా, అందువల్ల నీ ప్రాణానికి హాని వస్తుందేగాని, ఆయన ఈ పిల్లను క్షమించడు. ఇద్దరికీ ప్రమాదం. మీ రిద్దరూ కలిసి పారిపోవటమే మార్గం. ఎందుకంటే మీ రిక్కడ ఉంటే ఆయనకు దొరికిపోతారు. ఆయన అప్పుడప్పుడూ ఈ ఆలయానికి వస్తాడు."

"అయితే నాతోబాటు పారిపోవచ్చునే"

"తెలిసో, బాబూ! దీన్ని నువు మీ యింటికి తీసుకుపోగలవా? అది ఎవరో కూడా నీకు తెలీదే. నువు నీ ఇల్లు చేరాక దీనిగతి ఏమిటి?"

"అలా అనవద్దు. ఈమె మా ఇంట్లోనే ఉంటుంది. నే నీమెకోసం ఏదైనా చేస్తాను."

"ఈ పిల్ల ఎవరి భార్య అని ఎవరన్నా అడిగితే ఏం చెబుతావు?"

"అయితే ఏం చెయ్యాలో మీరే చెప్పండి."

"దీన్ని పెళ్ళాడి నీ భార్యగా చేసుకో. ఇది బ్రాహ్మలపిల్ల. చిన్నతనంలో దీన్ని దొంగ లెత్తుకొని పడవలో పోతుంటే ప్రమాదం జరిగి ఇక్కడ సముద్రతీరం చేరింది. వివరాలన్నీ నీ కామె తరవాత చెబుతుందిలే. తరవాత ఈ కాపాలికుడీ పిల్లను పోషిస్తూ శివజపం సిద్ధించటానికి వెంట ఉంచుకున్నాడు. ఆయనకు త్వరలోనే సిద్ధి కలగవచ్చు. దీనికి పెళ్ళి కాలేదు. నేనే శాస్త్రవిధిగా మీకు పెళ్ళి చేస్తాను.

నవకుమారుడు వెంటనే ఏమీ చెప్పలేదు. పూజారిణి అతనికి తెల్లవారినదాకా

వ్యవధి ఇచ్చి, పడుకుని నిద్రపొమ్మన్నది. కని తెల్లవారి ఆ వృద్ధురాలు వచ్చేసరికి అతను మేలుకునేఉన్నాడు.

"ఏం తేల్చావు?" అన్న దామె.

"కపాలకుండలను పెళ్ళాడతాను కన్యాదాన మెవరు చేస్తారు?"

"నేను చేస్తాను నాయనా!" అన్న దామె ఆనందంతో.

ఆమె పాత పంచాంగం చూసింది. ఆ రోజు ముహూర్తం లేకపోవడంచేత గోధూళివేళ కన్యాదానం చెయ్య తలపెట్టింది. ఆ రోజల్లా వధూవరులను ఉపవాసం ఉండమన్నది కన్యాదానం పుచ్చుకుని ఇద్దరూ వాళ్ళ ఊరు వెళ్ళి, అక్కడ వివాహ కర్మకాండ జరుపుకోవచ్చు నన్నది.

ఆ సాయంకాలం కన్యాదానం జరిగింది. మర్నాడు తెల్లవారుజామున కొత్త దంపతుల వెంట తానుకూడా బయలుదేరి వాళ్ళను మేదినీపూరుదాకా దిగబెట్టుతా నని పూజారిణి అన్నది.

బయలుదేరేముందు కపాలకుండల దేవివద్దకు వెళ్ళి, ఆమె పాదాలపైన బిల్వ దళం ఉంచితే అది కింద పడింది. అది మంచిశకునం కాదు. కాని కపాలకుండల తన భర్త వెంట వెళ్ళక చేసేదిలేదు.

ముగ్గురూ బయలుదేరి చాలా పొద్దెక్కి మేదినీపూరు రహదారి అందుకున్నారు. పూజారిణి తిరిగి వెళ్ళేటప్పుడు కపాలకుండలతోబాటు ఆమెకూడా ఏడిచింది.

"అమ్మా, నాకు డబ్బులోటు లేదు. నీ కొంగున కట్టినవి మీ ఆయన కిచ్చి పల్లకీ వగైరాలు ఏర్పాటు చేయించుకో." అని కపాలకుండలకు చెప్పి వృద్ధురాలు వెనక్కి మళ్ళింది.

## 2

పూజారిణి కపాలకుండల కొంగున కట్టిన డబ్బు వ్యయంచేసి, నవకుమారుడు ఆమెకు ఒక పల్లకీనీ, బోయీలనూ, ఒక అంగరక్షకుణ్ణీ, ఒక దాసీనీ ఏర్పాటు చేసి, ఏమంత డబ్బు మిగలనందున తాను కాలినడకన బయలుదేరాడు. మధ్యాహ్నం భోజనా లయేదాకా అతను పల్లకీతోపాటే వున్నాడుగాని, ఆ తరువాత అతను వెనుక పడ్డాడు, పల్లకీ ముందు వెళ్ళిపోయింది. అతను ముందుమజిలీ చేరుకుని, పల్లకి ఇంకా ముందుకు వెళ్ళిందని తెలుసుకుని, నడక సాగించాడు.

చీకటి పడింది. రాత్రి తొమ్మిదిగంట అయింది. చకచకా నడుస్తూ అతను ఒక ఘోరమైన దృశ్యం ఉన్నచోటికి వచ్చాడు. ఒక విరిగిపోయిన పల్లకీ—అది కపాలకుండలదేమో ననుకుని నవకుమారుడు కంగారెత్తిపోయాడు — దాని కొక

స్త్రీ కట్టేసి ఉన్నది ఆమె కపాలకుండల కాదు దొంగలు తనను దోచుకుని, పల్లకికి కట్టేసి పోయారని ఆమె చెప్పింది. నవకుమారు డామె కట్లు విప్పి, తన భుజం ఆమెకు ఊతనిచ్చి నడిపించుకుంటూ, సమీపంలో ఉన్న సత్రానికి చేర్చాడు.

కపాలకుండల ఆ సత్రానికి అదివరకే వచ్చి ఆ సత్రంలో ఒక గదిలో దిగింది. ఆ గదికి పక్కగా ఉన్న గదిని తన వెంటవచ్చిన స్త్రీ కోసం నవకుమారుడు మాట్లాడి, అందులో దీపం పెట్టించాడు. దీపం వెలుగులో అతనికి ఆమె చాలా అందగత్తె అని తెలియవచ్చింది. ఆమె వయస్సు ఇరవైఏడేళ్ళుంటుంది.

నవకుమారుడు తనమీదినుంచి దృష్టి మరల్చకపోవటం గమనించి ఆమెని "ఏమిటలా చూస్తూన్నారు? నా అందమా?" అన్నది. అతను మాట్లాడలేదు. "మీ రాడవాళ్ళ నెన్నడూ చూడలేదా? లేక నాఅంత అందగత్తెను చూడలేదా?" అని ఆమె అడిగింది.

ఆమె కన్న అందగత్తెను తాను చూడలేదని అతను ఒప్పుకోలేదు. అతను కపాలకుండలను చూసిఉన్నాడు. ఇద్దరూ మాట్లాడుకోవటంలో ఆమె తాను పశ్చిమ ప్రాంతానికి చెందిన మహ్మమదీయ స్త్రీననీ, తనపేరు మోతీ అనీ చెప్పింది. తరవాత ఆమె దీపం పెద్దది చెయ్య యత్నిస్తూ, అతని ఊరూ పేరూ అడిగింది. తనది సప్తగ్రామమనీ తన పేరు నవకుమారుడనీ అతను అనేటంతలో దీపం కాస్తా ఆరిపోయింది.

నవకుమారుడు ఇంకో దీపం తెప్పించాడు. ఆ సమయానికి మోతీపరివారం తాలూకు ముసల్మాను నౌకరు వచ్చిచేరి, చాకళ్ళు తప్పతాగారనీ, వాళ్ళను పోగు చేసుకురావటం ఆలస్య మయిందనీ మోతీకి చెప్పాడు.

తాను పక్కగదిలో తన భార్యతో ఉన్నానని చెప్పి నవకుమారుడు మోతీబీబీ వద్ద సెలవు తీసుకున్నాడు. కొంచెంసేపయాక ఒక దాసీ వచ్చి అతన్ని మోతీబీబీ పిలుస్తున్నట్టు చెప్పింది. అతను వెళ్ళి చూసేసరికి మోతీబీబీ మరొక రూపంలో ప్రత్యక్షమయింది. ఇప్పు డామె జరీదుస్తులు ధరించి, ఆపాదమస్తకమూ రత్న ఖచితమైన సువర్ణాభరణాలు ధరించి ధగధగా మెరిసిపోతున్నది ఆమెను చూస్తూంటే నవకుమారుడి కళ్ళు చెదరిపోయాయి.

"మీ భార్యను చూస్తాను పదండి," అన్నది మోతీబీబీ.

"నా భార్యను చూడటాని కింతగా అలంకరించుకోవాలా? ఆమె ఒంటిపైన ఒక్క నగా లేదు," అన్నాడు నవకుమారుడు.

ఆడవాళ్ళకు తమ నగలను ఇతర స్త్రీలకు చూపడం సరదా," అన్నది మోతీబీబీ.

ఆమె పేష్మన్ అనే తన దాసీని వెంటబెట్టుకుని నవకుమారుడి వెంట అతని గదికి వెళ్ళింది. ఆమె కపాలకుండలను చాలాసేపు చూసి, తన ఒంటిమీది అలంకారా లన్నీ తీసి కపాలకుండలకు పెట్ట నారంభించింది.

"ఇదేంపని ?' అన్నాడు నవకుమారుడు మోతీబీబీ మారుమాట లేకుండా తన పని తాను చేసుకుపోయింది చివర కామె నవకుమారుడితో, "ఈ నగలు ఈమె అందానికి తగిఉన్నాయి. అందుకని పెట్టాను. మీరుకూడా ఎప్పుడన్నా ఈ నగలు ధరింపజేసి నన్ను జ్ఞాపకం చేసుకుంటూఉండండి." అన్నది

"ఇంత ఖరీదైన నగలు నే నెలా తీసుకోను?" అన్నాడు నవకుమారుడు.

దేవుడి దయవల్ల నాదగ్గిర ఇలాటి నగలు ఇంకా చాలా ఉన్నాయి," అంటూ ఆమె పేష్మన్‌తోసహా తన గదికి వెళ్ళిపోయింది.

పేష్మన్ మోతీబీబీని, "ఎవ రా మనిషి?" అని అడిగింది.

"నా భర్త!" అని మోతీబీబీ సమాధాన మిచ్చింది.

మోతీబీబీ వెళ్ళిపోయిన అనంతరం ఆమెవద్దనుంచి కపాలకుండలకు ఒక దంతపు పెట్టె వచ్చింది. అది మోతీబీబీ ఇచ్చిన నగలు పెట్టుకోవటానికి నగలు రెండుజతలుమాత్రం కపాలకుండలను పెట్టుకోనిచ్చి, మిగిలినవాటిని నవకుమారుడా పెట్టెలో పెట్టాడు

మర్నాడు ఉదయం మోతీబీబీ బర్ద్వాన్‌వైపు బయలుదేరింది. నవకుమారుడు భార్యతోసహా సప్తగ్రామానికి బయలుదేరాడు. పల్లకీలో ఎక్కికూర్చున్న కపాలకుండల నగలపెట్టెను తనదగ్గిరే పెట్టుకున్నది.

బయలుదేరిన కొద్దిసేపటికి పల్లకీ ముందయింది; నవకుమారుడు వెనకపడ్డాడు. కపాలకుండల పల్లకీనుంచి దారివెంబడి దృశ్యాలు చూసుకుంటూ పోతూఉండగా, ఒక బిచ్చగాడు పల్లకీ వెంటబడి యాచించాడు. తన దగ్గిర ఏమీ ఇవ్వటానికి లేదని చెబితే, "ఏమమ్మా, నీ వంటిన ఆ ముత్యాలూ, రత్నాలూ గల నగ లుంచుకుని ఏమీ లేదంటావేం ?" అన్నాడు

ఈ నగలు నీ కెందుకు పనికొస్తాయి ?" అని ఆమె అడిగింది.

బిచ్చగాడు ఆశ్చర్యపడి, "అవి కాకపోతే ఇంకేవి పనికొస్తాయి ?" అన్నాడు.

వెంటనే కపాలకుండల తన వంటిమీద ఉన్న రెండుజతల నగలతోపాటు, నగలున్న దంతపుపెట్టెకూడా బిచ్చగాడి కిచ్చేసింది. బిచ్చగాడు ఒక క్షణంపాటు నివ్వెరపోయి నిలబడి, అటూ ఇటూ చూసి, నగలతోకూడా పారిపోయాడు.

"వా డలా పారిపోయా డెందుకూ ?" అని కపాలకుండల తన దాసీల నడిగింది

నవకుమారుడు కపాలకుండలతో స్వస్థలానికి చేరుకున్నాడు. అతని తండ్రి పోయాడు, తల్లి ఉన్నది. ఇద్దరు చెల్లెళ్లున్నారు. వారిలో పెద్దామె వితంతువు. రెండోది శ్యామసుందరి — ఒక కులీనుడి భార్య.

అతని బంధువులు అతను చచ్చిపోయాడనే అనుకుంటున్నారు. ఎందుకంటే, అతని తోటిప్రయాణీకులు అతన్ని పులి తిన్నదని రూఢిగా వార్త పుట్టించారు. ఆ పరిస్థితిలో నవకుమారుడు తిరిగిరావటం అతనివాళ్ళకు మహదానందం కలిగించింది. ఆ పారవశ్యంలో వాళ్ళు నవకుమారుడు పెళ్ళాడితెచ్చిన వధువుయొక్క కులగోత్రాలను విమర్శించడం మరిచారు.

నవకుమారుడి తల్లి తన కోడలికి ఆప్యాయంగా స్వాగతం చెప్పింది. ఇందుకతను పరమానందం చెందాడు ఏమంటే అతనికి తన భార్యపట్ల ఎంతో ప్రేమ ఏర్పడింది. దీనిమూలాన అతని ప్రవృత్తి మారిపోయింది. అతను అందరిపట్లా స్నేహభావమూ, సద్భావమూ ఉంచసాగాడు.

సప్తగ్రామం ఒకప్పుడు పెద్దబస్తీ. ఇప్పు డందులో చాలాభాగం శిథిలమయింది. అలా శిథిలమయిన ప్రాంతంలోనే నవకుమారుడి రెండంతస్తుల ఇల్లున్నది. నవకుమారుడి రెండోచెల్లెలు శ్యామసుందరికూడా ఇప్పు డక్కడే ఉంటున్నది.

నవకుమారుడి వైపువాళ్ళకు కపాలకుండల అన్న పేరు నచ్చలేదు. వా రామెకు మృణ్మయి అని పేరుపెట్టి, ఆ పేరుతోనే పిలుస్తున్నారు. తన వదినెగారు పెళ్ళయికూడా యోగినిలాగ ఉంటూ, తల ముడవకపోవటమూ, అలంకరించుకోకపోవటమూ మొదలైనవాటిని గురించి శ్యామసుందరి ఆక్షేపించేది. ఆమెతో తన అదృష్టం ఎలాగున్నదీ తెలీదనీ, తాను బయలుదేరబోతూ దేవి పాదాలపైన ఉంచిన బిల్వదళం కింద పడిందని కపాలకుండల చెప్పింది

# 3

నవకుమారుడు కపాలకుండలను వెంటబెట్టుకుని సప్తగ్రామానికి బయలుదేరినప్పుడే, బర్ద్వానుకు బయలుదేరిన మోతీబీబీ చరిత్ర చాలా చిత్రమైనది అసలామె పేరు మోతీ కాదు; లుత్‌ఫున్నిసా. దేశసంచారం చేసేటప్పుడు తను ఫలానా అని తెలియకుండా మోతీ అనే పేరుతో తిరుగుతూంది

ఆమె తండ్రి అక్బరు హయాంలోనే ఆగ్రా చేరి పైకివచ్చి ప్రసిద్ధిగల హకీములలో ఒక డయాడు లుత్‌ఫున్నిసాకూడా వయసుతోబాటు పార్సీ, సంస్కృతం, సంగీతం, నృత్యం మొదలైన అనేక విద్యలలో శిక్షణ పొంది, గొప్ప సౌందర్య

వతిగాకూడా ఖ్యాతి సంపాదించింది. అయితే ఆమెకు ఆత్మనిగ్రహం ఏమీలేదు. తన సుఖంకోసం ఎంత అవినీతిగానైనా ప్రవర్తించేది సర్దారుల్లో ఒక్కడుకూడా ఆమెను పెళ్ళాడటానికి ముందుకు రాలేదు. విశృంఖలంగా తిరగదలచుకున్నది కావటంచేత వివాహబంధం ఆమెకు సమ్మతం కాలేదుకూడా. ఆమె ప్రవర్తన సహించలేక తండ్రి ఆమెను ఇంటినుంచి తరిమేశాడు.

లుత్ఫున్నిసా ప్రియులలో సలీమ్ ఒకడు. తమ రహస్యప్రణయానికి అనుకూలంగా ఉండేటందుకై సలీమ్ అక్కడ పెద్దబేగమ్‌కు ప్రధాన చెలికత్తెగా లుత్ఫున్నిసాను ఏర్పాటు చేయించాడు. ఈ పెద్దబేగమ్ మానసింహుడి చెల్లెలు, ఖుస్రూ తల్లి. అక్బరు అనంతరం సలీమ్ పాదుషా అయితే, లుత్ఫున్నిసా బేగమ్ అయే అవకాశాలుకూడా కనిపించాయి. ఈ విధంగా ఆమె కనిన కలలన్నీ భంగం చెయ్యటానికి మెహరున్నిసా సంప్రాప్తమయింది.

మెహరున్నిసా అక్బరు కోశాధ్యక్షుడి కూతురు. చరిత్రప్రసిద్ధి గల అసాధారణ సౌందర్యవతి. ఈమె తండ్రి మీర్జాఘియూస్‌బేగ్. ఆయన ఒకసారి గొప్పవాళ్ళకు విందు చేస్తూ, సలీమ్‌నుకూడా పిలిచాడు. అప్పుడు సలీమ్ మెహరున్నిసాను చూసి, తన హృదయాన్ని ఆమెకు కోల్పోయాడు. కాని అప్పటికే మెహరున్నిసాను షేర్‌అఫ్ఘాన్ అనే అమీరు కిచ్చి పెళ్ళిచెయ్యటం ఖాయమయింది. ఆ పెళ్ళి జరిగిపోయింది. ఆ వివాహాన్ని రద్దు చెయ్యమని సలీమ్ అక్బరును బతిమాలాడు కాని లాభం లేకపోయింది.

అయితే సలీమ్ మనస్తత్వం లుత్ఫున్నిసాకు తెలుసు. అక్బరు దేహం చాలించిన మరుక్షణం షేర్‌అఫ్ఘాన్ చస్తాడు. అతని భార్య అయిన మెహరున్నిసా సలీమ్‌కు బేగమ్ అవుతుంది.

అక్బరు చనిపోయాడు. ఆ సమయంలో జరిగిన రాజకీయ కుట్రల్లో లుత్ఫున్నిసా చెయ్యి పెట్టింది. ఒకరోజు ఆమె పెద్దబేగమ్‌తో చనిపోయిన అక్బరు గురించి మాట్లాడుతుండగా, బేగమ్ ఆమెతో, "పాదుషా పట్టమహిషి కావటంకంటే కూడా పాదుషాతల్లి కావటం ఇంకా హెచ్చుగౌరవం," అన్నది.

"అలా ఎందుక్కాకూడదు? మీరు తల్చుకుంటే యువరాజు ఖుస్రూను సింహాసనంమీద కూర్చోబెట్టవచ్చు," అన్నది లుత్ఫున్నిసా.

ఇది బేగమ్‌కు ఇష్టంలేని ఏర్పాటుకాదు మెహరున్నిసాలాటి సామాన్య ముస్లిము స్త్రీ తన అనంతరం బేగమ్ అయికూర్చోవటం ఆమెకూ ఇష్టం లేదు. ఖుస్రూను గద్దె ఎక్కించటానికి సమ్మతించే మహామహులలో ఖుస్రూ మేనమామ అయిన

రాజా మానసింహు డున్నాడు. ఖుస్రూకు పిల్లనిచ్చిన మామా, ప్రధానమంత్రీ అయిన ఖాని అజమ్ అజీజ్ కోకా ఉన్నాడు. మిగిలిన అమీర్ల నందరినీ సుముఖులను చేసే భారాన్ని లుత్ఫున్నిసా తనపైన వేసుకున్నది ఆమె చెలికత్తె ఈ పని సాధించ గలిగినట్టయితే ఆమెను ఆమె కోరిన అమీరు కిచ్చి పెళ్ళి చేసి, అతణ్ణి అయిదువేల అశ్వికసైనికులకు మన్సబుదారును చేస్తానని బేగమ్ మాట ఇచ్చింది లుత్ఫున్నిసా తృప్తిపడింది. తన బాల్యస్నేహితురాలైన మెహరున్నిసాకు దాసీగా యావజ్జీవం పడిఉండటం ఆమెకు నచ్చలేదు. అదీగాక, తనను గాఢంగా ప్రేమించిన సలీమ్ తనకన్న హెచ్చుగా మెహరున్నిసాను ప్రేమించినందుకు ప్రతిక్రియ చేసితీరాలి

ఢిల్లీలో ఉండే ఉమ్రావులు చాలామంది లుత్ఫున్నిసా చెప్పినట్టు చేసేవారే. ఖాని అజమ్ ఆమెతో, "ఆలోచన మంచిదేగాని, ప్రయత్నం బెడిసినట్టయితే నీకూ, నాకూకూడా ప్రమాదం: ఆత్మరక్షణోపాయం చూసుకోవాలి మనం ఒరిస్సాలో తలదాచుకోవలిసిఉంటుంది. ఒరిస్సాలో ఉండే సేన మనకు సుముఖంగా ఉండే టట్టు చూసుకోవాలి. ఒరిస్సాలో మన్సబ్‌దారుగా ఉన్న మీ అన్నకు చాలా జబ్బుగా ఉన్నదని వంకపెట్టి, నువు అక్కడికి వెళ్ళి అవసరమైన ఏర్పాటు చేసుకురా," అన్నాడు.

ఆమె ఒరిస్సా వెళ్ళి, తిరిగివస్తూ దారిలో నవకుమారుణ్ణి కలుసుకుని, మర్నాడు బర్ద్వానుకు బయలుదేరింది. ఆరోజామె బర్ద్వాన్ చేరలేక, ఆ రాత్రికి మరొక సత్రంలో బస చేసింది. ఆమె ఆ సత్రంలో ఉండగా ఆమె కొక వార్త అందింది. ఖానిఅజమ్ దూత ఆవార్త తెచ్చాడు. దాని సారాంశ మేమంటే అక్బరుకోరిక ననుస రించి సలీమ్ జహాంగీరు పాదుషా అయి గద్దె ఎక్కాడు; ఖుస్రూను పాదుషా చేసే ప్రయత్నాలు సాగవు; లుత్ఫున్నీసా ఆగ్రాకు తిరిగి రావచ్చు.

కాని లుత్ఫున్నిసా ఆగ్రా వెళ్ళదలచలేదు. మెహరున్నిసా బుద్ధి ఎలా ఉన్నదీ తెలుసుకోవా లనిపించింది.ఆమె తన భర్తను ప్రేమిస్తున్నదా, లేక జహాంగీరునే ఇంకా ప్రేమిస్తున్నదా? ఈసంగతి తెలుసుకునేటందుకు ఆమె బర్ద్వాన్ వెళ్ళింది.

షేర్ అఫ్ఘాన్ — మెహరున్నిసా భర్త — అక్కడే ఉంటున్నాడు అతను "మోతీబీబీ"కి ఘనమైన స్వాగతం ఇప్పించాడు ఎందుకంటే అతను ఆగ్రాలో ఉంటున్నప్పు డామెను బాగా ఎరుగును.

మెహరున్నిసా, లుత్ఫున్నీసా ఒకచోటచేరి కబుర్లు చెప్పుకోవటంలో మెహ రున్నీసా, "నువు యువరాజు సలీమ్‌ను పెళ్ళాడి పెద్దబేగమ్ అవుతా వనుకున్నా మే." అన్నది.



"అంత అదృష్టానికర్తురాలు ఒక్క మెహరున్నిసాయే," అన్నది ఇత్‌ఫున్నిసా.

మెహరున్నిసా తల వంచుకుని బాధపడి, "నేను షేర్‌ అఫ్ఘాన్ భార్యను; నా దగ్గిర అలా మాట్లాడవద్దు," అన్నది.

"నీకు భర్త అంటే ప్రాణమని నాకు తెలుసు. సలీమ్ నిన్నింకా ప్రేమిస్తూనే ఉన్నాడు. కనక జాగ్రత్తగా ఉండు."

"భయ మేమున్నది ?"

"వైధవ్య భయం?"

"అక్బరుపాదుషా పరిపాలనలో ఆయన కొడుకు అకారణంగా ఎవరినిగాని హత్య చేసి తప్పించుకోగలడా ?"

"అక్బరు చనిపోయాడు. సలీమ్ జహంగీరు బిరుదు ధరించి పాదుషా అయాడు. పాదుషా ఆజ్ఞకు తిరుగుండదు."

ఈ మాట విని మెహరున్నిసా ఏడవటం చూసి, ఐత్ పున్నిసా "ఎందు కేడుస్తున్నావు ?" అని అడిగింది.

"సలీమ్ సింహాసనం మీద ఉన్నాడు. నే నెక్కడున్నాను ?" అన్నది మెహరున్నిసా.

"యువరాజును నువ్వింకా మరిచిపోలేకుండాఉన్నావు ?"

"ఎలా మరచిపోగలను ? నన్ను నేను మరచినా యువరాజును మరవలేను. కాని ఈ మాట ఎవరితోనన్నా చెబితే ఒట్టే."

"ఎవరికీ చెప్పను. కాని బర్ద్వానునుంచి వచ్చానని తెలిసి సలీమ్ మెహరున్నిసా ఏమన్నదని అడిగితే ఏం చెప్పను ?"

"అతన్నే తలుచుకుంటున్నానని చెప్పు. అతనికోసం ప్రాణాలైనా ఇస్తానని చెప్పు. భర్త జీవించిఉండగా నా ముఖం అతనికి చూపననీ, నా భర్తను హత్య చేయిస్తే అతనికి భార్యను కాననీ చెప్పు."

మెహరున్నిసా హృదయం ఐత్ పున్నిసాకు అవగాహన అయింది. స్త్రీ ధర్మంలో ఇప్పు డేం చెప్పినా, అవాంతరం తొలగిన మరుక్షణం ఆమె పాదుషాకు బేగమ్ అయితీరుతుంది.

ఈ మాట తెలుసుకున్నాక ఐత్ పున్నిసాకు అనుకున్నంతగా బాధ కలగలేదు. అందుకు కారణం ఆమె త్వరలోనే తెలుసుకున్నది.

ఆమె ఆగ్రా వెళ్ళి జహంగీరును కలుసుకుని మాట్లాడింది. తన విషయం మెహరున్నిసా ఏమడిగిందని అతను అడిగాడు. మెహరున్నిసా అతనిని ఎప్పటిలాగే ప్రేమిస్తున్నదని ఆమె చెప్పింది. అతను సంతోషించాడు. మంచివార్త తెచ్చినందుకు బహుమానంగా తన కోరికకు అనుమతించమన్నది. ఆ కోరిక ఏమిటని జహంగీ రడిగాడు.

"నాకు పెళ్ళి చేసుకుందామని ఉంది."

"ఎవ రా అదృష్టవంతుడు ?"

"నా భర్తే"

"మంచిది. కాని ఈ దాసు దేమవుతాడు ?"

"బేగమ్ మెహరున్నిసాను అప్పగించిపోతాను."

ఆమె తన భర్తను పెళ్ళాడటానికి పాదుషా అనుమతించాడు. కాని ఆమె కలాటి కోరిక ఎందుకు కలిగిందో అతనికి తెలీదు.

లుత్ఫున్నిసా ఇంటికి తిరిగివచ్చి, తన ఒంటిమీది నగలూ, దుస్తులూ తీసివేసి, తన పరిచారిక అయిన పేష్మన్ కిచ్చింది. పేష్మన్ ఆశ్చర్యపడుతూ, "వెళ్ళిన పని కాయా, పండా ?" అని అడిగింది.

"పండే !"

"అయితే నేను త్వరలో బేగమ్ దాసి నవుతానన్నమాట !"

"బేగమ్ దాసి కావాలని ఉబలాటంగా ఉంటే నిన్ను మెహరున్నిసాకు శిఫార్సు చేస్తాను"

"ఇంకా పండేమిటి ? నువు తెచ్చిన శుభవార్త అర్థమయేటట్టు చెప్పు"

"ఆగ్రాను శాశ్వతంగా విడిచిపోతున్నాను. అదే శుభవార్త."

"ఎక్కడికి పోతావు ?"

"బెంగాలుకు వెళ్ళి, తగినవాణ్ణి చూసి పెళ్ళాడి, భార్యగా ఉంటాను."

"చాల్లే, వేళాకోళం !"

"వేళాకోళం కాదు; పాదుషా అనుమతికూడా పొందివచ్చాను."

"ఇదేం దుర్బుద్ధి ?"

"దుర్బుద్ధి కాదు. సుఖపడదామని బెంగాలునుంచి ఇంత దూరం వచ్చాను. ఐశ్వర్యమూ, సంపదా, కీర్తీ, ప్రతిష్ఠా అన్నీ వచ్చాయి; కాని నేను ఒక్కనాడు కూడా సుఖపడలేదు. కోరికలు పెరిగాయి, తృప్తి అన్నది లేకుండాపోయింది. మూడు సంవత్సరాలపాటు రాజప్రసాదంలో దొరకని సుఖం – అది ఒరిస్సానుంచి తిరిగివస్తూ ఒక్కరాత్రి దొరికింది. ఆగ్రాలో నేను ఏ ఒక్కరినైనా ప్రేమించానా?"

"లేదు."

"నేను రాయిని నాలో హృదయం ఎక్కడన్నా ఉన్నదేమో చూసుకోవాలి."

జరిగిన దేమంటే లుత్ఫున్నిసా నవకుమారుణ్ణి కలుసుకున్న క్షణంలోనే ప్రేమ బీజం ఆమె హృదయంలో పడింది. ఆసంగతి ఆమె ఆ క్షణాన గుర్తించలేదు.

తిరిగి ఆమె అతన్ని చూడలేదు. కాని అతను జ్ఞాపకం వచ్చినప్పుడు ఏదో సుఖంగా ఉండేది. ఇలాంటి జ్ఞాపకాలతో ప్రేమబీజం మొలకెత్తి నింపాదిగా పెరగ సాగింది. రానురాను ఆమెకు తనభర్తను మళ్ళీ చూడాలన్న కోరిక తీవ్రం కాసాగింది. దీని మూలంగా ఢిల్లీ సింహాసనంమీద కోరిక కూడా నిలవలేకపోయింది. ఆమె సమస్తమూ విసర్జించి, తన ప్రియుణ్ణి చూడటానికి పరిగెత్తిపోయింది.

ఆమె సప్తగ్రామం చేరి ఒకతోటలో బస ఏర్పాటు చేసుకుని నవకుమారుణ్ని చాలాసార్లు తనవద్దకు పిలిపించుకుని మాట్లాడింది. చివరి కతను, "నేను పోతాను. నా కోసం ఇక మనిషిని పంపి పిలవవద్దు." అన్నాడు.

"కొంచెంసేపు కూర్చో. నీతో మాట్లాడవలసింది ఉన్నది." అన్న దామె.

అతను కూర్చున్నాడు కాని ఆమె ఏమీ చెప్పలేదు. అతను చిరాకుపడి వెళ్ళిపోతుంటే, అతని చేయి పట్టుకుని, "నీ కేమీ కోరికా లేదా? డబ్బూ, సంపదా, ప్రతిష్ఠా ప్రేమా – సమస్తమూ ఇవ్వగలను. నన్ను భార్యగా స్వీకరించమనను. దాసిగా ఉంటాను." అన్నది.

"నేను బీదబ్రాహ్మణ్ణి; అలాగే ఉండిపోదలచాను. నువ్విస్తానన్నవి ఆశించి నీ ఉంపుడుకాడుగా ఉండటం నా కిష్టంలేదు." అన్నాడు నవకుమారుడు.

"రోజూ దారివెంట పోతూ కనిపించనన్నా కనిపించు."

"నువ్వు తురకదానివి. ఒకడి భార్యవు. నీతో ఇలా మాట్లాడటమే దోషం." అన్నా డతను.

లుత్ఫున్నిసా అతని బట్టచెంగు వదలి, "వెళ్ళిపో." అన్నది. కాని అతను బయలుదేరగానే అతడికాళ్ళకు తనచేతులు చుట్టేసి, "నన్ను విడిచిపెట్టకు; నీ కోసం ఆగ్రా సింహాసనాన్ని వదిలిపెట్టి వచ్చాను." అన్నది.

"ఆగ్రాకు తిరిగిపో, నా ఆశ విడిచిపెట్టు."

లుత్ఫున్నిసా బాణంలాగా నిలబడి, దర్పంగా, "ఈ జన్మలో అలా జరగదు. నువు నావాడివే!" అన్నది.

లేచి బుసకొట్టే తాచులాగా ఉన్న ఆమెను చూసి నవకుమారుడు భయపడ్డాడు. ఒకనాడు అతని భార్య పద్మావతి పన్నెండేళ్ళ పిల్లగా ఉన్నప్పుడు ఇలాగే కోపం తెప్పించేసరికి, ఇదేమాదిరిగా నిలబడింది. అదే అవతారం అప్పుసుద్దినట్టుగా అతని ఎదట ప్రత్యక్ష మయేసరికి అతను చిన్నగా, "నువ్వెవరు?" అని అడిగాడు.

"నేను పద్మావతిని." అని చెప్పి ఆమె అవతలికి వెళ్ళిపోయింది. నవకుమారుడు ఏదో ధ్యానంలోపడి ఇంటికి వెళ్ళిపోయాడు.

రెండురోజులపాటు ఆలోచించి ఇత్పున్నిసా ఒక నిర్ణయానికి వచ్చింది. ఆమె మాడువేషం వేసుకుని సూర్యాస్తమయేం అయాక ఒంటరిగా బయలుదేరింది

"ఏమిటి నీ ప్రయత్నం?" అని పేష్మన్ అడిగింది.

"ముందు కపాలకుండలకూ, అతనికీ ఎడబాటు కలిగిస్తాను తరవాత అతను నావా డవుతాడు," అన్నది ఇత్పున్నిసా

ఆమె పురుషులకుకూడా ఉండని సాహసంతో ఆ రాత్రివేళ, ఒంటరిగా, నవకుమారుడి ఇంటి చుట్టుపట్లగల అరణ్యంకేసి బయలుదేరింది. ఆమె అరణ్యంలో ఒక చెట్టుకిందకు చేరేసరికి రాత్రి బాగా వచ్చేసింది. దూరాన ఆమెకు మనుష్య కంఠం వినవచ్చింది. అటునుంచే వెలుగుకూడా కనబడింది. ఆమె అక్కడికి వెళ్ళి మంత్రోచ్చాటనతోసహా హోమం జరుగుతూఉండటం చూసింది. మంత్రంలో ఒక పేరు పదేపదే వినవస్తున్నది.

ఇత్పున్నిసా హోమం చేసే మనిషిదగ్గిరికి వెళ్ళి కూర్చున్నది.

## 4

నవకుమారుడి చెల్లెలు శ్యామసుందరి వైవాహిక జీవితం సరిగాలేదు. ఆమెపైన భర్తకు ఆదరం లేదు మృణ్మయి కాపురానికి వచ్చి ఏడాది దాటింది. శ్యామసుందరి తన అన్న ఇంట ఉన్నది. ఆమె ఒక వనమూలిక సహాయంతో భర్తను వశీకరించుకోవాలనే ఉద్దేశంతో ఉన్నది దాన్ని రాత్రివేళ స్త్రీయే తేవాలి తేవటానికి జుట్టు విరబోసుకుని వెళ్ళాలి దాన్ని తేవటానికి ఒకరాత్రి శ్యామసుందరి బయలుదేరిందిగాని, దారిలో కాలిజోడు తెగింది

కపాలకుండల పట్టపగలు తన ఆడబిడ్డవెంట వెళ్ళి ఆ మూలికను చూసివచ్చింది; రాత్రివేళ తానే వెళ్ళి తెస్తా నన్నది. ఆడది రాత్రివేళ ఒంటరిగా వెళ్ళితే నలుగురూ ఏమంటారో అని శ్యామ భయపడింది కపాలకుండలకు అలాటి భయాలు లేవు భార్య అంటే బానిసకింద జమఅని కూడా ఆమెకు తెలీదు.

కపాలకుండల బయలుదేరిపోతూంటే నవకుమారు డామెను రకరకాల ప్రశ్నలు వేశాడు. ఆమె మూలికకోసం వెళ్ళుతున్నదని తెలిసినాక, పగలు వెళ్ళకూడదా అన్నాడు; తాను వెళ్ళి తీసుకురాగూడదా అన్నాడు అన్ని ప్రశ్నలకూ ఆమె సమాధానాలు చెప్పి, "అంత అనుమానంగా ఉంటే వెంట రండి," అన్నది కోపంగా. అతను వెళ్ళలేదు; ఆమెను ఒంటరిగా వెళ్ళనిచ్చాడు

కపాలకుండల తన పూర్వజీవితాన్ని జ్ఞాపకం చేసుకుంటూ అరణ్యంలో దారి తప్పి, కొంతసేపటికి హోమాగ్ని ఉన్నచోటికి చేరింది అక్కడ ఎవరూ లేరు.

సమీపంలోనే ఒక శిథిలకుటీరం కన్పించింది. ఆమె దాన్ని సమీపించి, లోపల జరుగుతున్న ఈ సంభాషణ విన్నది.

"నా ఉద్దేశం చంపటమే. ఇందుకు ఆ బ్రాహ్మడు ఒప్పుకోకపోతే నా సహాయం నీకు దదు. నీ సహాయం నాకు వద్దు."

"నా ఉద్దేశం ఆమె ఎక్కైనా వెళ్ళిపోవాలని మాత్రమే. నేను హత్యకు ఒప్పుకోను అలాటి ప్రయత్నం జరిగితే అడ్డపడతానుకూడా."

"వట్టి అమాయకురాలివి. నీకు కాస్త జ్ఞానబోధ చెయ్యాలి చాలా రహస్యమైన విషయాలు చెప్పాలి. ఎవరో ఊపిరి తీస్తున్న చప్పుడవుతున్నది. కొంచెం చూసిరా."

మగవేషంలో ఉన్న లుత్ఫున్నిసా బయటికి వచ్చి కపాలకుండలను చూసింది కపాలకుండల ఆమెను చూసి ఎవరో బ్రాహ్మణ యువకు డనుకున్నది. ఆమెకు భయంవేసింది

లుత్ఫున్నిసా కొంచెంసేపటికి కపాలకుండలను గుర్తించి, "కపాలకుండలా, ఈ రాత్రివేళ ఈ అరణ్యంలోకి ఎందుకు వచ్చావు ?" అన్నది.

ఎరగని మనిషి తన పేరు ఉచ్చరించటం చూసి దిగ్భ్రమచెంది కపాలకుండల ఏమీ సమాధాన మియ్యలేదు

"మా మాటలను విన్నావా ఏం ?"

"ఆ విషయమే నేనూ అడగాలనుకుంటున్నాను. ఈ అరణ్యంలో ఈవేళ ఏం కుట్ర ఆలోచిస్తున్నారు ?" అని కపాలకుండల ఎదురుప్రశ్న వేసింది.

లుత్ఫున్నిసా కపాలకుండల చెయ్యి పట్టుకుని దూరంగా తీసుకుపోవాలని చూసింది. కాని కపాలకుండల కోపోద్రేకంతో తనచెయ్యి విడిలించేసుకున్నది

"ఫరవాలేదులే. నేను మగవాణ్ణి కాను."

కపాలకుండల ఆశ్చర్యపడింది ఆ మాటలో ఆమెకు పూర్తి విశ్వాసం కలగలేదు

"మేం మాట్లాడుకుంటున్న విషయంగురించి వింటావా ? అది నిన్ను గురించే."

"వింటాను."

"అయితే ఇక్కడే ఉండు. ఇప్పుడే వస్తాను," అంటూ లుత్ఫున్నిసా కుటీరం కేసి వెళ్ళిపోయింది. ఆమె ఎంతకూ రాకపోవటం చూసి కపాలకుండల ఇంటి ముఖం పట్టి నడవసాగింది తన వెనకగా ఎవరో నడుస్తున్నట్టు ఆమెకు తోచింది ఆమె పరిగెత్తింది వెనకనుంచి ఎవరో పరిగెత్తుకుంటూ వచ్చాడు. దారిలో మబ్బులు కమ్మాయి. మెరుపులతోసహా వర్షం సాగింది. కపాలకుండల ఎలాగో

ఇల్లు చేరుకుని, తెరిచిఉన్న వాకిలికుండా లోపలికి పోబోతూ వెనక్కు తిరిగి చూసింది. ఒక్క మెరుపు మెరిసింది. దాని కాంతిలో ఆమె కాపాలికుణ్ణి చూసి గుర్తించింది.

కపాలకుండల తలుపు గడియపెట్టి తన పడకగదిలో పడుకున్నది. తూర్పు తెల్లవారుతుండగా ఆమెకు కునుకుపట్టింది నిద్రలో ఆమె కొక కల వచ్చింది ఆమె నడిసముద్రంలో ఒక పడవలో తుఫాను మధ్య చిక్కుకున్నట్టూ, అప్పుడు కాపాలికుడు తన పడవను ముంచబోయినట్టూ, అంతలో బ్రాహ్మణయువకుడి వేషంలో ఒకడు వచ్చి "ముంచనా ? తేల్చనా ?" అని అడిగినట్టూ, ఆమె ముంచ మన్నట్టూ, తరవాత తాను పడవతోకూడా సముద్రం అడుగుకు దిగబడిపోయినట్టూ ఆమె కలకన్నది

ఈ కలనుంచి ఆమె మేలుకునేసరికి సూర్యోదయం అవుతున్నది; పూలచెట్ల కొమ్మలు కిటికీలోనుంచి లోపలికి వస్తున్నాయి. ఆమె వాటిని పట్టుకునేసరికి ఒక ఉత్తరం కింద పడింది. అందులో ఇలా ఉన్నది

"నిన్నటిలాగే ఈ రాత్రికూడా బ్రాహ్మణయువకుణ్ణి కలుసుకో. నీకు లాభించే విషయం వింటావు.'

సాయంకాలందాకా మథనపడి కపాలకుండల చివరకు బ్రాహ్మణయువక వేష ధారిని ఆ రాత్రి కలుసుకోవాలనే నిశ్చయించింది. తీరా ఇంటినుంచి బయలుదేరాక ఆమెకు తాము కలుసుకునే స్థలం తెలియలేదు. అది చీటీలో ఉంటుందేమోననుకుని ఆమె ఇంటికి తిరిగివచ్చి ఆ చీటీకోసం తెగ వెతికింది. అది దొరకక నిన్న కలుసు కున్న చోటికే ప్రయాణ మయింది

ఆ చీటీ కపాలకుండలకు దొరక్కపోవటానికి కారణం అది నవకుమారుడిచేత పడింది. దీన్ని చదివినమీదట అతనికి తనభార్య ప్రవర్తనగురించి గట్టి అనుమానం కలిగింది. అందుచేత అతను ఆమె వెనకగా బయలుదేరి, ఆమె తిరిగి వచ్చినప్పుడు పక్కకు తప్పుకుని, తిరిగి ఆమె బయలుదేరగానే తానుకూడా బయలుదేరాడు.

కాని ఈసారి వాకిలివద్ద కాపాలికు డతనికి తటస్థపడ్డాడు. తనదారికి అడ్డంగా నిలబడినవ్యక్తిని తోసుకుపోలేక నవకుమారుడు. "ఎవరు నువు ?" అని అడిగాడు.

"నన్నుగుర్తించలేదా ?" అని కాపాలికు డడిగాడు.

నవకుమారు డీసారి ఆ మనిషిని గుర్తించాడు

"కపాలకుండల మిమ్మల్ని కలుసుకోటానికేనా పోతున్నది?" అని అడిగాడు.

"కాదుకాని నీతో కొంచెం మాట్లాడాలి."



"నన్ను చంపటానికి వచ్చావా? ఐతే పద. కిందటిసారే నేను ప్రాణం అర్పించి ఉండవలసింది. ఆపని చెయ్యనందుకు అనుభవిస్తున్నాను."

"నేను నిన్ను చంపటానికి రాలేదు. అంటే నీ ప్రాణం కోరటంలేదు. ఇంట్లోకిపద. నీతో మాట్లాడాలి."

"ఒక్క క్షణం నిన్ను వదిలితే ఒకపని పూర్తిచేసి వస్తాను."

"ఆ పాపాత్మురాలివెంట పోవాలనుకుంటున్నావు. అది ఎక్కడికి పోతున్నదో నాకు తెలుసు. నేను నిన్నక్కడికి తీసుకుపోగలను. నువు చూడగోరేది చూపించగలను."

నవకుమారుడు కాపాలికుడితోసహా తన ఇంట్లో ప్రవేశించాడు.

కాపాలికుడు ఒక ఆసనంమీద కూర్చుని, తన రెండు చేతులూ నవకుమారుడికి చూపి, "రెండు చేతులూ బద్దలయిపోయాయి. వీటిలో ఇప్పుడు ఏమాత్రమూ చలనం లేదు." అన్నాడు.

ఈ కపాలికుడు ఇసకగుట్ట అడుగుకు పడిపోయినప్పుడాయన చేతులు దెబ్బ తిన్నాయి. ఆ సమయంలో తాను అపస్మారక స్థితిలో ఉండగా అంబ కనిపించి తనకు కపాలకుండలను బలి ఇయ్యమని కోరిందనీ, అందుకిప్పుడు తనకు మనిషి సహాయం కావాలనీ, నిన్నరాత్రి కపాలకుండల ఒక బ్రాహ్మణయువకుణ్ణి కలుసు

కున్నదనీ, ఈ రాత్రికూడా ఆ వ్యక్తిని కలుసుకునేటందుకే వెళ్ళిందనీ చెప్పాడు. కపాలకుండలను చంపటానికి నవకుమారు డభ్యంతరం చెప్ప నవసరం లేదు. ఆమెను బలి ఇస్తే కాపాలికుడి పనికూడా గడుస్తుంది. ఆమెను కాపాలికుడు అంబకు బలివ్వటంలో నవకుమారుడి సాయం అవసరం. ఇద్దరూ అరణ్యంలోకి బయలుదేరారు.

ఈలోపల కపాలకుండల అరణ్యంలో ఉన్న శిథిలకుటీరాన్ని చేరుకున్నది. బ్రాహ్మణ యువకుడి వేషంలో లుత్ఫున్నీసా ఆమెకు కనిపించింది. ఇద్దరూ కలిసి ఒక ఖాళీప్రదేశానికి వెళ్ళి అక్కడ కూర్చుని మాట్లాడుతున్నారు.

కపాలకుండలను సత్రంలో కలుసుకుని నగ లిచ్చినది తనే నని లుత్ఫున్నీసా చెప్పి, "ఆ తకన్న చిత్రం ఏమంటే మనిద్దరమూ సవతులం." అన్నది. ఆమె తన పూర్వకథ అంతా చెబితేగాని కపాలకుండలకు ఈ బంధుత్వం అర్థం కాలేదు.

"నీకూ, నీ భర్తకూ ఎడబాటు కలిగించి అతను నిన్ను విడిచిపెట్టేటట్టు చేద్దామనుకున్నాను. కాని ఇప్పుడా ఆలోచన మానేశాను. కాపాలికుడు నీకు కీడు కోరి నీ పేరుజపిస్తూ హోమం చేస్తున్నట్లు తెలిసి, ఆయన సహాయం పొందుదామనుకున్నాను. మేం మాట్లాడుకోవటంలో ఆయన నిన్ను చంపబోతున్నట్టు తెలిసింది. నా కది సమ్మతం కాలేదు. ఆ సమయంలోనే నువు వచ్చావు. ఆయన ఉద్దేశం పూర్తిగా తెలుసుకుందామని నిన్ను దూరంగా కూర్చోబెట్టి ఆయనవద్దకు వెళ్ళాను. ఆయన నీ కథంతా చెబుతూ నన్ను కూర్చోబెట్టాడు. నీ ప్రాణం కాపాడుతున్నాను. నా కొక ఉపకారం చెయ్యగలవా." అన్నది లుత్ఫున్నీసా.

"ఏం చెయ్యాలి?" అన్నది కపాలకుండల.

"నాకూడా ప్రాణదానం చెయ్యి. నీభర్తను విడిచిపెట్టు."

"విడిచి ఎక్కడికి వెళ్ళను?"

"దూరం — చాలా దూరం వెళ్ళిపో. నీ కేలోటూ ఉండదు. డబ్బూ, దాసీలూ, మంచి భవనం — అన్నీ ఇస్తాను, రాణీలాగా ఉండు."

"అవేవీ నే నెరగిన సుఖాలు కావు. నేను నీ సుఖానికి అడ్డంరాను. నేను అడవి మనిషిని. ఇకనుంచీ అడవిలోనే జీవిస్తాను."

కపాలకుండల తన కోరికను ఇంత తేలికగా సమ్మతిస్తుందని లుత్ఫున్నీసా అనుకొనలేదు. వాళ్ళిద్దరూ మాట్లాడుకోవటాన్ని కాపాలికుడూ, నవకుమారుడూ గమనిస్తున్నారు. వారికి వీరిమాటలు వినిపించటం లేదుగాని మనుషులు కనిపిస్తున్నారు. వాళ్ళు ఒకరి నొకరు ఆనుకుని కూర్చున్నారు. ముడివెయ్యని కపాలకుండల జుట్టు, మగవేషంలో ఉన్న లుత్ఫున్నీసా భుజాలమీద పడుతున్నది.

ఆ దృశ్యం చూసి నవకుమారుడు హతాశుడై నిలబడినచోటనే చతికిలబడిపోయాడు.

"నాయనా, నిస్పృహ చెందకు. భవానీ ప్రసాదం తీసుకుని బలం తెచ్చుకో," అంటూ కాపాలికుడతనికి సారా అందించాడు. నవకుమారుడికి కొంతబలం వచ్చింది.

ఉత్పున్నిసా కాపాలకుండల చేతికి తన ఉంగరం పెట్టింది. అది చూసిన నవకుమారుడు కంపించసాగాడు. కాపాలికు డతనిచేత మరికొంతసారాయి తాగించాడు.

కపాలకుండల ఉత్పున్నిసావద్ద సెలవు తీసుకుని ఇంటిదారిన బయలుదేరింది కాపాలికుడూ, నవకుమారుడూ ఆమెను అనుసరించారు

కపాలకుండల తన మనసులో అన్నిటంధా ఎసా తెంచేసుకున్నది. ఆమె కిప్పుడు దేనిపైనా ఆశ లేదు; భవానికి బలి కావటానికికూడా ఆమె ఇప్పుడు సిద్ధంగాఉంది

నవకుమారుడు మరొకసారి సారా తాగి. "దేనికి ఆలస్యం?" అన్నాడు

కాపాలికుడు గొంతెత్తి, "కాపాలకుండలా." అని పిలిచాడు

కపాలకుండల ఆ పిలుపు విని అదిరిపడింది నవకుమారుణ్ణి పెళ్ళాడాక తనను ఆ పేరుతో ఎవరూ పిలవలేదు. ఆమె తనను వెంబడించే వ్యక్తులను కొంచెం ఆలస్యంగా గుర్తించి, కాపాలికుడితో, "నన్ను బలి ఇవ్వటానికి వచ్చావా, నాయనా!" అన్నది.

నవకుమారుడు ఆమె చేతిని దృఢంగా పట్టుకున్నాడు.

కాపాలికుడు మృదువుగా, "మా వెంట రా, తల్లీ," అన్నాడు

ముగ్గురూ బయలుదేరారు. నవకుమారుడు కపాలకుండల చెయ్యి వదలలేదు. వాళ్ళు కాపాలికుడి పూజాస్థానం చేరారు. అది గంగాతీరాన గల ఇసకబయలు. దాని మధ్యగా నదినీరు పోటు సమయంలో వచ్చి, మళ్ళీ తీస్తూంటుంది. ఇసక మైదానంలో గంగను ఆనిఉన్న ప్రదేశం ఎత్తయినది దాని దిగువన గంగ చాలా లోతు ఒక్కొక్కసారి ఒడ్డున ఉన్న ఇసక విరిగి నదిలో పడిపోతూఉంటుంది.

పూజాస్థలంలో అగ్ని వెలుగుతున్నది. పూజకూ, బలికీ అవసరమైన సామగ్రి అంత సిద్ధంగా ఉన్నది. కాపాలికుడు పూజకు కూర్చున్నాడు. కూర్చుంటూ ఆయన నవకుమారుడితో, కపాలకుండలను స్నానం చేయించి తీసుకురమ్మని చెప్పాడు.

నవకుమారుడు కపాలకుండలను చెయ్యి పట్టుకుని తీసుకుపోసాగాడు. అతని చెయ్యి వణకటం చూసి ఆమె, "భయంగా ఉందా?" అని అడిగింది.

"అతని మైకం కొంచెం కొంచెమే తగ్గుతున్నది, "లేదే?" అన్నాడు

"అయితే; ఎందుకు వణుకుతున్నారు?"

"భయం కాదు; ఏడుపు రావటం లేదు. కోపంతో వణుకుతున్నాను."

"ఏడుపు దేనికి?"

"ఏడు పెందుకా? నీ కేం తెలుస్తుంది మృణ్మయీ సౌందర్యానికి వెర్రెత్తి పోయినదానివికావు. నీ గుండెలను ఎన్నడూ చీల్చుకోలేదు." అంటుండగానే నవకుమారుడికి దుఃఖం వచ్చేసింది అతను ఆమె కాళ్ళపైన పడి ఏడుస్తూ, "మృణ్మయీ, నీలో కళంకం లేదని ఒక్కసారి చెప్పు. నిన్ను నా హృదయాని కెత్తుకుని ఇంటికి తీసుకుపోతాను." అన్నాడు.

"న న్నెందుకడగలేదూ? అడిగితే చెప్పిఉండేదాన్ని. మీరు నా వెంట చూసినది

పద్మావతిని. నేను కళంకినిని కాను. కాని నే నింటికి రాను. భవానికి బలి అయిపోతాను. తప్పక బలి అవుతాను. మీ రింటికి వెళ్ళిపొండి. నా కోసం విచారించకండి."

"అలా జరగటానికి వీల్లేదు, మృణ్మయీ," అంటూ నవకుమారుడు చేతులు చాచి ఆమె నాలింగనం చేసుకోబోయాడు. కాని అతని ప్రయత్నం ఫలించలేదు. ఆ క్షణంలో పెద్ద కెరటం వచ్చి, కపాలకుండల నిలబడి ఉన్న ఇసుకదిబ్బ నదిలో విరిగి పడిపోయింది. ఆ భయంకరమైన శబ్దం వింటూ, నవకుమారుడు, కపాలకుండల నదిలో పడటం చూశాడు.

మరుక్షణం అతనుకూడా నదిలో దూకి కపాలకుండలకోసం వెతకసాగాడు. అతనికి ఈత బాగా వచ్చు. కాని అతనికి కపాలకుండల దొరకనే లేదు. అతనుకూడా ఆ నదిలోనుంచి మళ్ళీ బయటికి రాలేదు. వాళ్ళిద్దరూ ఏమైపోయారో ఎవరికీ తెలీదు.





రంగడంటే శారదమ్మకు అమితమైన భయం. కాని రాజారావుకు రంగడంటే ఎందుకో నమ్మకం, అభిమానమున్నూ. శారదమ్మ దృష్టిలో రంగడు ఒక దొంగా, ఒక భయంకరమైనవ్యక్తీ ఆమెకీ అభిప్రాయం కలగడానికి కారణం రంగడి వేషధారణమేకాక అతడాయింట ప్రవేశించినరోజే రాజారావు అతనిగురించి చెప్పిన ఉదంతం చాలావరకు కారణం. రాజారావు తన నోటితోనే చెప్పాడు: 'రంగడు ఒక దొంగ' అని. వాడు దొంగతనం చేయడం తాను కళ్ళారా చూచానని వాడిని దొంగగా ఊహించేకన్నా వాడిని మంచివాడిలా చేయడానికి

మన మెందుకు ప్రయత్నించకూడదు అని భార్యతో వాదించాడు రాజారావు. దాని పర్యవసానమే రంగడా యింటిలో ఉండడాని కామె అంగీకరించడం; అది ఆమెకు పూర్తిగా యిష్టంలేదు. కాని భర్తతో ఘర్షణపడటం యిష్టంలేక ఊరుకున్నది

'అసలా ఇంటిలోకి రంగడెలా ప్రవేశించాడు?' అన్న ప్రశ్నకు సమాధానం చెప్పుకునేలోగా రాజారావును గురించి కాస్త చెప్పుకోవాలి రాజారావుది స్వతహాగా జాలిగుండె; కాని ధియస్టుడు మాత్రం కాడు ఒకవిషయాన్ని శోధించి, తరచి చూడాలన్న తాపత్రయం అతనికెప్పుడూ ఉంటుంది. దారిప్రక్కన అడుక్కునే బిచ్చగాండ్రు అతనికొక సమస్య. 'వీళ్ళెందుకు బిచ్చగాళ్ళయ్యారు? వీళ్ళ జీవితాలను మార్చలేమా? ఏం చేస్తే మనదేశంలో బిచ్చగాళ్ళు, దొంగలు లేకుండ పోతారు?' అని ఆలోచించేవాడు. ఇదే విషయాన్ని నలుగురితో ఆలోచించ ప్రయత్నిస్తాడు. ఓసారి అతనిమిత్రుడొకడు అతను చెప్పినదంతా విని "నీవు చెప్పిందంతా ఒకవ్యాసంగా వ్రాసి ఫలాని పత్రికకు పంపు వారు 'రెమ్యూనరేషన్' పంపవచ్చు" అని సలహా యిచ్చి చక్కాపోయాడు ఇంకొక మిత్రుడు రాజారావు చెప్పింది విని 'మనం ఆలోచిస్తుంటే అన్నీ సమస్యలే అందుకని నే నాలోచించడం మానేశాను, అన్నాడు సీరియస్‌గా. కాని రాజారావుమాత్రం నిరుత్సాహపడలేదు బిచ్చగాళ్ళు, దొంగలు వాళ్ళ జీవితాలలో ఎలా మార్పుతేవడం అని ఆలోచిస్తూనే ఉండేవాడు. బజారులో తటస్థపడే ప్రతి బిచ్చగాడినీ చూస్తూనే ఉండేవాడు ఒక రోజు ఏం జరిగిందంటే —

* * *

అవి వేసంగిరోజులు, వివిధరకములైన మామిడిపళ్ళ కాలం అన్నమాట. బజారులో రైల్వేవారి గోడ కానుకుని తాత్కాలికంగా ఏర్పడ్డ దుకాణాలనిండా మామిడిపండ్లే. ఒక దుకాణానికి ఇంకొక దుకాణానికి గల అడ్డుగోడలు మామిడి పండ్ల బుట్టలే.

మామిడిపండ్లబేరాలలో చాల హడావుడిగా వున్నారు వర్తకులు కొనేవారితో, అమ్మేవారితో బజారు చాలా సందడిగా వుంది దుకాణదారుడికి ఎవరు వస్తున్నదీ, ఎవరు పోతున్నదీ చూచేపాటి తీరికగూడ లేదు. అలాంటి సమయంలో ఆ సాయంకాలంనాడు, ఒక వృద్ధ కాయుడు — పెరిగిన గడ్డంతో, తైల సంస్కారంలేని తలతో, చిరిగిన చొక్కా, పంచెలతో ఒక దుకాణంముందు సాక్షాత్కరించి, అడుగోడగానున్న మామిడి పండ్ల బుట్టల్లో ఒక బుట్టలోంచి మాంచి మామిడిపండును తీసి, దానిని కాస్త నిదానంగా పరీక్షించి, అటుయిటు చూచి ఆ పండును కొరుక్కు తినడం రాజారావు కంట పడింది. రాజారావు అతగాడి

చర్యలన్నీ గమనిస్తూనే ఉన్నాడు. రాజారావు తనను గమనించడం కూడ అతను చూచాడు. కాని అతనిముఖంలో కంగారుగాని, కళ్ళలో భయంగాని రాజారావుకు గోచరంకాలేదు రాజారావును నిర్లక్ష్యంగాచూచితనపనిలో తాను మునిగిపోయాడు, దగ్గరేఉన్న ఒక రాయిమీద కూర్చుని అతను

రాజారావు అతని ప్రవర్తనకు అచ్చెరువోయాడు నెమ్మదిగా వాడిదగ్గరి కెళ్ళాడు రాజారావు

"నీవు పండు తీయడం, తినడం నేను చూచాను" అన్నాడు రాజారావు అతడితో

"మీరు చూడటం నేనూ చూచాను" అన్నాడతను.

"నీవు చేసింది తప్పు కాదా ?"

"నే నేం చేశాను ?"

"నీ చేతిలో వున్న పండు దొంగిలించిందికాదా ?"

"ఆకలేసింది. పండు కనపడింది తీశాను. తింటున్నాను. తప్పా ?"

"తప్పుకాదా మరి? దొంగతనం చేయడం నేరం. అది ప్రభుత్వానికి తెలిస్తే తప్పక శిక్ష వేస్తారు."

"జైలులో పెడతారుకదూ ?"

"అవును" అన్నాడు రాజారావు

పెద్దపెట్టున నవ్వాడతను

జైలు. హూం! జైలునాకు క్రొత్తచోటు కాదు. జైలుకు చాలాసార్లు వెళ్ళాను జైలుఅంటే నాకు భయంలేదు ఇప్పుడు పోలీసులను చెప్తారా ? పదండి నేనూ వస్తాను. కాని మీకు తెలియదు, ప్రతి పోలీసుకూ హాడల్ ఊరంగడంటే నాకు చావంటే భయంలేదు. చంపడమంటే సంకోచంలేదు" అన్నాడు గర్వంగా గడ్డం దువ్వుకుంటూ

"నీవు దొంగతనం ఎందుకు చేస్తున్నావో చెప్పగలవా?" ప్రశ్నించాడు రాజారాజావు,.

"తిండికోసం" అన్నాడు కడుపు చరుచుకుంటూ.

"అయితే తిండి దొరికితే దొంగతనం మానేస్తావా ?"

'తిండి దొరుకుతుందా ? దొంగతనం మానెయ్యాలా ?' అని ఆలోచనలో పడ్డాడు. వెంటనే "తిండి ఎలా దొరుకుతుంది ?" అని ప్రశ్నించాడు

"నీకు ఉద్యోగం యిప్పిస్తాను" అన్నాడు రాజారావు

"ఉద్యోగం. హా!" అంటూ పెద్దపెట్టున నవ్వి "ఉద్యోగం అంటే పని చెయ్యడమేనా? పని చెయ్యడమంటే ఈ శరీరం ఎప్పుడో అలవాటు తప్పింది. ఉద్యోగం వద్దు. సద్యోగం వద్దు; నన్నిలా బ్రతుకనివ్వండి" అన్నాడు.

"నీవు కష్టపడటం యిష్టంలేకపోతే పోనీలే. నీవు కష్టపడకుండా నీకు తిండి ఏర్పాటు చేయిస్తాను" అన్నాడు రాజారావు.

"కష్టపడకండ తిండి దొరకుతుందా?

అదెలా సాధ్యం? ఇందులో మోసం లేదుకదా?"

"లేదు ఏమీ మోసంలేదు. నా యింటిలో నీకు తిండి ఏర్పాటు చేయిస్తాను. నీవు నడుం వంచనక్కరలేదు. కాలు కదపనక్కరలేదు."

"పని చెయ్యక్కరలేదు. తిండి దొరుకుతుంది."

"బావుంది. చాలా బావుంది. కాని నేను ఏం చేయాలి?"

"నీవు ఒక్కపని మాత్రం చేయాలి."

"ఏమిటి?"

"దొంగతనం చేయకూడదు."

"నీమీద దయకాదు నీ వృత్తిమీద అసహ్యం. దొంగతనం చేసే నీకు దొంగతనంవల్ల ఎన్ని కుటుంబాలు నాశనమౌతున్నాయో తెలియదు. మా ప్రక్కయింటిలో దొంగలు పడి యిల్లు కొల్లగొడితే ఆయింటి యజమాని ఆ కుటుంబానిని పోషించలేక ఒకరాత్రి యిల్లు విడిచి వెళ్ళిపోయాడు."

'ఆ కుటుంబం ఏమైందో తెల్సా!"

"ఏమయింది?" అన్నాడు ఆత్రుతగా.

"పాపం ఆ కుటుంబాన్ని ఆదుకునేవారెవరూ లేకపోయారు చివరకా కుటుంబం పుట్ట కొకరు చెట్టు కొకరు అయ్యారు. ఆ దొంగమాత్రం ఏం సుఖపడిఉంటాడు? ఎప్పుడో ఒకప్పుడు పోలీసులకు దొరికేఉంటాడు. బాధలు పడే ఉంటాడు నీవుకూడా నీ జీవితంలో అలాంటి పనులేవీ చేయలేదని నేననుకోను అందుకేగా నిన్నీవృత్తి మానేయమంటున్నది. నీకు కావలిసినది తిండేగా. అదేదో నేనే నీకు యిస్తాను. నీవు నా వెంట వస్తావా? నీవు త్వరగా తేల్చి చెప్పాలి. నా కింకా చాలా పని వుంది" అన్నాడు రాజారావు.

"ఉండండి. నన్ను కాస్త ఆలోచించుకోనియ్యండి" అంటూ ఆకాశానికేసి చూస్తూ ఆలోచనలో పడ్డాడు కొద్దిసేపు రాజారావును పరీక్షగా చూచి "పదండి" అన్నాడు.

రాజారావు ఇంటికి కావలసిన కూరగాయలూ, మామిడిపళ్ళూ ఒక సంచీలో నింపుకొని రంగడిని తీసికొని యింటిముఖం పట్టాడు రంగడు రాజారావు ననుసరించాడు రాజారావు బరువైన సంచిని అప్పుడప్పుడు బరువుకు చేతులు మార్చుకోవడం చూస్తూనే ఉన్నాడు రంగడు

"బాబూ! ఆ సంచీ యిలాయివ్వండి. నేను మోస్తాను" అన్నాడు.

రాజారావు నవ్వేసి "ఫరవాలేదు; యింటిదగ్గరి కొచ్చేశాము లే" అన్నాడు.

రాజారావు కేమీ సమాధాన మీయలేదు రంగడు.

ఇద్దరూ మూగగా యిల్లు చేరారు

శారద రంగడిని పరీక్షగా చూచి "ఎవరు వీ"డన్నట్లు కళ్ళతో అడిగింది రాజారావుని.




"ఇవ్వాళ చూడండి వంట. అన్నీ కిలోగ్రాముల్లో తూచిచేశాను "

"ఒకొప్పుడు ఇతను మా నాన్నగారి దగ్గర పని చేసేవాడు. ఇవ్వాళ సాయంత్రం బజారులో కనపడ్డాడు. తీసి కొచ్చాను. ఇతనుమనింటిలోనేఉంటాడు. ముందు మా యిద్దరికీ భోజనం తయారు చెయ్యి. వీధి వెన్నెల్లో కూర్చుంటాము" అని అబద్ధం ఆడేసి (రంగడి ముందు అతని గురించి నిజం చెప్పడం యిష్టం లేక) రంగడితో వెన్నెల్లోనున్న కుర్చీలో కూలబడ్డాడు. రంగడు రాజారావుకు కొద్ది దూరంలో అరుగుమీద చతికిలపడ్డాడు.

రాజారావు ప్రసంగం మొదలు పెట్టాడు

భారతదేశపు ఔన్నత్యమూ, భారత దేశంలో ఎలాటి మహానుభావులుండినదీ, వారు సాధించిన ప్రయోజనాలనూ, బుద్ధుడు, ఏసుక్రీస్తు, గాంధీ, మొద లయినవారలను మనము ఎందుకు ఆదర్శంగా తీసికోవాలో, భారతదేశపు తత్త్వం ఏమిటో? చిన్నప్పుడు బంగారం దొంగిలించిన గాంధీలో ఎలాంటిమార్పు వచ్చిందో, సంతొమ్మిదవ ఏటినుండీ పద్నాలుగు సంవత్సరాలు జైలు శిక్షలో మగ్గిపోయిన 'జీన్‌వాల్‌జీన్' జీవితంలో 'ఫాదర్' ఎలాంటి మార్పు తెచ్చాడో, మనం దొంగతనాన్ని ఎందుకు దరిచేర నీయకూడదో, ఆ వృత్తి ఎందుకు ద్వేషించ తగ్గదో, మనిషికి జంతువుకు గల తేడా ఏమిటో, మనిషిగా బ్రతకడ మంటే ఏమిటో, మనిషికి పరువుప్రతిష్ఠ

లెందుకో, ప్రతిమనిషీ తన జీవితంలో ఉద్దేశించవలసినదేమిటో, దానిని సాధించ డానికి మానవు డేంచెయాలో, ఏం చేస్తే మానవజీవితం సార్థకమౌతుందో ఒక్క బిగిని యేకరువుపెట్టాడు రాజారావు అందులో తన ఉద్దేశ్యాలను, ఆదర్శా లను వెల్లడిచేసాడు.

రంగడు అంతా మూగగా విన్నాడు. అందులో అన్ని విషయాలూ రంగడికి అర్థం కాకపోయినా, కొన్ని అర్థంకాక పోలేదు. ఇంతలో శారద రాజారావును భోజనానికి పిలవడంతో లేచిపోయాడు.

"నీవు నా ప్రక్కనే కూర్చుని భోజనం చెయ్యాలీరాత్రి. రాత్రి నీవు నా అతిదివి," అన్నాడు రాజారావు.

"వద్దుబాబూ! నాకు ఏ ఆకులోనో ఇంత పడేయండి బాబూ. ఏమూలో కూర్చుని తింటాను." అన్నాడు రంగడు రాజారావు ఎంత బలవంతం చేసినా వినలేదు రంగడు శారద రంగ డికి వసారాలో, రాజారావుకు రెండు గజాలదూరంలో భోజనం వడ్డించింది రంగడు సంకోచంతో భోజనం చేశాడు.

రాత్రి పడుకోడానికి ఒక బొంతా, కాస్త మంచిదుప్పటీ ఏర్పాటుచేశాడు రాజారావు. రంగడు వీధిలోనే మేను చేరవేసాడు

రాత్రి రాజారావు శారదకు రంగడి గురించి కాస్త వివరంగా చెప్పాడు.

"దొంగా!" అందామె కంగారుగా.

"గట్టిగా అరవకు" అన్నాడు నెమ్మ దిగా, ఆమె నోరు మూస్తూ.

"వాడు దొంగే కాని వాడిని మంచి దారిలోకి తేవడమే నా ప్రయత్నం నీవు వాడిగురించి భయపడ నవసరంలేదు. ఒక వారంరోజులు వాడిని చాలమంచిగా చూచావంటే వాడి జీవితం పూర్తిగా మారిపోతుంది. వాడు ఒక మనిషి అవు తాడు. వాడిని మంచిమనిషిని చేయ డంలో మన బాధ్యత ఎంతైనా ఉంది," అన్నాడు రాజారావు.

"ఏమో బాబూ! నాకు చాల భయ మేస్తోంది. చూస్తూ చూస్తూ ఒక దొంగని యింట్లో ఎలా పెట్టుకోవడమో నా కర్థం కావటంలేదు — కావలసివస్తే వాడికి వేళ కింత తిండి — రాత్రీ పగలూ పడేస్తాను వాడుమాత్రం మనింటిలో ఉండడం సుతరామూ నా కిష్టంలేదు" అందామె.

"పొరపడుతున్నావు శారదా! వాడికి కావలసింది తిండే అయితే, వాడు యింత దూరం మనింటికి రా నవసరంలేదు. నాలుగుయిళ్ళు అడుక్కుంటే వాడి బ్రతుకు జరిగిపోతుంది. నా వుద్దేశం అదికాదు. వాడికి మనం పెట్టే భోజనంతో పాటూ, మన ప్రవర్తనచేత వాడిలో పరి వర్తన తేవాలి. మనలో ఉన్న మంచి తనాన్ని వాడు గ్రహించాలి. వాడు మనలో మంచి గ్రహించాలి అంటే మనం మంచితనాన్ని వాడికోసం అల




"ఉదయంపూట చదువుకోక కుక్కతో ఆటేమిటి ?"
"ఇవ్వాళ కుక్కమీద వ్యాసం రాయమన్నారు."

వరచుకోవాలి మనలో మంచి అనేదే లేకపోతే వాడు మనలనుండి నేర్చుకునే దేమీఉండదు తెలిసో తెలియకో ఎప్పుడో ఒకప్పుడు ఎందుకోఅందుకు దొంగతనం చేస్తాడు. అందుకు సంఘం వాడిమీద 'దొంగ' అని ఒక చెరగని ముద్ర వేస్తుంది జైలులోనుంచి వచ్చేసిన తరువాత వాడు మంచిగా ప్రవర్తించినా, లోకం వాడిని దొంగగా వ్రేలెత్తి చూపుతుంది. ఇక వాడిలో మార్పు ఎలా వస్తుంది ? వాడు సంఘంనుండి వెలివేయబడ్డట్టు వాడు అనుకోకూడదు మనం వాడియెడల ఆవిధంగా ప్రవర్తించకూడదు...... .." అని కొద్దిసేపాగి మళ్ళీ అన్నాడు "అయినా నాదే పొరపాటు శారదా! నీవుచాలా ధైర్యవంతురాలివని, నా ఉద్దేశ్యాలను అర్థం చేసుకుంటా వనుకున్నానేగాని, ఇంతత్వరగా భయానికి లొంగిపోతా వనుకోలేదు." అన్నాడు రాజారావు

"చివరికి నింద నామీదే వేస్తున్నారు కదూ ? పోనీండి మీ మాటప్రకారమే కానీయండి మీ మీద గౌరవం చేత, మీ మాట నిలబెట్టడంకోసం, మిమ్మల్ని బాధపెట్టకుండా ఉండాలని మీ మాటకు ఒడిగడుతున్నాను. కాని, మీకుగాని, వాసుకుగాని వాడివలన ఎలాంటి ప్రమాదం సంభవించినా వాడిని నేను బ్రతుకనీయను" అందామె.

"శభాష్! నీ పట్టువల నాకు తెలుసు

కారదా!" అంటూ వెన్నెల ఒడిలోకి ఒరిగిపోయాడు రాజారావు.

ఆవిధంగా ప్రవేశించాడు రంగడా యింటిలో. రంగడి ప్రవర్తన కనిపెట్టడం కోసం రెండురోజులు ఆఫీసుకు సెలవు పెట్టాడు రాజారావు. తోటపనిచేయడంతో కబుర్లాడటంతో రెండురోజులు యిట్టే గడిచిపోయాయి. ఆ రెండు రోజులూ రాజారావుగాని శారదగాని రంగడికి ఒక్కపనిగూడ పురమాయించలేదు. తోటలో మొక్కలకు కావలసిన నీళ్ళు అన్నీ రాజారావే తోడుకోవటం. మొక్కలకు అతడే మళ్ళు కట్టుకోవటం. ఇంటికి కావలసిన వంటసామగ్రి అతడే మోసుకురావటం. బజారుపని అంతా అతడే చూసుకోవటం. ఏ పనిలోనూ రంగడి సహాయం అర్థించకపోవటం రంగడికి చిన్నతనమేసింది బట్టలు ఉతుక్కోవటం, 'బాబుకు' నీళ్ళు పోయటం, ఇల్లు తుడుచుకోవటం, వంటకు కావలసిన నీళ్ళన్నీ ఆమే తోడుకోవటం, ఏ చిన్న విషయంలోకూడా రంగడి సహాయం అర్థించకపోవటం తల కొట్టేసినట్టయింది రంగడికి.

మూడవరోజు ఉదయం పూలమొక్కలకి నీళ్లు పోస్తున్న రాజారావు నగిగాడు రంగడు. రాజారావు విననట్టుగా "రాత్రి బాగా నిద్రపట్టిందా?" అని ప్రతిరోజూ లాగే పరామర్శించాడు.

"పట్టిందిబాబూ! ఆ గడ్డపార యిలా యివ్వండిబాబూ! నా కా పని చక్కగా చేతనవును. చక్కగా మళ్ళు తవ్వుతాను" అన్నాడు.

"నీ కెందుకులే ఆశ్రమ నేను చేసుకుంటానులే" అన్నాడు రాజారావు.

"అలా అనకండి బాబూ! మీరూ, అమ్మగారూ నన్ను ఒక్కపనికూడా చేయనివ్వడంలేదు అన్నిపనులూ మీరే చేసుకుంటున్నారు. మీరు నన్ను ఏపనీ చేయనీయకపోతే నన్నిక్కడికి ఎందుకు పిలిచినట్టు! బాబూ చెప్పండి." అన్నాడు

"నీకు ఏపనీ చెప్పననేకదా నిన్ను తీసికొనివచ్చాను" అన్నాడు.

"పని అంటే ఏమిటో అనుకున్నాను బాబూ! ఇలాంటిపనైతే ఏదైనా చేసేస్తాను" అన్నాడు.

"అంతపని చెయ్యకు నీ వెంతపని చేయడానికైనా సమర్థుడవని నాకు బాగా తెలుసు. కాని నీకు పనిచెప్పి కష్టపెట్టడం నా కిష్టంలేదు."

"ఇందులో కష్టం ఏముంది బాబూ! ఇవన్నీ నా కలవాటు అయినపనులే బాబూ! నేను మీకూడు తింటూన్నాను గోళ్ళుగిచ్చుకుంటూ కూర్చోలేనుబాబూ! నాకుకూడా పని చెప్పండి చేస్తాను." అన్నాడు ఆవేశంతో.

"ఏం పనులు చేస్తావు?"

"చెప్పండిబాబూ. ఏపటి చెయ్యమంటే అది చేస్తాను. ఇదివరకు పని చెయ్యగలిగినా, ఎందుకు చెయ్యాలని




"ఏం కక్కాయ్, ఈ మధ్య అసలు నవ్వటం మానేశావు ?"
"నవ్వితే బంగారపుపళ్ళు బయటపడవూ ?"

ఎగే సేవాణ్ణిబాబూ. నిజం చెప్పొద్దూ. కాని మీలాటి మంచివాళ్ళు కష్టపడటం చూడలేనుబాబూ! చెప్పండి, ఏమిటి చెయ్యమంటే అది చేస్తాను" అన్నాడు.

"అన్నిపనులూ నీవు చెయ్యనక్కరలేదు. నేను చెప్పిన పను లేవో చెయ్యి. ఈ ప్రాంతంలో దొంగభయం ఎక్కువ. నేను యింటిలో లేనప్పుడు ఈ యింటిని జాగ్రత్తగా కాపాడుకోవాలి నీవు. ఈ ఇల్లంతా నీదే. నీవు ధైర్యవంతుడవని నీ కీపని ఒప్పగిస్తున్నాను" అన్నాడు రాజారావు.

"దొంగలా బాబూ! నే నీ యింటిలో ఉండగా ఈ యింటివైపు రావడానికి ఎవడికి బాబూ గుండెలు? మీ కాభయం అక్కరలేదు బాబూ. ఈ యింటిని, బాబును, అమ్మగార్ని నా ప్రాణంగా చూసుకుంటాను బాబూ" అన్నాడు, దగ్గరే బొమ్మల్తో ఆడుకుంటున్న వాసును ఎత్తుకొని ముద్దాడుతూ.

"అలాగే నీమీద నాకు మంచినమ్మకముంది. నీ పేరు రంగడే కదూ?''

"అవును బాబూ! నా పేరు రంగడే. మా అమ్మా, మా అయ్యా రంగా! అనే పిలిచేవారు బాబు! చచ్చిపోయి ఏ

లోకాన్న వున్నారో" అన్నాడు కన్నీళ్ల తెచ్చుకుంటూ.

"విచారించకూ రంగా! నే నున్నాగా" అన్నాడు రాజారావు.

"ఎంత చల్లగా పిలిచారు బాబూ! నన్ను 'రంగా' అనే పిలవండి బాబూ! అలాగే పిలవండి" అంటూ కన్నీళ్ళు తుడుచుకున్నాడు రంగడు.

ఆనాటినుండీ రంగడు రాజారావు నమ్మినబంటు. ప్రతీరోజూ ఉదయాన్నే రాజారావుతో లేచి ఇంటికి కావలసిన నీళ్ళు దూరంగా ఉన్న వీధి కులాయి నుండి మోసుకొచ్చేవాడు. తోటలో మొక్కలకు నీళ్ళు పోసేవాడు. బజారు నుండి కావలసిన కూరగాయలు కొని తెచ్చేవాడు. రాజారావు ఆఫీసుకు వెళ్ళి పోయిన సమయంలో వాసును దగ్గర కూర్చోబెట్టుకొని ఆడించేవాడు. సాయం కాలం ఇంటికి కావలసిన నీళ్ళు పట్టేసి, వాసుకు నీళ్ళు పోసి ముస్తాబు చేసేవాడు. రాజారావు ఆఫీసునుండి రాకమునుపే వాసును భుజాన వేసికొని రాజారావు వెంట బజారుకు బయలుదేరేవాడు. రాజారావు దగ్గరినుండి ప్రాపంచక విష యాలు చాల తెలిసికున్నాడు రంగడు. రాత్రి భోజనం చేసి వాసుతో కబుర్లా డుతూ వాసు నిద్రపోగానే నిద్ర కుపక్ర మించేవాడు రంగడు

వాసుకు రంగడిదగ్గర బాగా చేరిక అయింది. రాత్రిళ్ళుకూడ రంగడిని విడిచిపెట్టేవాడు కాడు వాసు. రాత్రిళ్ళు రంగడిదగ్గరే నిద్రపోయేవాడు. కాని శారదమ్మకు ఇదేమీ యిష్టం ఉండేది కాదు. రంగడు రాజారావుకు సన్నిహితు డైనా, శారదమ్మకు మాత్రం రంగడు అంతంత దూరంలోనే ఉండిపోవలసి వచ్చింది. ఆమెకు రంగడంటే సదభి ప్రాయం లేదు. ఇంటిలో ఏ వస్తువు కనపడకపోయినా, రంగడే తీసి ఉంటా డని ఆరోపించే దామె. కాయగూరల కోసం బజారుకు రంగడిని పంపడం ఆమెకు ఏమాత్రం యిష్ట ముండేదికాదు. ఇచ్చిన డబ్బులో 'పావలో, మూడణాలో' సంగ్రహిస్తాడని ఆమె వాదన. రంగడి చేరికతో వాసు పాడయిపోతున్నాడని ఆమె బాధ. రంగడు త్రాగిపారేసిన చుట్టపీకలు వాసు నోటిలో పెట్టుకుంటు న్నాడని, వాడి యాసమాటలే వాసుకు అలవడుతున్నాయని ఆమె ఆరోపణలు. రంగడి చూపులెప్పుడూ వాసు మెడలోని 'పులిగోరు' పతకంమీదా, చేతికున్న నీలం రాయి ఉంగరంమీదే నని ఆమె వాదన.

ఒకరోజు రాత్రి రాజారావు శారదకు సమాధానం చెప్పవలసివచ్చింది.

"శారదా! వాడు చుట్ట త్రాగవచ్చు. వాడి మాటలు స్వచ్ఛంగా లేకపోనూ వచ్చు. వాడు ఒకప్పుడు దొంగ కావచ్చు. అంతమాత్రంచేత వాడిని విద్వేషించడం తగదు. వాడు మనలను పూర్తిగా నమ్మాడు. నేను వాడిని నమ్మాను.



నమ్మినవా డెవడూ చెడిపోడు. ఈ క్షణం వాడిని ఇంటిలోంచి పొమ్మన్నా వాడు పోడు; పోలేడు. ఈ మూడునెలలలో వాడి ప్రపంచజ్ఞానం ఎంత పెరిగిందో తెలుసా? ఇంతకుముందు హైదరాబాదుకు, నిన్నూ, బాబునూ ఒంటిగా విడిచి పోవడమంటే భయపడేవాడిని కానీ వాడుండగా ఎవరికీ ఏ ఆపదా రానివ్వడు. ఆ నమ్మకం నాకు బాగా ఉంది. వచ్చే నెలలో హైదరాబాదు వెళ్ళినా చాల నిశ్చింతతో వెళ్ళిరాగలను" అన్నాడు, స్వేచ్ఛగా ఊపిరి తీస్తూ.

"వచ్చేనెలలో హైదరాబాద్ వెడతారా? రంగడా మాకు కాపలా?" అందామె.

"ఏం? అలా ఆశ్చర్యపోతున్నావు?"

"మీ కలాగే ఉంటుంది. మాటల్లో మనిషి తత్త్వం పూర్తిగా తెలియదు. మీరు ఆఫీసుకు వెళ్ళినప్పుడు వాడు చూచే వాడిచూపులు ఎంత భయంకరముగా ఉంటాయో మీ కేం తెలుసు? వాడు చూస్తూండగా ఇల్లు సవరించడం అంటే నాకు భయం. వాడి చూపు లెప్పుడూ బాబు మెడలోని 'పులిగోరు పతకం' మీదే అలాంటి ఒక దొంగవెధవను ఇంటిలో వదలి వెళ్ళిపోతా నంటున్నారు. మీరు లేనివేళ ఏ పట్టపగలో నా మెడ పిసికి, ఇంటిలో ఉన్నది కాస్తా ఊడ్చుకెళ్ళి పోతే మా కెవరుదిక్కు చెప్పండి." అంది ఆతని రెండుభుజాలు ఊపుతూ.

బెడ్ రూం దీపం కాంతిలో ఆమె కను కొలకులలో నిలచిఉన్న కన్నీళ్ళు చూచాడు రాజారావు. ఆమె భుజాలమీద చేతులేసి, "శారదా! నీ వనేది నేను కాదన లేను. కాని అలాటి దేదీ జరగదనే నా నమ్మకం. నమ్మకాన్ని మించిన దేవుడు లేడు శారదా! దేవుడు మన నమ్మకం చేత ఏర్పడ్డవాడే. నీవు నన్ను నమ్మేవు. నన్ను దైవంగా ఆరాధిస్తున్నావు. అలాంటి నిన్ను ప్రేమతో లాలించ వలసిన ఈ చేతుల్తో ఈ క్షణంలో నీ మెడను పిసికిపారేస్తానా? నన్ను అంతగా నమ్మిన నీకు ద్రోహం చేయ గలనా? నేను దుర్మార్గుడినే కావచ్చు. కానీ నీ ప్రేమానురాగాలవల్ల మేల్కొన్న మానవత్వం అంత దుర్మార్గానికి ఎప్పుడూ నన్నాపని చేయనీయదు. మానవులు చేయవలసిన పని తమలోగాని ఎదుటివారిలోగాని 'నిద్రపోతున్న మానవత్వాన్ని' మేల్కొల్పడమే. ఇంతకీ సూటిగా చెప్పు; నా మీద నీకు నమ్మక ముందా!"

"ఇన్నాళ్ళు నాతో జీవితాన్ని గడిపిన మీ రడిగే ప్రశ్న ఇదేనా? చెప్పండి. మిమ్మల్ని నమ్మనట్టు ఎప్పుడైనా ప్రవర్తించేనా?" అని అడిగింది అతని గుండెల మీద వ్రాలిపోతూ.

"సరదాగా అన్నమాట కీ కన్నీ రెందుకు శారదా? నీవు నన్ను నమ్మినట్టే రంగడు నన్ను నమ్మాడు. వాడిని నేను నమ్మాను. వాడు నా నమ్మినబంటు. వాడి వలన ఎవరికీ ప్రమాదం ఉండదు. నీవు నిశ్చింతగా ఉండు వారం రోజుల్లో తిరిగి వచ్చేస్తాను" అన్నాడు తల నిమురుతూ రాజారావు.

## 2

రాజారావు హైదరాబాద్ వెళ్ళేరోజు వచ్చింది. రాజారావు, ఏ పూలమొక్కకు ఏలాటి సంరక్షణ చేయాలో లాంటి చిన్న విషయాలదగ్గరినుండీ యింటి బాధ్యత లేవేవి ఎలా నిర్వహించాలో లాంటి విషయా లన్నీ రంగడికి బోధించాడు. శారదమ్మను, బాబును జాగ్రత్తగా చూడ మని చెప్పాడు. వారిని తన ప్రాణ

పదాంగా చూచుకుంటా నని హామీ యిచ్చాడు రంగడు.

శారద దగ్గర వీడుకోలు తీసికొని, బాబును ముద్దాడి బయలుదేరాడు రాజారావు. స్టేషన్‌కి దిగబెట్టి, అతన్ని రైలెక్కించి "త్వరగారాండి బాబు మీరు లేకపోతే బెంగెట్టుకుంటాడు" అని హెచ్చరించాడు. బండి కదలేంతవరకూ ఉండి గృహోన్ముఖు డయ్యాడు భారంగా రంగడు.

మూడు రోజులూ మూగగా గడిచాయి.

ఆ మూడు రోజులూ రంగడికి ఆమె ఏ పనీ పురమాయించలేదు. బాబును రంగడితో చేరనివ్వలేదు. రంగ డెవరో, తా నెవరో అన్నట్టు ప్రవర్తించిం దామె. 'బాబూ! బాబూ!' అని అరచి ప్రయోజనం లేక తోటలో ఒక మూల ఏ మొక్కకో మడి త్రవ్వుతూ కూర్చునే వాడు రంగడు. బాబుకి నీళ్ళు పోయటానికికూడా దగ్గరికి రానిచ్చేదికా దామె. రంగడికి ఆమె ప్రవర్తన అర్థం కాలేదు. బాబు తన కోసం ఏడ్చి మొత్తుకున్నా ఆమె రంగడి దగ్గరికి బాబును పంపించేది కాదు. రంగడిలో ఎవరికీ చెప్పుకోలేని బాధ గుండెలో ముద్ద కట్టుకుపోయింది. ఎప్పుడూ, ఎవరికోసం పొందని ఆవేదన అతనిలో నిండి పోయింది.

ఆ మూడు రోజులూ శారదమ్మలో భయాలు సుళ్ళు తిరుగుతునే ఉన్నాయి. ఏమీ జరుగకపోయినా ఏదో ప్రళయం జరుగుతున్నట్టే ఆమె బాధపడేది. ఆమె మనసు వివిధ రకాలైన కథలల్లసాగింది. అనుమానం సాలెపురుగు లాంటిది. ఎంతటి మానవుడైనా ఆ సాలెగూడులో చిక్కుకుంటే 'ఈగ'కు పట్టిన గతే పడుతుంది. ఆ సాలెగూడు నుండి విముక్తి పొందాలంటే ఆ సాలెగూడును అల్లే సాలెపురుగునే నాశనం చెయ్యాలి. శారద మాత్రం అనుమానపు బంధాల లోంచి విముక్తి పొందలేకపోయింది.

ఆరోజు ఉదయం బాబుకు నీళ్ళు పోయబోయి అతని కాళ్ళు వెచ్చగా ఉండడం గమనించి 'బాబు ఒళ్ళు వెచ్చగా ఉన్నద'ని గొణుగుకుం దామె. రంగ డామె మాటలు విని 'బాబుకు నీళ్ళు పోయకం దమ్మా' అని వాదించాడు. నిజానికి రంగడు వాదించకపోతే ఆమె నీళ్ళు పోసేదేకాదు కాని రంగడు వద్దన్నాడు కనుక ఆ పని చేసితీరాలని సిద్ధాంతీకరించుకొని 'ఒంటిలో ఉడుకు' అని సమర్థించి నీళ్ళు పోసేసింది. తల్లి నీళ్ళు పోయాగానే 'జోగుతూ' తల్లి దృష్టినుండి తప్పించుకొని రంగడిని చేరాడు వాసు. పదిగంటలవేళకు వాసు ఒళ్ళు కాగిపోతూండటం గమనించి శారదమ్మకు చెప్పాడు. ఆమె కంగారు పడిపోయింది. జ్వరం తగిలిందని నిర్ధారణ చేసింది. రంగడు బాబు ప్రక్క మరం వేశాడు. జ్వరం తగ్గడానికి ఏం చేయాలి? ఏ

మందులు వేయాలి? అని పదే పదే ప్రశ్నించాడు రంగడు. విసుక్కుంటూ తనకు తోచిన సమాధానా లిచ్చిం దామె. జ్వరం తగ్గడం కనుపించలేదు సరికదా క్షణక్షణానికీ ఎక్కు వవుతూనేఉంది. శారదమ్మ రంగడిని డాక్టరు దగ్గరికి పంపించింది. డాక్టరు అక్కడికి రెండు మైళ్ళ దూరంలో నున్న పల్లెటూరు వెళ్ళ డంచేత శారదమ్మ తనకు తోచిన మందులు వాడింగి. కాని జ్వరం తగ్గే సూచన లేవీ కనుపించలేదు. కనుపించినవారి నెల్ల మందడగడంతో, మాటిమాటికీ జ్వరం తగ్గిందేమో చూడటంతో రంగడికి ప్రొద్దుపోయింది.

సాయంత్రాల్లోంచి రాత్రిళ్ళలోకి ప్రయాణించింది దినకన్య, నిశిలో ఉండే అమావాస్యచుక్కలతో ఆడుకోడానికి. జూన్‌నెల ప్రవేశించినప్పటికీ కొండల చేత పరివృత్తమైన ఆ ఊరిని ఎండ తీవ్రత విడిచిపెట్టలేదు. వేడిగాలి ఇంకా వీస్తూనేఉంది. ఏ అర్ధరాత్రికోగాని వాతా వరణం చల్లబడదు. చంద్రుడు లేని కారణంగా ఇంకా అమితమైన ఉడుకుగా ఉం దావేళ. డాక్టరు వూరినుండి వచ్చా డేమో కనుక్కోడానికి పరుగెత్తాడు రంగడు. డాక్టరుగారు ఆ రాత్రికి రారని కాంపౌడరు చెప్పాడు. అదే వార్త భారంగా చెప్పాడు రంగడు శారదమ్మకు. ఆ రోజు రాత్రి శారదమ్మకుగాని, రంగడికిగాని భోజనాలులేవు. బాబు జ్వరం తగ్గే సూచన లేవీ కనుపించలే దామెకు. ఎవరి సహాయమైనా అడుగుదా మంటే ఆ చుట్టుప్రక్కల ఆమెకు తెలిసిన వారెవరూలేరు. ఉన్నా ఎవరూ పట్టించు కోరు ఏమి చేయాలో ఆమెకు తోచలేదు.

గడియారం తొమ్మిది కొట్టింది.

బాబు పలవరిస్తున్నాడు. ఆ పలవ రింపులలో రంగడి పేరే ధ్వనిస్తోంది.

తనకు తాను కల్పించుకొని మాట్లాడని శారదమ్మ ఆ రోజు బాబు నుదుటన తడి గుడ్డ వేస్తున్న రంగడిని పిలిచి దీనంగా అడిగింది:

"రంగా ఏమి చేయా లిప్పుడు? ఆయనా ఊళ్లోలేరు. బాబుకి అకస్మాత్తుగా వచ్చిన ఈ జ్వరానికి డాక్టరు లేకపోవ డంతో, తెలిసినవా ళ్ళెవరూ లేకపోవ డంతో, బాబు ఏమైపోతాడో అని భయమేస్తోంది. ఆ మధ్య ఎక్కడో విష జ్వరానికి ఇరవైనాలుగు గంటల్లో ఒక ఆడపిల్ల చచ్చిపోయిందట. బాబు ఏమై పోతాడో రంగన్నా!" అని విలపించిం దామె.

"అమ్మా! నన్నేం చేయమంటారో చెప్పండి. మీ రేం చెయ్యమంటే అది చేస్తాను. బాబును బ్రతికించడానికి నా ప్రాణాలైనా యిస్తానమ్మా!" అన్నాడు దీనంగా రంగడు.

"ఏం చేయాలో తెలిస్తే నా కింత బాధెందుకు బాబూ! డాక్టరు వచ్చినా బాగుండేది. కాని ఆ డాక్టరు రెండుమైళ్ళ

దూరంలో కూర్చున్నాడు. నాకేం తోచడం లేదు బాబూ! బాబు ఏమైపోతాడో!" అని ఏడ్చిందామె.

రంగడు ఆలోచనలోపడ్డాడు.

"అమ్మా! ఒక పని చేస్తే," అన్నాడు చటుక్కున.

"ఏమి టది?" అందామె.

"బాబునే డాక్టరు దగ్గరికి తీసికొని పోతానమ్మా. డాక్టరుకు చూపించి మందు యిప్పించి, వీలయితే, సూదిమందు వేయించి మరీ వస్తానమ్మా; చెప్పండి. ఇప్పుడు ఇంతకన్నా ఏం చేయగలం?" అన్నాడు.

'బాబును రంగడి కొప్పగించడమా? ఆ కసాయివాడి చేతిలో పెట్టడమా? తాను ప్రాణప్రదంగా చూచుకునే బాబును 'పులిగోరు పతకం'కోసం చంపేస్తే తా నేం చేయగలదు?' ఈ విధంగా ఆలోచనా తరంగాలు ఆమె మెదడులో దాడిచేసాయి.

ముందుగా ఆమెకా ఆలోచన వచ్చినా 'పులిగోరు పతకం'కోసం బాబును ఏం చేస్తాడో అన్న సంశయం ఆమెను వీడలేదు. పోనీ 'పులిగోరు పతకం' తీసేసి పంపిద్దామా బాబునంటే, రంగడు తన్ను అనుమానిస్తాడేమో అన్నభయం యింకొకవైపున పీడించసాగింది. ఆ ఆలోచనలతో ఆమె యిదమిత్థంగా ఏదీ నిర్ణయించలేకపోయింది.

"అమ్మగారూ! ఏం టాలోచిస్తున్నారింకా. మీరు 'ఊ' అనండమ్మా ఒక్క నిముషంలో డాక్టరుదగ్గిరికి పరుగెత్తి బాబును తెస్తానమ్మా!" అన్నాడు.

కొద్దిసేపాలోచించి "సరే! నీయిష్టం రంగన్నా." అందామె.

తలపాగా సవరించుకున్నాడు రంగడు. బాబుకు వంటిమీద బాగా దుప్పటి కప్పి ఒకచేతిలో హరికెన్‌లాంతరు తీసికొని, ఇంకొకచేతితో బాబును గుండెపైనుంచుకొని "అమ్మగారూ! వెళ్ళొస్తాను. శుభంగా రమ్మని దీవించండమ్మా!" అన్నాడు రంగడు.

శారద కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి. రంగడిని సమీపించి "రంగన్నా! బాబును నీచేతిలో పెడుతున్నాను. వాడిని మరల నాచేతికి ఒప్పగించే బాధ్యత నీదే. వాడిప్రాణాన్ని ఎలా కాపాడుకుంటావో" అందామె తన భయాన్ని వ్యక్తపరుస్తూ.

"భయంలేదమ్మగారూ! బాబుకు నాప్రాణం అడ్డు" అని చెప్పి చీకటిలో దారి వెతుక్కుంటూ బయలుదేరాడు.

ఊరికి దూరంగా విసిరివేయబడిన పైప్రివేటు క్వార్టర్సుకు, ఊరితో ఏమీ సంబంధమున్నట్టు తోచదు ఆ యిళ్ళల్లో కూడా ఒకయింటికీ, ఇంకొకయింటికీ సంబంధం ఉన్నట్టుకూడా ఎవరూ భావించరు. ఎవరిబాధ వారిది. ఎవరి స్వార్థం వారిది. ఆ చుట్టుప్రక్కల ఉన్న పూరిళ్ళలో కాపుసారా కాస్తూండటం, అలగాజనం, అక్కడ త్రాగి, తందనా

లాడి, బూతులు తిట్టుకోవడం పరిపాటే అయిపోయింది.

ఆ ప్రాంతానికి నాలుగు ఫర్లాంగుల దూరంలో నున్న 'ఖార్కానా' నుండి దొంగలు తాము దోచిన వస్తువులు తెచ్చి, ఆయిళ్ళకు కాస్త ఆవలగా నున్న మైదానంలో పంచుకోవడం, ఆమైదానంకు ఆవలవైపున నున్న మామిడితోపులో వాళ్ళు తలదాచుకోవడం రంగన్నకు తెలిసిన విషయాలే. ఒకొప్పుడు అతను కూడా ఆవిధంగా వ్యవహరించినవాడే. అతనికీ తెలుసు తాను వెళ్ళే ప్రాంతంలో ఎలాటి ప్రమాదాన్నైనా ఎదుర్కోవలసి వస్తుందని. కాని ధైర్యంగా ముందుకు సాగాడు.

దారిఅంతా రాళ్ళతోనూ, ముళ్ళతోనూ ఆవరింపబడిఉంది. ఎక్కడ, ఏమూల ఏంఉందో, ఏమూలనుండి ఎవరు వచ్చి పడతారో తెలియదు. కాని హరికెన్ లాంతరు వెలుగులో ధైర్యంగా గబగబా అడుగులు వేసుకుంటూ ముందుకు నడిచాడు రంగడు. ఆ ప్రక్కదారివెంట రెండుఫర్లాంగులు నడిచాడంటే రోడ్డు ఎక్కిపోగలడు. రోడ్డు ఎక్కాడంటే పల్లెటూరు చేరాడన్నమాటే. కాని ఆ మాత్రపుదూరం వెళ్ళడం ఎలా? అసాధ్యమా? అసాధ్యం అన్నది మానవుని శక్తిసామర్థ్యాలకు సంబంధించిన విషయం. రంగడికి తన శక్తిసంపద మీద సంపూర్ణ విశ్వాసం ఉంది ఆ నమ్మకంతోనే ముందుకు అడుగులు వేస్తున్నాడు. పదిఅడుగులు వేశాడు.

దూరంగా చీకటిలో నాలుగు ఆకారాలు కదిలాయి. రంగడిగుండె దడదడలాడింది. అయినా గుండె చిక్కపట్టుకొని ఇంకొక రెండడుగులు వేశాడు. నాలు గడుగులు దగ్గరయ్యాయా ఆకారాలు. చీకటిలోనే పరీక్షగా చూచాడు ఆ ఆకారాలవైపు. ముందుకు అడుగు వెయ్యబోయాడు. నాలుగు ఆకారాలూ దగ్గిరై చుట్టుముట్టాయి. రంగడు ఆగి అన్నాడు "నేను డాక్టరు దగ్గరికి పనుండి వెడుతున్నాను. దయచేసి తప్పుకోండి."

"నీవు డాక్టరుదగ్గరకే వెళ్ళు, దయ్యందగ్గరికే వెళ్ళు; మాకు కావలసింది డబ్బు. నీ చేతిలో దేమిటి? నీ దగ్గర ఉన్నది పారేసి నీ యిష్టమొచ్చినచోటికి వెళ్ళు." అన్నా డొకడు.

"వాడిచ్చే దేమిటి? మనమే చూదాం" అన్నా డొకడు సాహసంతో.

"ఆగండి. నా ఒంటిమీద చెయ్యి వేశారంటే మిమ్మల్ని బ్రతుకనివ్వను. దారివ్వండి" అని గర్జించాడు రంగడు.

"ఏయ్" అని కఱ్ఱ ఎత్తా డొకడు.

"ఆగు" అంటూ లాంతరు నేలమీద పడేసి ఒక్క వూపులో కఱ్ఱ చేచిక్కించుకున్నాడు రంగడు. తన కఱ్ఱసామువిద్య నలుగురిమీదా ప్రదర్శించాడు. మూడు కఱ్ఱలు ఒకకఱ్ఱతో తలపడ్డాయి రంగడు విజృంభించాడు. తన ఒంటిమీదగాని బాబు




ఒంటిమీద గాని, ఒక్క దెబ్బపడకండా కాపాడుకొంటూ నలుగురికీ సమాధానం చెప్పాడు రంగడు. కలియపడ్డవారిలో ఇద్దర్ని చిత్తుగ కొట్టి మూడోవాడిమీద దాడి చేశాడు. వాడు మిగితా యిద్దర్నీ అనుసరించాడు. నాలుగోవాడు మాత్రం రంగడి తలమీద బలంగా కొట్టి రంగడి కఱ్ఱ దెబ్బకు తట్టుకోలేక క్రింద పడిపోయాడు

రంగడు తలపాగాను చుట్టుకొని రక్తం కారిపోతున్నా లెక్కచేయకుండా శక్తి కూడదీసికొని, కిరసనాయిలు ఒలికి ఆరిపోయి నేలమీద పొర్లాడే హరికెన్ లాంతర్ని వదలి ముందుకు బయలుదేరాడు.

నీరసంగా తేలిపోయే కాళ్ళను బలంగా వేస్తూ, రోడ్డు ఎక్కి పల్లెటూరి

వైపు ప్రయాణించాడు రంగడు. మనిషిని ధైర్యం ఎంతపని అయినా చేయిస్తుంది. అదే ధైర్యం, అదే దీక్ష రంగడిని ముందుకు పొమ్మని ప్రోత్సహించాయి. డాక్టరు యింటిముందు వ్రాలాడు నీర సంగా తేలిపోయే శరీరంతో. విషయం క్లుప్తంగా చెప్పి పడిపోయాడు రంగడు.

డాక్టరుకు పరిస్థితి అర్థమైంది.

వెంటనే బాబుకు మందు యిచ్చి, వెనువెంటనే ఇంజక్షన్ యిచ్చి, రంగడి తలకు కట్టుకట్టాడు. కాఫీ త్రాగిన పిమ్మట కొద్దిగా తేరుకున్నాడు రంగడు గడియారం పన్నెండు కొట్టింది. గడి యారం వైపు చూచాడు రంగడు. వెంటనే బాబు వైపు దృష్టి సారించి 'బాబు కెలావుంది ?' అని ప్రశ్నించాడు. తాను బాబుకు మందు యిచ్చిన సంగతి చెప్పి జ్వరం తగ్గుతుంది, కంగారు పడ వద్దని చెప్పాడు డాక్టరు. రంగడు లేచి బాబును తీసికొని బయలుదేరపోయాడు. డాక్టరు వెళ్ళవద్దని, తెల్లవారిన తర్వాత తాను పంపిస్తా నని చెప్పాడు. కాని రంగడు వినలేదు.

"అమ్మగారు మాకోసం వెయ్యి కన్నులతో ఆతృతగా చూస్తుంటారు. బాబును అమ్మగారికి ఒప్పగిస్తేగాని నాకు నిద్రపట్ట" దన్నాడు రంగడు.

"నీవు వెళ్ళలేవు" అన్నాడు డాక్టర్.

"కాని నేను వెళ్ళాలి" అన్నాడు రంగడు.

గడియారం ఒంటిగంట కొట్టింది.

ఆతృతగా తల ఎత్తి వీధిలోనికి పరుగెత్తిపోయి చూచింది. రంగడి జాడ కనుపించలేదు. మనసు వెయ్యి అప శృతులు పలుకసాగింది. వీధిలో నిల్చుని నిశీధిలోనికి చూస్తూ నిలుచుంది. దూరంగా ఎవరో బాబు పీక పిసుకేస్తు న్నట్టు, బాబు అరుస్తున్నట్టు అనిపిం చింది. క్షణాలు యుగాలుగా గడిచి పోతున్నాయి.

రంగడిజాడ కనిపించలేదు. చీకట్లో ఒక కారు కదలివచ్చి ఆగింది. శారదమ్మ కళ్ళలో ఆశ మెరిసింది. డాక్టరు బాబు నెత్తుకొని రావడం కనుపించింది.

"బాబు కెలా ఉంది ? రంగ దేడీ?" అని ఆత్రంగా అడిగింది.

"రంగడికి దెబ్బలు తగిలాయి. హాస్పి టల్‌లో ఉన్నాడు. బాబుకు ఒక గంటలో తగ్గిపోతుంది. బాబుకు ఈ మందు ఇవ్వండి. రంగడిని రేపు పంపిస్తాను" అంటూ డాక్టరు కారెక్కాడు.

* * *

రాజారావు హైదరాబాదునుండి రాగానే శారదమ్మ బాబుతో ఆడుకునే రంగడిని చూపి "రంగడు ఎంతమంచివా డనుకున్నారు !" అన్నమాటలు విని రాజారావు ఒక్కసారి నివ్వెరపోయాడు.



# సుకృతి

మందమలయానిలకుమార! మృదుకుముద మక
రందారుణాంగుళీ! సుందరీహీరకై
డెందమే విరిసె నీ సందేశ కుందమై
అందింపవా! దీని నందాల బరిణకై.

దూరాన వారినిధి తీర సౌధమ్ముపై
తీరతరళమ్ము సుకుమార తల్పమ్ముపై
పారావతాల మురళీరవమ్ముల జాలు
వారు వెన్నెల తేటలో రమణి పవళించు.

దివినుండి దిగివచ్చి, భువినోయగము లెల్ల
తిలకించి, శర్వరీందిరయే శయించె నని
తలచి, మరి యెటకైన తరలిపోయెదవేమొ!
వెలది నా కలల హరివిల్లు నిజమే సుమా!

రేయెల్ల నిటు కలవరింతలోనే గడచి
పోయె! నిట్టూరుపుల పొగిలె నా హృదయమ్ము!
ప్రేయసీ నయనయుగమే యింక చుంబింతు
వోయి! నీవే సుకృతి వో భాగ్యసేవధీ!

---

పి. గణపతిశాస్త్రి



వివాహ సమస్య

# పాలికలు

హిత శ్రీ

అరుణోదయాన్ని చూసే అలవాటు ఆ ఇంట్లో ఇంటి ఇల్లాలికి తప్ప ఇంకెవరికీ లేదు. నారాయణరావు మూడో జాముకి గానీ క్లబ్బు వదిలి ఇంటికి చేరడు. చలపతి చదువుకోటాని కనే నెపంతో స్నేహితు డింటికి మసక చీకట్ల వేళే వెళ్ళి, ఏ రెండో ఆట సినిమాకో, నాటకం రిహార్సల్‌కో హాజరై, తండ్రి కంటే రెండడుగులుమాత్రం ముందుగా గూటికి చేరతాడు. ఇంక పద్మకి మొదటి నించీ ఆలోచనలు జాస్తి. అందులో ఈ మధ్య పక్కవాటాలోని ముందుగదిలో గుసగుసలు ఆమెని నిద్ర పోనివ్వవు. ఇంక సప్తాశ్వాల మీద ఉరుకులు పరుగులు తీసి సూర్యభగవాను డెంత హడావిడి చేస్తేమాత్రం వాళ్ళ కేమెరుక? ఒక్క సావిత్రమ్మ మాత్రం, పొద్దస్తమానమూ చాకిరితో సతమతమై పక్కమీద మేను వాల్చగానే ఆదమరిచి నిద్ర పోయినా, తొలికూడి కూతకే లేచి ఒక్కసారి ఆ ముగ్గురివైపూ చూసి, కిటికీ తలుపులు దగ్గిరగా వేసి, దినచర్యలో నిమగ్నమైపోతుంది.

నారాయణరావూ, చలపతీ, పద్మా ముగ్గురూ మూడు రత్నాలని ఆమె నమ్మకం. దుమ్ముతో నిండిన లోకంలో వాళ్ళు ప్రకాశింపలేకపోవచ్చు. అది వాళ్ళ లోపంకాదు. అందువల్ల వాళ్ళకి సావిత్రమ్మ సానుభూతి పూర్తిగా ఉంది.

నిజానికి నారాయణరావు మంచివాడే. తెలివిగలవాడే. ఆ రోజుల్లో బి. ఏ. ఫస్టుక్లాసులో ప్యాసైన ఘనతగలవాడే. రెవెన్యూ డిపార్టుమెంట్‌లో మంచి అభివృద్ధిలోకి రాగల అవకాశా లున్నాయని సర్వీసు కమిషన్ పరీక్షకి కూర్చోని రెవెన్యూ డిపార్టుమెంట్‌లో ఎల్. డి. సి గా సెలక్షన్ సంపాదించుకున్న ఘనుడే. అయితే దురదృష్ట వశాత్తూ, ఏ కారణం వల్లనైతే యేం అతను ఆశించిన అభివృద్ధి లభింపక నిస్పృహ చెందాడు. రాత్రింబగళ్ళు చేసిన చాకిరీకి ప్రతిఫలం ఎల్. డి. సి. గా కన్‌ఫరమ్ అవటమే. అతని తోటివా రెందరో పైపదవుల్లోకి పోయారు. కాని నారాయణరావుని అదృష్టం కటాక్షించలేదు. దాంతో జీవితంమీద ఒక నిరసన భావమూ, అలసత్వమూ కలిగాయి. ఇప్పుడు అయిదు దాటితే హరిహరాదులు అడ్డుపడినా ఆఫీసులో ఉండడు. వెనకటి నమ్రతలేదు. ఎంతటి ఆఫీసరునైనా సరకు చెయ్యకుండా "రూల్" కోట్‌చేసి నోరు కట్టిస్తాడు.

ఒక్కదిగులు మాత్రం అతన్ని కుంగ దీస్తోంది ఏదో పెద్ద ఉద్యోగం చేసి భార్యా బిడ్డల కేమో ఒరగ పెడతా మని కలలు కనేవాడు. ఆ ఆశలు అడియాస లయాయి. ఉన్న ఆస్తి సర్వస్వం మూ డెకరాలు చలపతికి పెద్ద చదువులు చెప్పించి ఫారిన్ పంపాలనీ, పద్మకి గొప్ప సంబంధం తేవాలనీ పదేపదే అంటుండేవాడు. అవన్నీ ఒట్టి మాటలై పోయాయి. మూ డెకరాల ఆస్తితో త నేం సాధించగలడు

ఇలా నిస్పృహ చెందే తరుణంలో ఒక సంఘటన జరిగింది. స్నేహితుల బల వంతం మీద రూపాయిపెట్టి కొన్న రాఫిల్ టికెట్ సంగతి తను ఎప్పుడో మర్చిపోయినా, అది తనని మర్చిపో కుండా ఒక వందరూపాయిల బహుమతి తెచ్చింది చీకటిలో ఒక మెరుపు మెరి సిన ట్టయింది. అప్పటినించీ నారాయణ రావు రాఫిల్ టిక్కెట్లు కొనటం, పజిల్స్‌కి డబ్బు కట్టటం ప్రారంభించాడు. అంతే కాదు, తన అదృష్టాన్ని క్లబ్బులో పరీ క్షించమని స్నేహితు లిచ్చిన సలహా అమూల్యంగా భావించి పేకాట సాగిం చాడు. పదులూ, యాభైలూ, వందలూ పోయినప్పుడు పోయినా, తిరిగి సంపా దించినప్పుడు కొడిగట్టిన దీపాన్ని ఎగ ద్రోసి నూనె పోసినట్టయి ద్విగుణీకృతో త్సాహంతో ఆటలో దిగసాగాడు. రెం డెంకరాలు పోయాయి.



సావిత్రమ్మ కంగారు పడ్డది. ఆమె ఏమన్నా అంటే "మరి డబ్బు ఇంకెలా వస్తుంది? పిల్లల భవిష్యత్తేమిటి, సంపాదించా లనేకదా నేను అవస్థపడేది" అనేవాడు. ఏమనటానికీ ఆమెకి నోరు వచ్చేది కాదు. నిట్టూర్చేది. ఏదో నీడ ఆ ఇంటిని కప్పేస్తోంది. నీడ పడ్డ దంటే ఎక్కడో వెలుగుండాలి. ఎక్కడో—

ఎక్కడిదో వెలుగు తమ ఇంట్లోనే ఒకరాత్రి ప్రసరించింది. మూడువేలు ఒక్కరాత్రిలో జేబులో వేసుకొని

వచ్చాడు నారాయణరావు. అతని సంతోషానికి మేరలేదు. సావిత్రమ్మ ముఖం కళకళ లాడింది. ఎక్కడిదో నను కుంది వెలుగు! అయితే వెంటనే ఆమె ముఖం చిన్నబోయింది నీడ ఎక్కడిదో! ఏదో దిగులు ఆమె గుండెల్లో గూడు కట్టుకుంది. కాని తాత్కాలిక సంతోషం ఆమెకి ఉల్లాసాన్నే కలిగించింది. దానికి తోడు నారాయణరావు ఉత్సాహంగా ఒక మంచిమాట అన్నాడు.

"సావిత్రీ, ఇంత డబ్బు నా దగ్గిరుంటే రేపు ఏ మౌతుందో చెప్పలేను. ఎందుకైనా మంచిది. ఇది నీ పేర బ్యాంకులో వేస్తాను."

"నా పేర వెయ్యట మెందుకండీ. నిక్షేపంలాంటి కొడుకుండగా. మన చలపతి పేర వెయ్యండి." అందామె.

ఇంక చలపతి సంగతి: చలపతి బుద్ధిమంతుడు కాడని ఎవరూ అనరు. ఎందుకంటే బడిలో వేసినప్పటినించీ ప్రతిక్లాసూ ప్యాసై ఇప్పుడు బి. ఏ. ఫైనలియర్ చదువుతున్నాడు. చదువులో కొంత అదృష్టవంతుడనే చెప్పాలి. మొదట మొదట కష్టపడి చదివి బాగా మార్కులు తెచ్చుకునేవాడు.

"ఎందుకోయ్ మార్కులు; కూటికా గుడ్డకా? ప్యాసు కావటానికి ముప్పయి అయిదు చాలవూ? దానికోసం ఇంత కష్టపడి రాత్రింబగళ్లు చదవాలా? నేను రాజాలా తిని తిరుగుతాను. పరీక్షల ముందు కొన్ని ముఖ్యమైన టాపిక్స్ చదివివేస్తాను. బస్. థర్టీఫైవ్ పర్సెంట్. ప్యాస్. అంతే." అని విలువైన సలహాను అతని ముఖ్యస్నేహితుడు పి. యు. సి. చదువుతున్నప్పుడు అయాచితంగా ఇచ్చేశాడు. చలపతికి అది కొంత నచ్చింది. అమల్లో పెట్టి పి. యు. సి అగడ్తని సునాయాసంగా లంఘించాడు. ఇప్పుడు అదే సూత్రాన్ని అవలంబించి ఏదో మూడు ముక్కలు వీలైనప్పుడు నెమరేస్తుంటాడు అలా అని చలపతిని సోమరిపోతు అనటానికి వీల్లేదు.

నాటకాలంటే చలపతి చెవి కోసుకొంటాడు. ఎక్కడ నాటకం వేసినా హాజరు. అతనికి మంచి కంఠం ఉంది. ఎప్పుడూ రాగాలు తీస్తుంటాడు. అతని ధ్యేయం ముందు నాటకరంగం; అక్కడినించి సినిమారంగం అతనికి చాలా మంది ఆరాధకు లున్నారు వాళ్ళెప్పుడూ అతని చుట్టూ తిరుగుతూ అత నప్పుడే సినిమాలో చేరిపోయినట్టుగా కొలుస్తుంటారు. దాంతో చలపతికి గొప్ప ఆత్మవిశ్వాసం కలిగింది. కేవలం సినిమాల్లో, నాటకాల్లో నటించటానికే తను జన్మ ఎత్తినట్టు భావించసాగాడు. కాలేజీ నాటకాల్లో, పాటల పోటీల్లో సంపాదించిన బహుమతులు తన కళాజీవిత నాటకానికి నాందీ ప్రస్తావనలని విశ్వసించాడు. ఏ సినిమాతార వచ్చినా ప్రయాసపడి




"ఆఫీసరుగారు పనిలో ఉన్నారు, కొంచెంసేపు ఆగండి!"
"నేను రావుబహద్దూర్ని మీకు తెలుసా?"
"ఆ, తెలుసు మా ఆఫీసరుగారు భారతభూషణ్."

ఇంటర్వ్యూ సంపాదించి పరిచయం చేసుకొని తనే ఆ సినిమా తార స్థానంలో ఉన్నట్టు ఊహాలోకంలో విహరిస్తాడు.

చలపతికి ఇంతగా నాటక సినిమా రంగాలమీద వ్యామోహం ఉన్నా, బి. ఏ. ప్యాసుకావాలనే కాంక్ష గాఢంగానే ఉంది. గ్రాడ్యుయేట్ అయితే గాని గౌరవం ఉండదు. సినీ ఫీల్డులో గ్రాడ్యుయేట్‌గా ప్రవేశిస్తే ఇంక తన దర్జాకీ, ప్రతిష్ఠకీ, భవిష్యత్తుకీ ఎట్టి విధమైన ఆటంకం ఉండదని అతని అభిప్రాయం. లేకపోతే ఈసరికి ఎప్పుడో మద్రాసులో రెక్కలుగట్టుకు వాలేవాడు.

కాలేజికి ప్రయాణమౌతున్న చలపతిని పిలిచి నారాయణరావు అన్నాడు:

"ఒరేయ్ చలపతీ, అలా బ్యాంకుకి వెళ్లివద్దాం. మూడు వేలు డిపాజిట్ చేయాలి. ఇది పద్మ పెళ్ళి కోసం. డబ్బు వచ్చినప్పుడల్లా ఈ అకౌంటులో వేస్తూంటాను. పదివేలైనా కావాలిగదా! పద్మ పెళ్ళికి తప్ప ఈ డబ్బు వాడటానికి వీల్లేదు. బుద్ధి పుట్టి తీస్తానేమోనని. నీ పేర బ్యాంకులో వేస్తాను. నేనడిగినా ఈ లోపల నువ్వు డబ్బు తీయవద్దు. తెలిసిందా?"

వివరాలు అడగడం చలపతి కిష్టం లేదు. "సరే" అని తలూపి తండ్రి వెంట ప్రయాణమయ్యాడు.

పద్మ ఈ వివరాలు వింటూనే ఉన్నది. క్రితం రాత్రి నాన్న చెప్పినదీ విన్నది. ఏమిటో, ఆకాశానికి నిచ్చెనలు వేస్తున్నా రని ఆమెకి పూర్తిగా తెలుసు. ఆ కొంగ చిల్లులు పడిన గొడుగు అనీ ఆమె గుర్తించింది. స్కూల్ ఫైనల్ ప్యాసయి మూడేళ్ళయింది. కాలేజీ చదువు చదవా లని ఉబలాట పడ్డా... ఏదీ అది సాగ లేదు.

పక్కవాటాలోని నీరజ తన క్లాస్ మేట్. అదీ స్కూల్ ఫైనల్‌తో మానే సింది. వాళ్ళూ ఉన్నవాళ్ళు కాదు. కాని అదృష్టం అంటే దానిదీ. పెద్ద చదువు లేకపోయినా మంచి సంబంధం దొరికింది. ఆ ఏటి వేసవిలోనే పెళ్ళి అయింది. చుట్టాలింట్లో పెళ్ళికి వెళ్ళి నప్పుడు అతను నీరజని చూశాట్ట-కల వారబ్బాయి. ఆనర్స్ పాసయాడు. కట్నం దమ్మిడీ తీసుకోకుండా తలిదండ్రుల మాట కెదురాడి నీరజే కావాలని పట్టు పట్టి చేసుకున్నాడు. పెళ్ళయింతరవాత క్లాస్ వన్ ఆఫీసరుగా సెలెక్టయాడు. అదృష్టమంటే అదీ.

నీరజ చెప్పింది. తనంటే అతని కెంతో ప్రేమట. ఇంట్లో ఉన్నంత సేపూ తన దగ్గరే ఉంటాడట. తనేం చేసినా మెచ్చుకుంటాడట. ఏ చీర కట్టినా చీరకే అందం వచ్చిందని ప్రశంసిస్తాడట. బీద ఇంట్లో పిల్ల అనే తారతమ్యం ఎప్పుడూ మాటల్లో కూడా రానీయడట. అయినా అది వేరే చెప్పటం దేనికీ? ప్రత్యక్షంగా కనిపిస్తూంటే! మళ్ళీ ట్రెయినింగ్‌కి వెళ్ళాలని ఒక నెల రోజులనించీ అక్కడే ఉంటున్నాడు. అర్ధరాత్రి దాటేదాకా ఆ గదిలో లైటు వెలుగుతూనే ఉంటుంది. ఏమిటో మాటలు వినిపిస్తూనే ఉంటాయి. అంత సేపు మాట్లాడటానికి ఏం మాటలు ఉంటాయో! ఆమెకి కొంచెం ఆశ్చర్యంగానే ఉంటుంది.

కోలముఖం. చెంపకి చారేసి నిళ్ళు. నీరజ చక్కని చుక్క. అయితే ఉంగ రాలు తిరిగి, ఇంద్రనీలమణులతో పోటీ పడుతూ పిడుతున్న కవ్వించే కేశసౌం దర్యం ఆమెకి లేదు. తను ఒప్పుకోవాలే గాని తలనూనెల కంపెనీల వాళ్ళు పోటీలుపడి తన ఉంగరాల జుట్టుని ప్రక టించుకునే హక్కు కొనేసి పత్రికలన్ని టినీ తన బొమ్మలతో నింపేస్తారని క్లాస్ మేట్స్ హాస్యమాడుతుండేవాళ్ళు. చారు కేశి, హరిణలోచని, చంద్రముఖి అని తనకి నిక్‌నేమ్స్. కాని దేనికైనా పెట్టి పుట్టాలి కాబోలు! చివరికి ఏ ఎలిమెం టరీ టీచరో తనకి రాసిపెట్టి ఉన్నాడేమో! ఆ ఊహ రాగానే ఆ హరిణలోచనాల్లోని తళుకు బెళుకులన్నీ మాయమై పద్మ నేత్రాలు తెల్లవారుజామున మినుకు మినుకు మనే చుక్కలై పోతాయి.

* * *



"ఈసారి ఎక్కడికి పోతావు. మేమంతా నీ బస్సుకిందపడి చచ్చినవాళ్ళమే."

పద్మ పట్టుపట్టి టైపు నేర్చుకొంటోంది. సాయంకాలం ఐదింటికి టైప్ ఇన్‌స్టిట్యూకి వెళ్ళి ఆరింటికి తిరిగి వస్తుంది. మొదట మొదట గమనించలేదుకాని తర్వాత పద్మ ఒక విషయం కనిపెట్టింది. మెయిన్‌రోడ్డు మలుపులో ఒక మేడ ఉంది. ఆ మేడమీది వరండాలో ఒక వ్యక్తి నిలబడి ఉంటాడు. తను వెళ్ళేటప్పుడూ, తిరిగి వచ్చేటప్పుడూ తనవైపు గుడ్లప్పగించి చూడటమే అతని ఉద్యోగంలా ఉంది. మొదట పద్మకి చిరాకేసింది. తర్వాత కొంచెం కుతూహలం పెరిగింది. అత నెవ్వరో! కాని తన కేమీ పట్టనట్టు ఆమె వెళ్ళి వస్తూనే ఉంది.

శృతిమించి రాగానపడింది. ఒక రోజున అతను పద్మని అనుసరించాడు. మర్నాడు ఇన్‌స్టిట్యూట్‌కి వెడుతున్నప్పుడుకూడా అతను తన వెంటపడటం ఆమె కనిపెట్టింది. వెనక్కి తిరిగి "రాస్కెల్" అందా మని చటుక్కున ఆగింది. కాని తమాయించుకుని ముందుకి సాగింది.

టైప్‌మెషీన్ ముందు కూర్చుని 'అమ్మయ్య' అనుకుని వెనక్కితిరిగి చూసింది. ఆమె ముఖం జేవురించింది. అతను లోపలికి అడుగు పెట్టాడు. ప్రొప్రయిటర్‌తో ఫిర్యాదు చేద్దా మనుకొని లేవబోయింది. ఇంతలో ప్రొప్రయిటరే వచ్చి "ఇదిగో, ఈ మెషిన్‌మీద ప్రాక్టీసు చెయ్యండి" అని అతనికి పద్మ పక్కనే ఉన్న టైప్‌రైటర్ చూపించాడు.

పద్మ నాలిక కొరుక్కుంది. ఉక్రోషంతో ముఖం ముడుచుకుంది. అతను

చిరునవ్వుతో ఆమె పక్కనే ఆసీనుడై టైపు చేయటం ప్రారంభించాడు.

"మీ స్పీడెంతండీ?"

తననే అడుగుతున్నాడని తెలిసినా పద్మ మాట్లాడలేదు.

"నాకు ఎబిసిడి లు రావండీ. ఇదే మొదలు" అతను చనువు కల్పించుకోసాగాడు.

"మాస్టరుగారూ, నాకేమీ నేర్పకుండా పోయారేం?" అతను గట్టిగా అన్నా టైప్ రైటర్ల మోతలో ఆ మాటలు ప్రొప్రయిటర్ కి వినిపించలేదు. అదీ గాక అప్పుడే ఆయనకేదో పెద్ద జాబ్ వర్క్ తగిలింది. జాబ్ వర్క్ వచ్చిందంటే స్టూడెంట్లసంగతి ఆయనకి జ్ఞాపకం ఉండదు.

"మాస్టారికి గిరాకీ తగిలింది. ఏమండీ, మీ పుణ్యం ఉంటుంది. ఎలా మొదలుపెట్టాలో చెప్పండీ" ఎంతో పరిచయం ఉన్నట్టుగా అత ఒడిగాడు.

పద్మ ఒక్కసారి ఇన్ స్టిట్యూట్ కలయచూచింది. అందులో పదిహేను మెషిన్లు ఉన్నాయి. అన్నీ టకటక మోగుతూనే ఉన్నాయి. స్త్రీ పురుషులకి అక్కడ ప్రత్యేకస్థానాలులేవు. ఎవరి గొడవ వారిదీ. లోయర్, హైయర్ ప్రాక్టీసింగ్ లో ఎవరిఅవస్థ వారు పడుతున్నారు.

కేవలం మర్యాదకి పద్మ అతని మెషిన్లో కాగితం పెట్టి "ఎ ఎస్ డి ఎఫ్ జి హెచ్ - మొదటిపాఠం అంటే, ఇదిగో ఇలాటిటైప్ చేయాలి" అని ఒకవరస టైపు చేసి చూపించి స్వస్థానంలో కూర్చుంది.

"థాంక్స్. మీరు ఏ పరీక్షకి కూర్చుంటున్నారు?" అన్నాడతను.

"లోయర్ గ్రేడ్" అందామె అయిష్టంగానే

"నేనుసరదాకి నేర్చుకుంటున్నానండీ. నాకు పరీక్షల అవసర మేంలేదు. పోర్టబుల్ టైప్ రైటర్ కొందా మనుకుంటున్నాను."

"ఉఁహుఁ."

"మీరు కాలేజిలో చదువుతున్నారా?"

"లేదు"

"ఎంతవరకు చదివారండీ?"

"స్కూల్ ఫైనల్."

"ఐసీ మె ఐ నో యువర్ నేమ్ప్లీజ్"

"పద్మ."

"అలాగాండీ. చాలా బావుంది. నా పేరు శంకర్అండి. లిటరేచర్ ఆనర్స్ ఫైనలియర్ చదువుతున్నాను"

పద్మ గబుక్కున తలెత్తి అతనివైపు ఓ సారి చూసి తనపనిలో నిమగ్నమైంది.

"అయితే టైప్ రైటింగ్ నేర్చుకోటం ఎందుకంటారేమో. చెప్పాను కదూ. పోర్టబుల్ కొందామని వుంది. ఫారిన్ వెళ్ళి రిసెర్చి చేయాలని ఉబలాటము. ఆనర్స్లో ఫస్ట్క్లాస్ వస్తేగాని సీటురాదు. కష్టపడి చదువుతున్నా ననుకోండి.

మాన్ ప్రపోజెస్ గాడ్ డిస్పోజెస్; ఏమంటారు?"

అతను నవ్వుతూ ఆమె వైపు చూశాడు. పద్మకి అతనిమాటలు కొంత ఉత్సాహాన్నీ, కొంత నవ్వునీ కలిగించాయి. ఎంతో పరిచయ మున్నట్టు మాట్లాడుతున్నాడు పైగా తనేదో బంధు వైనట్టు అమాయికంగా తనగొడవ చెప్పు కుంటున్నాడు. పాపం, అతను తను అనుకున్నట్టు ఆకతాయి కాడేమో!

కొంతసేపయింతరవాత పద్మ యింటికి దారి తీసింది. అతను వెంబడించలేదు. ఎటో వెళ్ళిపోయాడు. అతనిపట్ల కొంత సుహృద్భావం కలిగిందామెకి. మర్నాడు. మళ్ళీ అతను హాజరు. హుషారుగా మాట్లాడాడు. పద్మ కొంచెం మాటలు కలిపింది. కొంతసేపయింతర్వాత ఇద్దరూ ఆ మేడదాకా కలిసే వచ్చారు.

పరిచయం వృద్ధి అయింది. పద్మ అడక్కుండానే శంకర్ తన వివరాలన్నీ ఆమెకి చెప్పాడు. అలాగే ఆమె వివ రాలు తెలుసుకున్నాడు. పద్మ తెలివి తేటల్ని అతను మెచ్చుకోని రోజులేదు. ఒకరోజు ఇంటికివస్తూ, "టైప్‌రైటర్‌కీ బోర్డుమీద మీ సన్నటి చేతివేళ్ళు నాట్యం చేస్తుంటే గలగల గాజులు వీణ వాయిస్తూ, టైప్‌రైటర్ ధ్వనికి లయ కల్పిస్తూ, నన్ను మరో దివ్యప్రపంచం లోకి తీసుకుపోతాయండీ" అన్నాడు శంకర్.

ఆ మాటలకి పద్మ పరవశించింది.

"ఆ తెల్లచీర మీ కెంత అందాన్నిస్తుం దండీ! తెలుపురంగంటే నా కెంతో ఇష్టం. చూడండి; వందలకి వందలు మా నాన్న పంపిస్తున్నా, నేనెప్పుడూ ఈ తెల్లబట్టలే వేసుకోటం ఎందుకనుకొంటున్నారు? తెలుపులో ఏదో స్వచ్ఛత ఉందండీ. అది మనసుని మైమరపిస్తుంది."

పద్మ అతని మనోనైర్మల్యాన్ని ఇక శంకించలేదు.

"గులాబీకి ఎంత లావణ్యం ఉన్నా నాకు మల్లెపువ్వు అంటేనే ఇష్టమండీ. కాని మిమ్మల్ని చూసిం తరవాత నాకు గులాబీ పువ్వులో ఇదివరకు కన్పించని అందాలు కన్పిస్తున్నాయండీ."

ఎరుపెక్కిన కపోలాలవైపు చూస్తూ అత నలా అంటే పద్మ సిగ్గుతో తల వంచుకునేది. ఆ క్షణంలో ఆమె దృష్టిలో నీరజా ఆమె భర్తా మెదిలేవాళ్ళు. తనకీ అంత అదృష్టం కలగబోతోందా!

పద్మ ఇప్పుడు తరుచు బీచ్‌కి వెడు తోంది. శంకర్ ఏవో కబుర్లు చెబుతూ త్వరగా కదలనివ్వడు. ఇంట్లో పరీక్షలు దగ్గిర వస్తున్నా యనీ, మరికొంత సేపు టైపు చేస్తున్నాననీ సంజాయిషీ చెప్పటం పద్మ అలవాటు చేసుకుంది.

మంచి పిక్చ రున్నదని శంకర్ సినిమా ప్రోగ్రాం వేశాడు. పద్మ సంకోచించింది. అతను బలవంతం చేశాడు. లోపల

ఇష్టంగా నే ఉన్నా పద్మ ఎవరైనా చూస్తే ప్రమాద మని భయపడ్డది.

"పెళ్ళి చేసుకోబోయేవాళ్ళు ఎవర్ని చూసి భయపడాలి?'' అని ప్రశ్నించాడు శంకర్. పద్మ సాహసించింది.

స్నేహితురాలితో సినిమాకి వెడుతున్నానని అమ్మకి చెప్పి పద్మ థియేటర్ చేరింది. రెండు రిజర్వ్‌డ్ టికెట్లు తీసుకొని శంకర్ గేటుదగ్గిర కాచుకొని ఉన్నాడు. థియేటర్లోకి వెళ్ళి కూర్చుని పద్మ బెరుగ్గా హాలంతా కలయ చూసింది. తెలిసినవాళ్ళెవరూ కనిపించ లేదు. సినిమా చూస్తున్నంత సేపూ ఆమె ఊహల్లో శంకరే మెదుల్తూ ఉన్నాడు. శంకర్ తనని నిజంగా వివాహం చేసుకుంటాడా? అదే నిజమైతే తనంత అదృష్టవంతురాలెవరూ ఉండరు.

ఒకగంట సినిమా చూసి శంకర్ తలనొప్పిగా ఉందన్నాడు.

''ఇంటికి వెడదాం; రెస్ట్ తీసుకోండి,'' అంది పద్మ ఆత్రుతగా.

ఇద్దరూ థియేటర్ బయటికి వచ్చారు.

''నేను రిక్షాలో ఇంటికి వెడతాను,'' అందామె.

''చల్లగాలి తగిలితే తలనొప్పి తగ్గుతుంది. నడిచిపోకూడదూ?'' అన్నాడతను.

"ఎవరైనా చూస్తే?'' అందామె.

''పాపం, భయం.'' అన్నాడతను "మీ కేం!'' అంది పద్మ.

ఇద్దరూ నడవసాగారు. మేడ సమీపించగానే పద్మ వెడతానంది.

"అలా పారిపోవటానికి నేను బెబ్బులినికదూ!'' అన్నాడతను.

''ఎవరైనా చూస్తే!'' అందామె బెరుగ్గా.

"తలనొప్పిగా ఉంది. కాస్త కబుర్లు చెబుతావేమో ననుకున్నాను,'' అన్నాడు చిన్నబుచ్చుకున్నట్టు.

మరేమీ అనకుండా పద్మ మేడలోకి దారితీసింది. ఆ మేడ కిందిభాగంలో ఏదో ఆఫీసు, పైన కొంతవరకే మేడ. మిగతాదంతా వరండా.

"అలా కూర్చోండి," కుర్చీ ఆమెకి దగ్గిరగా లాగాడు శంకర్. పద్మ మాట్లాడకుండా కూర్చుంది. శంకర్ ఫ్యాన్ స్విచ్ వేసాడు. ఆమె గదంతా కలయచూడ సాగింది. స్టీల్ కుర్చీలు, టేబిల్, డవులప్ పరుపు, ట్రాన్‌సిస్టర్ రేడియో, కె. డి. కె. ఫ్యాన్ - ఇవన్నీ చూసి ఆశ్చర్యంగా పద్మ అడిగింది.

"ఏమండీ, ఇది ఫామిలీపోర్షనా?''

''ఫామిలీ ఇంకా లేందే!'' అన్నాడు శంకర్ నవ్వుతూ.

''చదువుకోటానికేనా అని!'' ఆమెకూడా నవ్వింది.

''ఏం చేస్తాం. ఇవన్నీ మానాన్న బలవంతాన ఇచ్చిపంపాడు. అలాని నేను



"నీకోసం ప్రాణమయినా విడుస్తాను సీతా!"
"మరి చిన్నసాయంత్రం ఎందుకురాలేదు?"
"జోరున వర్షం — పావమంటావా?"

---

ఖుషీ చేస్తున్నా ననుకునేరు. ఫస్ట్‌క్లాస్ రావాలండోయ్. అన్సర్ పేపర్లు చూపించేదా?" అతి నేదో వెతకబోయాడు.

"అక్కర్లేదులెండి," అంది పద్మ.

"సిగరెట్ తాగే అలవాటుకూడా నాకు లేదండోయ్. ఈమధ్య నిద్ర మేలుకోవాలని ఇప్పుడిప్పుడే అలవాటు చేసుకుంటున్నాను." యాష్‌ట్రే టీపాయ్‌మీద పెడ్తూ అన్నాడు.

"ఎందుకండీ పాడు సిగరెట్లు?"

"పరీక్షలకి చదవొద్దండీ. మీరు మానేసెయ్యమంటే మానేస్తాను, ఏం మానేయనా?"

"ఊఁ."

యాష్‌ట్రేని దూరంగా కిటికీలోంచి విసిరి పారేసాడు శంకర్. ఆమె విస్ఫారిత నేత్రాలతో అతనివైపు చూసింది. తన మాటమీద అతని కంత గౌరవం ఉందా.

"ఓపాటపాడుదురూ. తల దిమ్మెక్కిపోతోంది."

"పాటే వస్తే మా చలపతిలా నేనూ ప్లేబాక్ సింగర్‌గా ట్రై చేయకపోయేవాన్నా! ట్రాన్సిస్టర్ ఉందిగా. ఏదో స్టేషన్ పెట్టండి. చెవులతుప్పు వదిలిపోతుంది" అన్నాడు నవ్వుతూ.

"బాబోయ్. తల పేలిపోతుంది. అది మాత్రం వద్దు."

ఆమె నవ్వింది

"మరి మందు వేసుకోండి."

"డాక్టర్ పరీక్షించి మందిస్తేగదా."

"మరి డాక్టర్‌దగ్గిరికి వెళ్ళండి."

"మీ కంటే నాకు ఎక్కువ రెవరు?" ఆమె కళ్ళలోకి చూస్తూ అన్నాడు శంకర్.

"బాగుంది. నాకేం వైద్యం వచ్చా. ఏమన్నానా ?"

"ప్రథమ చికిత్స కూడా కాదుకదూ?"

పద్మ మందహాసంతో అతని నుదురు మీద చెయ్యి వేసింది. ఆ చెయ్యి హృదయానికి అదుముకున్నాడు శంకర్. మొక్కిన దేవత అందరూ వరా లిచ్చినట్టు అనుభూతి పొందింది పద్మ. తటాలున శంకర్ ఆమె నడుంచుట్టూ చెయ్యి వేసి పద్మని హృదయానికి అదుముకున్నాడు. ఆమె ఒక్క క్షణం తనని తాను మర్చిపోయినా వెంటనే సంబాళించుకుని విడిపించుకో ప్రయత్నించింది. శంకర్ ఆమె కళ్ళలోకి చూస్తూ మనం వివాహం చేసుకుంటాం పద్మా" అన్నాడు.

"మీ రెంతో మంచి వారండీ," అందామె.

"మరి పారిపోతావేం" అంటూ అతనామె పెదవుల్ని చుంబించాడు

"నన్ను ఇంక వెళ్ళనివ్వండి." ఆమె గాభరాగా విడిపించుకో సాగింది. అతను కౌగిలి విడవలేదు.

"లేడిపిల్లలా బెదరిపోతావేం ?"

"క్షమించండి - తప్పు మీరు మంచి వారుకదూ," పెనుగులాడింది.

"కాదు. నేను బెబ్బులిని."

అతనామెని విడిచి ముఖం చిట్లించుకున్నాడు. ఆమెకి ఎటూ తోచలేదు

"కోపగించుకోకండీ," పద్మ బతిమాలింది.

"కోప మెందుకూ ? నాకు బుద్ధి చెప్పావు. నేను పట్టి దుర్మార్గుణ్ణి. ఆడపిల్లల్ని నమ్మించి ద్రోహం చేసేవాణ్ణి. అంతేకదూ."

"ఛీ ఛీ. అలా అనకండి."

"అదేగా, నీ అభిప్రాయం? సరే. నా పాపాన నేను పోతాను. నేనేమైనా నీ కనవసరం - అంతేగా ప్రేమిస్తున్నావని పొరపడ్డాను. నా ప్రేమ అర్థం చేసుకున్నావనుకున్నాను మూర్ఖుణ్ణి."

అతనికి అంతకోపం రావట మెందుకో పద్మకి అర్థం కాలేదు. ఏదో విపరీత విపత్కర పరిస్థితిలో తను ఇరుక్కున్నట్లు ఆమెకి భయం కలిగింది. తను అతన్ని అపార్థం చేసుకుందా ? వివాహం చేసుకుంటానని మాట ఇచ్చాడు తనెంతో అదృష్టవంతురాలినని మురిసిపోయింది. ఇంతలో ఏమిటీ అనర్థం ? ఒకవేళ అతనికి తనమీద మోజేగాని ప్రేమ లేదేమో. ప్రేమే ఉంటే ఇలా మూర్ఖంగా ప్రవర్తిస్తాడా ? ఉచితానుచితాలు ఎరగడా ? శంకర్‌లో కొంత అమాయకత ఉంది. కావాలని అడిగింది ఇవ్వకపోతే పిల్లవాడు మారాం చేసినట్టుగా ప్రవర్తించే స్వభావం కాబోలు అతన్ని అలా వదిలేసి వెళ్ళిపోతే ఇన్నాళ్ళూ పెంచిన ప్రేమలతతోబాటు ఆశ లన్ని



టిపీ కూలదోసుకోటమే అవుతుందా, భగవాన్, ఏదిదారి ?

పద్మ అతని చేరువగా వెళ్ళి జుట్టు నిమురుతూ "నన్ను అపార్థం చేసుకోకండి. మీకంటే నాకు కావలసినవాళ్ళెవరు ?" అంది.

''లోకం ఉందిగా,'' అన్నాడతను గునుస్తూ.

అదేమి మనస్తత్వం ! ఆమెకి ఆశ్చర్యమే వేసింది. ముందు గొయ్యి. వెనక నుయ్యి. కాని ముందు గొయ్యి అనేది భయకల్పితమేనేమో ! దేవుడికెరుక ! ఏం చేసేట్టు ! ఆమె అలాగే కూర్చుండిపోయింది.

కొంచెం సేపు నిశబ్దంగా గడిచి పోయింది.

"నన్ను క్షమించు పద్మా; నీ మనసు గాయపరిచాను." శంకర్ పశ్చాత్తాపం సూచించే స్వరంతో ఆమె చుబుకాన్ని స్పృశించి అన్నాడు.

పద్మ పొడిగా నవ్వి తలూపింది. అది నిజమైన తలనొప్పేనా!

శంకర్ డ్రాయర్‌లోంచి పేక తీసి ముక్కలు పరిచాడు.

"పందెమేమిటి?"

"పందెం వేస్తే నే నాడనుబాబూ." అంది పద్మ.

"అబ్బో, కబుర్లు చెప్పకు. నాకు తెలుసులే. మీ నాన్నది పెద్దచెయ్యేటగా. అ అంశ నీకూ కాస్తోకూస్తో అబ్బకుండా ఉండదు!" అతను నవ్వాడు.

మళ్ళీ పద్మ పొడిగా నవ్వింది.

"సరే, నీ ఇష్టంవచ్చిన పందెం."

"రైట్."

ఆట అయింది. శంకర్ పందెం గెల్చుకున్నాడు. అతను గెల్చుకున్న పందెం తీసుకోటానికి పద్మ అడ్డు చెప్పలేదు.

* * *

ఫిల్మ్ ఫీల్డులో ఏడెనిమిదేళ్ళ అనుభవంగల సినీ టెక్నీషియన్ ఒకాయన ఆ ఊరికి టూర్ వచ్చాడు. అతను చలపతి పాట విని "గోల్డెన్ వాయిస్" అని పరవశించి అమాంతం చలపతిని కౌగలించుకున్నాడు. దాంతో చలపతి ఉబ్బి తబ్బిబ్బు లైపోయాడు. ఆ టెక్నీషియన్ మీద అతని కత్యంత గౌరవాభిమానాలు పెంపొందాయి. ఆయన పేరు మూర్తి. ఆయన మాటలు వింటే ఫిల్మ్ ప్రపంచంలో అతనికి తెలియని, అతను నిర్వహించని శాఖంటూ ఏమీ లేదని పసిపిల్లవాడికి కూడా తెలిసిపోతుంది. ఇంత తెలిసిం తర్వాత ఇంక ఏదో ఒక శాఖలో పాతుకుపోయి పెరసించి పోవటము ఆయనకి నచ్చలేదుట. అందువల్ల సొంతగా ఒక కంపెనీ స్థాపించి సాధ్యమైనంత వరకూ అన్ని శాఖలూ తనే నిర్వహిస్తూ ఒక అత్యుత్తమ చిత్రాన్ని వెండితెర కెక్కించాలని ఆయన ఆశయంగా పెట్టుకున్నాడట. ప్రస్తుతం అందు కోసమే మందీ మార్బలం సమకూర్చుకోటానికి ముఖ్య పట్టణాలలో టూర్ చేస్తున్నాడట. ముఖ్యంగా పెద్ద పెట్టుబడి పెట్టే ఆసామీకోసం గాలం వేస్తున్నాడట. సరే, ఇదంతా ఆయన స్వంత గొడవ. చలపతికి సంబంధించినంత వరకూ మాత్రమే మనకి కావలసింది.

"ఇటువంటి గోల్డెన్ వాయిస్ నేనెప్పుడూ వినలేదండీ. చిత్రంగా చెవుల తుప్పు వదలిపోయింది." అన్నాడు మూర్తి.

"ఏదో, మీ అభిమానం లెండి." అన్నాడు చలపతి సంతృప్తిగా.

"మీరు ఇలా ఇక్కడ రాట్ కావట

మేమిటండీ అమాంతం ఎగిరి మాద్రాసులో దూకండి."

"బి. ఏ. ఒకటి ఉందండీ. పరీక్షలు దగ్గిరికి వస్తున్నాయి. ఈ పరీక్ష అయితే ఇహ నా కదేపని." అన్నాడు చలపతి

"సరే. అదీ మంచిదే. అయినా వెంటనే మద్రాసు వెళ్ళినా ప్రయోజనం కూడా ఉండదులెండి. ఏదోఉత్సాహంలో అనేసానే గాని, అబ్బో. అక్కడ ఎన్ని లొసుగులండీ! రామ రామ, ఒట్టి సైడుకాలవండీ." అని పెదవి విరిచాడు రామ్మూర్తి.

చలపతి గుండెల్లో కొంచెం దిగులు పొడచూపింది

"అదేమిటండీ అలా అంటారు?"

"ప్చ్. మెరిట్ ఎవరిక్కావాలండీ. అక్కడంతా మహా కట్టుదిట్టం. కొత్తవాడెక్కరావాలనుకుంటే విశ్వామిత్ర తపస్సు కావాలిసిందే. నా మట్టుకు నాకు కొత్త ముఖాల్ని చూస్తానని గానీ, కొత్త గొంతులు వింటాననిగానీ నమ్మకం లేదు." మూర్తి తేల్చేశాడు.

ఇంక చలపతి మూర్తిచుట్టూ తిరగడమే పనయింది. తిరగ్గా తిరగ్గా ఆయన కరుణించాడు. ఆయన కెవరో మ్యూజిక్ డైరెక్టర్ తెలుసట. కాని తడి తగిల్తేకాని ఆయన మాట వినిపించుకోడట. ఓ నాలుగైదు వేలన్నా కావాలిట. డబ్బు చూస్తేమాత్రం తప్పక ఛాన్సు ఇప్పిస్తాడట. ఇంక పైకి రావటమనేది వ్యక్తి ఉపజ్ఞమీద, ప్రతిభమీద ఆధారపడి ఉంటుందనీ, అయితే ఆ విషయంలో చలపతి కేమీ ఢోకా లేదనీ అభయ మిచ్చాడు.

చలపతికి పెద్ద సమస్య ఎదురైంది. చటుక్కున పరిష్కారము మెరుపులా మెరిసింది. తన పేర బ్యాంకులో మూడువే లున్నాయి. అవసరానికి అవి వాడుకున్నా, తను కాస్త పేరు సంపాదించుకుని ఆర్జించటం మొదలు పెడితే అలాంటి మూళ్లు ఎన్నయినా తనకో లెక్కా. పద్మ పెళ్ళి మహా వైభవంగా సొంతఖర్చుతో జరిపించడూ!

మెరుపులా మెరిసిన పరిష్కారం మెరుపులాగే అదృశ్యమైంది. ఒకవేళ తను విఫలుడైతే! అసలు ఛాన్సే రాకపోతే! ఈమూర్తిగారు పెద్దమనిషిగానే కనిపించినా మధ్యలో ఎన్నో అవాంతరాలు! సిద్ధాన్నంకూడా దక్కని సందర్భాలు తనకి తెలుసు! ఫిల్మ్ ఫీల్డంటే తను విన్నప్రకారం ఎన్నో అగచాట్లూ, అన్యాయాలూ, మోసాలూ! నాన్న మూడువేలు ఏవని అడిగితే—?

మూర్తి తొందరచేయసాగాడు. తను వెళ్ళిపోవాలట. కనీసం మూడువేలైనా పని గడుస్తుందని హామీ ఇచ్చాడు. ఇంక చలపతికి నిద్రపట్టలేదు. తెగించి బ్యాంకులో డబ్బు తీసి మూర్తికి ఇచ్చాడు. ఎలాగైనా అవకాశం వచ్చేట్టు చూస్తాననీ. ఒక నెలరోజుల్లో

బహుశా మద్రాసుకి పిలిపిస్తా ననీ మాట ఇచ్చి మూర్తి అదృశ్యు డయాడు.

అంతే ఇంక ఆయన దగ్గర్నించి ఉత్తరంలేదు. చలపతి వారానికి ఒకటి చొప్పున ఉత్తరాలురాశాడు. కిమిన్నాస్తి. అవతలనించి కార్డుముక్కలేదు.

బహుశా ఆయన పనితొందర్లో ఉన్నాడని చలపతి మొదట్లో సరిపెట్టు కున్నాడు. లోలోపల అనుమానం వేధి స్తున్నా ఆశ వదులుకోలేదు. ఇంతలో పరీక్షలు వచ్చాయి. అదేంఖర్మమో తప్పక వస్తాయని సెలక్టుచేసి చదివినవి చాలావరకు చలపతిని వెక్కిరించాయి. ఏదో రాసాడు. దేవుడిదయుంటే ప్యాసవుతా ననుకున్నాడు.

పరీక్షలయింతర్వాత చలపతికి మరీ వ్యాకులపాటు ఎక్కువైంది. మూర్తిని గురించి ఎవర్ని వాకాబు చేసినా తెలియ దనే సమాధానమే వచ్చింది.

ఒక రోజున పోస్ట్‌మన్ చలపతిని పిలిచి ఉత్తరం ఇచ్చాడు. పోస్ట్‌మన్ పిలుపు విని మహదానంద పరవశుడై కవరు అందుకున్నాడు చలపతి. మరు క్షణంలో అతనిముఖం పాలిపోయింది. అది డెడ్ లెటల్ అఫీసునించి వచ్చింది. మూర్తి అడ్రసు తెలియ దని డి. ఎల్. ఓ. వాటు చలపతి ఉత్తరాన్ని తిప్పి పంపారు. మకాంకూడా ఎత్తేశాడన్న మాట చలపతికి కళ్ళు తిరిగిపోయాయి.

మరికొన్ని రోజులకి పోస్ట్‌మన్ అల్లంత దూరంలో కనిపించగానే చలపతివైపు ఉత్తరం ఉందన్నట్టు చూశాడు. ఒక్క ఉదుటన అతని దగ్గరికి వెళ్ళి చలపతి ఉత్తరం అందుకున్నాడు. కాని అడ్రసుచూస్తే అది పద్మ పేర ఉంది. కుంగిపోయి హీనస్వరంతో పద్మని కేకేశాడు.

పద్మ ఇంట్లోంచి ఒక్కగంతేసింది.

'ఎక్కడినించి ఉత్తరం."

"నా స్నేహితురాలి దగ్గర్నించిలే'' అని వెంటనే పద్మ కవరు దాచేసి లోపలి కెళ్ళి చూసుకుంది. ఆమె హృదయం గబగబ కొట్టుకోసాగింది. అమ్మయ్య! ఇన్నాళ్ళకి! త నెన్నో అనవసర భయా లతో మనసు పాడుచేసుకుంది. మోస పోయానని కుంగిపోయింది దేవుడు దయతలిచాడు. పాపం, అతన్నిగురించి ఎన్నెన్నో అపోహలుపడింది. నిజంగా తను ఒట్టి కృతఘ్నురాలు!

కవరు చింపి ఉత్తరం చూసుకుంది పద్మ. మొదట ఏమీ అర్థంకాలేదు. ఏమిటిది? తను రాసిన ఉత్తరమే. డి. ఎల్. ఓ. నించి. ఆ అడ్రసుగల వ్యక్తి ఎవరూ లేరనే కారణంతో తనఉత్తరం తిరిగివచ్చింది. పద్మకి కన్నీళ్ళు గిర్రున తిరిగాయి. ఆమెకి ప్రపంచమే గిర్రున తిరిగినట్టయింది.

"పద్మా! చలపతీ! భోజనాలకి లేవం డర్రా. మీరుకూడా రండి" సావిత్రమ్మ కేకేసింది




"ఇవ్వాళ మీ ప్రోగ్రాము ఇది — రెండుగంటలకు పన్నెండో నెంబరు ఎపెండిక్సు ఆపరేషన్. ఐదుగంటలకు నాలుగోనెంబరు రోగికి టాన్సిల్స్ ఆపరేషన్. రాత్రి ఎనిమిదిగంటలకు నాతో షికారు."

చలపతికి కొందరు నిజమైన స్నేహితులు లేకపోలేదు. అలాంటివాళ్ళలో రావు ముఖ్యుడు. అతను చలపతికి స్నేహితుడూ, ఆరాధకుడూ కూడా. కాస్త డబ్బుగలవాడే. అతనితో తన అవస్థ చెప్పుకొని కన్నీళ్ళు పెట్టుకున్నాడు చలపతి. ఏదో వ్యాపారం నిమిత్తం రావుకి మద్రాసు పోయే అవకాశంకూడా దొరికింది. ఆ మూర్తిని గాలించి అతనిసంగతి తేలుస్తానని రావు చలపతికి హామీ ఇచ్చాడు.

మద్రాసువెళ్ళినమిత్రుడు రాకుండానే పరీక్షాఫలితాలొచ్చాయి. చలపతి పరీక్ష పోయింది.

"వాడు తప్పటమేమిటి? ఆశ్చర్యంగా ఉందే!" అన్నాడు నారాయణరావు.

"కాలం మనమీద కసిరికొడ్తోంది — ఖర్మ." అంది సావిత్రమ్మ.

చలపతి మరీ కుంగిపోయాడు. పరీక్షాఫలితాలొచ్చిన రెండురోజులకే రావు మద్రాసునించి వచ్చాడు. వార్త తెలిసి

చలపతి అతని ఇంటికి పరుగుతీశాడు. మూర్తి అనే అసామీ ఒక డున్నాడనీ, అతనికి సినిమా అనుభవం కొంత ఉన్న మాట వాస్తవమేననీ, అయితే ఆ అనుభవం అతనికి ఇతర్లని మోసగించి డబ్బు కాజేయటానికే పనికి వస్తోందనీ అతని వాసబువల్ల తెలిసిందట. ప్రస్తుతం ఆత నెక్కడ ఉన్నదీ ఎవరికీ తెలియదట ఇది విన్న చలపతి ముఖంలో నెత్తురుచుక్క లేదు. కాళ్ళీడ్చుకొంటూ ఇంటికి చేరాడు.

బాకీలు తీర్చటానికని చెప్పి నారాయణరావు ఉన్న అర ఎకరం పొలం అమ్మేశాడు. తీరా డబ్బు చేతిలోకి వచ్చిన తరవాత అది బాకీలకి ఉపయోగించటానికి అతనికి బుద్ధి పుట్ట లేదు. అప్పుడే ఇంట్లో అడుగు పెడుతున్న చలపతిని చూసి ఆయన అన్నాడు: "ఒరే చలపతీ, మన కాతా వెచ్చం కొట్లో, బట్టల కొట్లో ఓ వెయ్యి రూపాయలు ఇవ్వాలి. బ్యాంకునించి తీసి ఇచ్చి చెల్లు వేయించుకురా."

ఇది విన్న సావిత్రమ్మకీ చలపతికీ గుండెలు గుబుక్కు మన్నాయి.

"అదేమిటండీ పిల్ల పెళ్ళికి దాచింది తీస్తా మంటారేం."

నారాయణరావు మాట్లాడలేదు. సమాధనం చెప్పలేనప్పుడు అతను మాట్లాడడు. త నేమన్నా అప్పుడు ప్రయోజనం ఉండదని సావిత్రమ్మకీ తెలుసు, అందుకని ఆమె మాట మార్చింది.

"పద్మ వారం రోజుల్నించీ ఏమిటో నలతగా ఉంటోందండీ. కాస్త డాక్టరుకి చూపిద్దురూ."

నారాయణరావు తలెత్తి పద్మవైపు ఓసారి చూసి, "ఆ పని కాస్తా నువ్వే చేద్దూ" అన్నాడు.

"బాగుందండీ మీ తీరు." అంది సావిత్రమ్మ, భోజనాలకి ఏర్పాట్లు చేస్తూ.

అరుణోదయ మైంది.

సావిత్రమ్మ నిద్ర లేచి పక్క చుట్టి మంచం గోడకి జేరవేసింది. కిటికీ తలుపులు వేయబోయి అలవాటుగా ఆ ముగ్గురి మంచాలవైపూ ఓసారి చూసింది. ఏం దుర్ముహూర్తమో, ఆమె నివ్వెఱ్ఱారాలై, నిలువునా వొణికింది. ఆ మంచాలు మూడూ ఖాళీగా ఉన్నాయి

"చలపతీ, పద్మా!" ఆమె కేకలు వేసింది.

సమాధానం లేదు

దిగాలుగా సావిత్రమ్మ మంచంమీద కూలబడిపోయింది.

అరఎకరం పొలం అమ్మి, ఆ డబ్బంతా జేబులో వేసుకుని నిన్న మధ్యాహ్నం క్లబ్బుకి వెళ్ళిన ఇంటియజమాని రాత్రి భోజనానికికూడా రాకపోగా, ఇంతవరకూ ఇంటికే చేరలేదు.

బ్యాంకుకి వెళ్ళివస్తా నని బయల్దేరిన చలపతి రాత్రి భోజనానికి రాకపోతే



ఎక్కడో తిని ఏ సినిమాకో వెళ్ళాడనుకుంది. ఇంకా ఇంటికి రాకుండా చలపతి ఏమయ్యాడు?

డాక్టరుదగ్గిరికి రమ్మంటే తన కేమీ జబ్బులేదని రాకుండా మొరాయించిన పద్మ తెల్లారగట్ల లేచి ఎక్కడికి వెళ్ళినట్టు?

సావిత్రమ్మ కేమీ పాలుపోలేదు. హఠాత్తుగా ఆమె కేమో అనుమానాలు కలిగాయి.

ఆదొక ద్యూతగృహం! ప్రపంచమే ఒక పెద్ద ద్యూతగృహం! అందులో నిత్యం ఎవరో ఏదో పణం ఒడ్డుతూనే ఉంటారు. పద్మ, చలపతీ...

ఇక ఆలోచించలేక సావిత్రమ్మ శూన్యంగా కిటికీలోంచి బయటికిచూసింది.

సూర్యభగవానుడామె కళ్ళలోకి సానుభూతిగా చూశాడు. అప్రయత్నంగా ఆమె లేచి నుంచుంది. రోజూ తను కిటికీ తలుపులు మూసేది!

గిర్రున కన్నీళ్ళు తిరగగా, సావిత్రమ్మ తటాలున కర్మసాక్షికి చేతులెత్తి మ్రొక్కి కటాక్షించమని దీనంగా వేడుకొంది.




'భగవాన్! ఎందుకు నన్ను డాక్టరుగా చేశావు–' అనుకున్నాడు కృష్ణమూర్తి మరొక్కసారి ఎడమ చేతితో నుదుటిని రుద్దుకున్నాడు. కళ్ళు మూసుకున్నాడు.

'డాక్టరైతే అయ్యాను... శిశు వైద్యంలో నిపుణుడినెందుకవాలి? అరవిచ్చుకుంటున్న పువ్వులు విలవిలలాడుతూ రాలిపోతుంటే– పసిపిల్లలు. డాక్టర్లను చూడకుండా వుండాలని కాబోలు, తమ కళ్ళను శాశ్వతంగా మూసేసుకుంటుంటే – ఎందుకు తన డాక్టరువేషం, ఏమవును? తన చదువూ, తన విజ్ఞానం, తన అనుభవం అంతా ఇసుకగూళ్లలా కూలిపోతుంటే – ఏందుకొచ్చిన వైద్యం, అనిపిస్తుంది.

'నేను మనిషిని – చిన్నవాడిని – అణుమాత్రుడిని– నా అల్పత్వాన్ని నీ విశ్వరూపంతో బెదరగొట్టనేల ప్రభూ –'

*  *  *

---

వాకాటి పాండురంగరావ్

సాయంకాలం ముగియ వచ్చింది. నర్సు కమల లైట్లు వేయనారంభించింది.

కళ్ళు తెరిచాడు డాక్టర్ కృష్ణమూర్తి. తెల్లటి దుస్తులలోవున్న కమల ఈ లోకపు మనిషి కానట్లు కన్పించింది. డాక్టర్ తనను గమనిస్తున్నట్లు తెలియగా ఇటు చూసి నవ్వింది.

'ఏమిటి ఈమె సంతృప్తి? రోగాల మధ్య, చిక్కిపోయిన శరీరాలమధ్య—చావులమధ్య. సగం చచ్చిన మనుష్యుల మధ్య ఎక్కడిది ఈమె సంతోషం?

డాక్టర్! ఏమిటీ ధోరణి— అని ఎవరో వీపు తట్టినట్లయింది. ఉలిక్కి పడ్డాడు కృష్ణమూర్తి. తలను విదిలించాడు. ఏవో సాలెగూళ్ళు విడివడినట్లయింది. ఛీ ఛీ! ఎంత పెడదారిన పడింది తన ఆలోచన!

తన వృత్తిలో ఎంత ఔన్నత్యం వుంది? ఎంత శాంతి వుంది?... ఆశను, ఆరోగ్యాన్ని, దైవ మనుకూలిస్తే ఆయుస్సునూ పంచిపెట్టగల అదృష్టం ఎవరిది. ఒక్క డాక్టర్లదే కదా!

పోయిన్నెల ఒక అయిదేళ్ళ అమ్మాయిని తీసుకొచ్చా రెవరో. ఆ అమ్మాయికి విపరీతమైన జ్వరం. తలనొప్పి కూడా కాబోలు పాపం తలను కొట్టుకుంటూంది తన చిన్నారి చేతులతో.

తను ఒక ఇంజక్షన్ ఇచ్చాడు. ఆ నొప్పికి కెవ్వుమంది పాప ఆ కళ్ళల్లో— దేవుడిభాష మాట్లాడే ఆ కళ్ళల్లో నీరు నిలిచింది. బాధతో పాప చూచిన చూపు ముందు తనొక దోషిగా నిలిచాడు... 'నీకు నొప్పికలిగించింది, నొప్పి కోసం కాదు... నన్ను అర్థం చేసుకోవూ—' అన్నట్లుగానవ్వాడు. కాని పాప నవ్వలేదు.

మూడవరోజు మళ్ళీ వచ్చింది పాప. నీరసంగా వుంది. కాని జ్వరం తగ్గిపోయింది. రెండు రాత్రుళ్ళూ బాగా నిద్రపోయిందిట.

"డాక్టర్‌గారూ! మరేమో... మా అమ్మాయికట, మంచి తియ్యటిమందు ఇవ్వండి—" అంది వాళ్ళమ్మ.

"అవునా ... నీకు తియ్యటిమందు కావాలా— అట్లాగే" అని తానొక సిరప్ ఇచ్చాడు. దానితోబాటు— ఒక రంగు రంగుల బొమ్మ వున్న పెద్ద బ్లాటింగ్ కాగితం ఇచ్చాడు. సందేహపడుతూ, సిగ్గుపడుతూ తీసుకుంది పాప. తీసుకుంటూ తన్ను చూచి నవ్వింది. అవును, పాప తన్ను చూచి నవ్వింది. దేవుడే వచ్చి తనవీపు తట్టినట్లయింది...

ఆ పాపపేరు యశస్విని!... ఆ యశస్వినీ తనూ ఇప్పుడు స్నేహితులు!!

ఈ భాగ్యమంతా ఎవరిది? తనది, ఒక డాక్టర్‌ది! కాని, కాని తను ఇందాకటి నుండి చీకటిలో పడిపోయాడు వెలుతురు విషయమే మరిచిపోయాడు.

అవునుమరి, ఆరోనెంబర్ గదిలో, ఆ పాపని చూస్తుంటే ఎవరికయినా సరే వెలుతురు ఎట్లా గుర్తుకొస్తుంది?

ఆ అబ్బాయిని చూస్తే గుండె కలియ

బెడుతుంది. ఆ చిన్న దేహంలో ఇంకా ప్రాణం వుంది. కాని అది పెనుగాలిలో విలవిలలాడే చిన్న దీపంలా— కొట్టుకు లాడుతూంది నొప్పితో కళ్ళు సగం తెరిచి — రాత్రిపూట అడవిలో ఏదో జంతువు అరిచినట్లు— వాడు. ఆ పసి వాడు మాట్లాడుతుంటే — వాడి తలిదండ్రుల ప్రాణాలు ఎగిరిపోయేవి. క్షణ క్షణమూ, నరనరమూ వాడి యాతన నంతా వాళ్ళిద్దరూ అనుభవించేవాళ్ళు. అది తనకు తెలుసు.

కాని తను ఏమీ చెయ్యలేడు! ఏడాది నిండని ఆ చిన్ని కుర్రవాడి జబ్బేమిటో తెలియదు తనకు. ఎక్కడా ఎప్పుడూ చద వని వినని జబ్బు అది. రెండు నెలల ప్రాయంనుండి విపరీతమైన కడుపునొప్పి గింజుకునేవాడు ఈ బిడ్డ. ఆ తర్వాత తాగినదంతా కక్కుకోవడం ఆరంభిం చాడు. కొన్ని రోజులకు డోకులో రక్తం పడసాగింది! నాలుగైదువారాల తర్వాత ఈ దశలో— వారంక్రింద తెచ్చారు తమ హాస్పిటల్‌కు

ప్రేగులలో ఎక్కడో ఏదో తప్పి పోయింది కాబోలు; పుట్టుకతోనే కడు పులో ఏదో సరిగా అతకలేదో, అతికి వుండవలసినది వీడి పోయిందో — అలాటి దేదో చిన్నపొరబాటు జరిగింది. కాని అది చాలు ఆ పసివాడి ప్రాణానికి! వాడి ప్రాణాన్ని కాపాడాలంటే ఆపరేషన్ చేసితీరాలి. కాని ప్రస్తుతపు స్థితిలో తల పెట్టడమే అసంభవం. వాడి ఒళ్ళు ఆప రేషన్‌కు తట్టుకోనేలేదు. అంచేత రక్తం ఎక్కించడం, గ్లూకోజు సిళ్ళెక్కించడం, అతడి శరీరంలోని ద్రవాలు ఇగిరిపో కుండా చూడడం — ఇంతకన్న ఏమీ చెయ్యలేదు తను ఒకవేళ ఇందువలన అబ్బాయి దేహానికి కొంత బలం వస్తే— ఆపరేషన్ తల పెట్టవచ్చును

కాని వాదమయింది నాళ్ళు వచ్చి. ఆ పిల్లవాడి ఒంటికి బలం రావడంలేదు కదా, నానాటికీ పరిసితి దిగజారి పోతు న్నది. మరీ నిన్నటినుండిగూడా వాడి మూలుగుకూడా సన్నగిల్లి పోతూంది. కళ్ళు ఎక్కువసార్లు తెరవడంలేదు.

'హుం!' అనుకుని లేచాడు కృష్ణ మూర్తి

నెమ్మదిగా ఆరోనెంబర్ గదివైపు నడి చాడు.

ఆ గది గుమ్మంలో నిలిచాడు. ఆమె, ఆ పాపాయి తల్లి లేచి నిల్చుని— తనను చూచింది. ఆమె కళ్ళల్లోని ఆశ, భిక్ష— చూస్తే— అబ్బ! తను భగవంతుడిని కాకపోయానే అన్పించిందికృష్ణమూర్తికి. ఆమెవైపు చూడలేక, ఆ పసివాడివైపు చూచాడు

నర్స్ కమల, ఆ అబ్బాయి పక్క మీదకు కక్కుకున్న నెత్తురుని ఎంతో నేర్పుగా తుడుస్తూంది

పైన గాజుకూజాలో రక్తం ఇంకా పైన గది కప్పునుండి వేలాడుతున్న

దీపం. దీపానికి దిగువనున్న గాజుకూజా నీడ ఆ అబ్బాయి మొహంమీద పడు తూంది. వాడు నెమ్మదిగా శ్వాస పీలు స్తున్నాడు. కళ్ళు మూతపడివున్నాయి. ఎర్రటి పెదవులు దీపపు నీడలో వికార మైన ముదురురంగులో కనిపించాయి.

"బి పి నార్మల్‌గానే వుంది డాక్టర్!" అంది కమల ఉత్సాహంగా.

తల వూపాడు డాక్టర్. అయినా లాభంలేదు — అనుకుంటూ వెనక్కి తిరి గిన కృష్ణమూర్తికి ఆ అబ్బాయి తండ్రి— గదిలో ఒక మూలగా నిలబడి వుండడం కనబడింది

'...దీని అంతటికీ మీరే కారణం. మొదటే, ఇంకో నెలముందే ఎందుకు తీసుకురాలేదు ఈ పాపాయిని' రోజు కో డాక్టరూ, పూట కొక మందుచొప్పున మార్చిమార్చి, చివరికి ప్రాణం మీద ప్రయోగాలు చేయడానికి ఓపిక లేక పోయిన తర్వాత ఆఖరిక్షణాల్లో తీసు కొచ్చి మా ముందు పడేశారు. సమ యంలో వచ్చివుంటే ఈ అబ్బాయి బ్రతికివుండేవాడు; బహుశ బ్రతికేవాడు. కానీ ఇప్పుడు—' అందామని అను కున్నాడు కృష్ణమూర్తి. కాని ఏమీ అన లేదు. ఆ పసివాడి తండ్రి నొక్కసారి చూసి గదిబయటకు నడిచాడు.

'ఏమిటి డాక్టర్! ఏమిటి మీ చూపుకు అర్థం? ఇంతకుముందొక బిడ్డను ధార పోసిన ఈ ఆస్పత్రికే ఇంకో బిడ్డను తీసుకొచ్చానే — అది — అపరాధమా — ఇక్కడికే ఎందుకు తెచ్చాను? ఇం కెక్కడా ఆశలేక—ఆశకు సిగ్గులేక—ఆశకు చావులేక! . అక్కడా ఇక్కడా తిరగక తిన్నగా రాలేకపోయావా అనవచ్చు ... సరిగా రెండు నెలలక్రింద — ఇదే ఆసు పత్రిలో మా కవలపిల్లలలో మొదటివా డయిన భాస్కరాన్ని — అదిగో ఆ ఎని మిదో నెంబర్ గదిలో పోగొట్టుకున్నానే— అప్పుడు ఇంకెక్కడికీ వెళ్ళక మీరంతా దేవుళ్ళని తిన్నగా ఇక్కడికే ఎంతో నమ్మకంతో వచ్చానే—అప్పు డేమయింది డాక్టర్? నా నమ్మకం ఏమ్మయింది. కనీసం దివాకరాన్నయినా రక్షించుకోవా లన్న ఆపత్రయంతో స్పెషలిస్ట్ అన్న వారికెల్లా చూపించాము; అడిగినదెల్లా ఫీజుకింద ఇచ్చాము క్రమక్రమంగా వీడూ భాస్కరంలాగే అయిపోతూంటే మనసు ఎడారి అయి, ఇక్కడికి వచ్చాము డాక్టర్ — ఇక్కడికి వచ్చాము. అది తప్పా? అదీగాక, అదీగాక...' అని ఏదేదో గట్టిగా అడగాలనుకున్నాడు ఆ అబ్బాయి తండ్రి. కాని నోరు విప్పలేదు. అతడి కళ్ళల్లో నీరు నిలిచింది

అది చూసి ఆమె ఏడుపు నాపుకో లేకపోయింది.

"ఎందుకమ్మా అధైర్యపడతారు." అన్నది కమల.

నా మనసులో రగులుతున్న చిచ్చు—

ఎవరి కేంతెలుసు - అంటున్నట్లున్నాయి ఆతల్లి వెక్కిళ్ళు.

ఆరోనెంబర్ గది విడిచి వార్డు ప్రక్కగా వచ్చాడు డాక్టర్ కృష్ణమూర్తి. ఎవరో పిలిచారు. చూస్తే ఇరవై రెండో నెంబరు పడకమీద కవిగారు. తనకు రాత్రంతా నిద్ర రాలేదట; ఏదయినా నిద్రమాత్ర కావాలన్నాడు. అట్లాగేనని తనగది చేరాడు కృష్ణమూర్తి.

వైద్యవిషయ పత్రిక నొకదానిని తిరగవేయసాగాడు కాని మనసంతా ఆరోనెంబర్ గదిలోని అబ్బాయిచుట్టూ తిరగసాగింది

కవలపిల్లలలో రెండవవాడు ఈ అబ్బాయి. మొదటి అబ్బాయిని రెండు నెలలక్రింద ఇట్లాగే తెచ్చారు. ఆ జబ్బు ఏమిటో అర్థంకాలేదు. ఇవే లక్షణాలతో ఎనిమిదిరోజులు బాధపడి చనిపోయాడు.

అపుడు గనక శవపరీక్ష చేసివుంటే పెద్దసమస్య విడివుండేది చీకటితెరలు తొలగిపోయేవి. ఈ అర్థంకాని జబ్బే మిటో తెలిసిపోయేది. ఆ జబ్బురూపం తెలిస్తే దానితో పోరాడడం సులభ మయ్యేది. కాని వాళ్ళే — ఈ తల్లిదం డ్రులే ఒప్పుకోలేదు తాను వీళ్ళకు అన్నీ వివరించాడు; అర్థంచేసుకోమని ప్రార్థిం చాడు; ప్రాదేయ పడ్డాడు కాని తమ అబ్బాయి దేహాన్ని ఇవ్వడానికి ససేమిరా ఒప్పుకోలేదు ఆతల్లిదండ్రులు. పైపెచ్చు తనమీద కోపంతో, మా ముద్దులపట్టి శరీరాన్ని ముక్కలు చేయడాని కిమ్మం టున్నావే — నువ్వెంత క్రూరుడివి అన్న జుగుప్సతో వెళ్ళిపోయారు, ఆ అబ్బాయి దేహంతో.

అదంతా ఈ క్షణాన జరిగిన ట్లుంది— అనుకున్నాడు డాక్టర్ కృష్ణమూర్తి.

గడియారం తొమ్మిది కొట్టింది

అపుడే గనుక ఆ పెద్దబ్బాయి దేహాన్ని పరీక్షించివుంటే ఈనాడు ఈ పసివాడు — బహుశ బ్రతికేవాడు!—

చప్పుడయింది ఎల్లయ్య భోజనం కేరియర్ తెచ్చిపెట్టాడు స్టీల్ కేరియర్ మీద నీలం దీపపు కాంతి పొడుగాటి గీతలా ఒకవైపు మాత్రమే పడుతూంది.

"మరచిపోకుండా భోంచేయమన్నారు అమ్మగారు—" అన్నాడు ఎల్లయ్య.

నవ్వుకున్నాడు కృష్ణమూర్తి. ఎపుడో రెండుమూడుసార్లు పెద్ద ఆపరేషన్లలో పడి రాత్రిళ్లు భోజనం చేయలేక పోయాడు. అందుకని శారదకు సదా అనుమానం! ప్రతిసారీ — ఈ హెచ్చ రికతో కేరియర్ పంపిస్తుంది.

"అట్లాగేలే— నువ్వెళ్ళు—" అన్నాడు కృష్ణమూర్తి.

"మంచిదండీ... మరేమో, అమ్మ గారు, మీరు భోజనం చేసిందాకా వుండి కేరియర్ తెమన్నారండి—"

పెద్దగా నవ్వేసి— "ఎల్లయ్యా! నే నిప్పుడే అన్నం తినలేను. నువ్వింటికి పో" అన్నాడు కృష్ణమూర్తి.

ఎల్లయ్య వెళ్ళిన రెండు నిమిషాలకు కమల వచ్చింది.

"ఊఁ...బంగాళదుంపల వేపుడు ఘుమాయిస్తూంది...బలే బాగుండేట్లుంది మీ శ్రీమతి చేతి పాకం!"

"కేరియర్ మూత తీయనిదే నీకు వాస నెట్లా వచ్చిందీ?"

"ఎక్స్-రే ముక్కండీ డాక్టరు గారూ," అని నవ్వింది కమల.

"ఎవరయినా అందమైన చిన్నవాడి మనసుని ఎక్స్-రే తీయవమ్మా—" అన్నాడు కృష్ణమూర్తి.

నర్స్‌లోపల దాక్కునివున్న ఆడది సిగ్గుపడింది. ఆ చిరునవ్వుకూ, ఆమె యూనిఫారానికీ స్నేహం కుదరలేదు.

"ఊఁ ... అన్నట్లు... ఆరోనెంబర్ గదిలో అబ్బాయి ఎట్లా వున్నాడు?"

పెదవి విరిచింది కమల.

"ఓహో!"అని చేతికి గడ్డాన్నిఆనించి కళ్ళు మూసుకున్నాడు కృష్ణమూర్తి.

"ముందులేచి, భోజనం ముగించండి. ఆ తర్వాత తీరిక వుంటుందో వుండదో."

మళ్ళీ 'ఆడది!' అనుకున్నాడుఅతడు, బ్యాండేజీ, గ్లూకోజు సీసా తీసుకెళ్తున్న ఆమెను చూసి.

ఇంతలో ఫోన్ అరిచింది. అందుకున్నాడు

"కృష్ణమూర్తీ! నేను సారధిని మాట్లాడుతున్నాను—నిన్న మీకు చెప్పానే, ఆ 'బ్రెయిన్' కేసు ఆపరేషన్ ఇంకో అరగంటలో మొదలెడుతున్నాము. వస్తారా?"

నిముషం తర్వాత ఫోన్‌ని క్రింద పెట్టాడు కృష్ణమూర్తి.

కేరియర్ని విప్పాడు. అయిదు గిన్నెలనిండా ఏమేమిటో వున్నాయి - రెండుపూటలా శాస్త్రోక్తంగా పప్పు, పులుసు, కూర, పచ్చడి - తనే ఓపికగా చేస్తుంది. వద్దని చెబితే వినదు పైపెచ్చు 'బ్యాలెన్స్‌డ్ డయట్' వగైరా అంటూ తనకే అప్పచెబుతుంది, కొంటె పిల్ల అవును మరి, పెళ్ళయి ఎనిమిదేళ్ళయినా శారద ఇంకా తల్లి కాలేదు. అంచేత ఇంట్లో అల్లరి అంతా ఆమెదే- అనుకుంటూ బంగాళాదుంప వేపుడుముక్క ఒక్కటి నోట్లో వేసుకున్నాడు; పెరుగు తాగాడు. మళ్ళీ గిన్నెలన్నీ సర్దేసి చేతులూ మొహమూ కడుక్కొని మెట్లు దిగసాగాడు కృష్ణమూర్తి.

ఆతడు మళ్ళా మేడమెట్లు ఎక్కుతుండగా క్రింది వరండాలో గడియారం రెండు కొట్టింది. అబ్బా! అనుకున్నాడు. రిస్టువాచి చూచుకున్నాడు. మొదటి అంతస్తుమీది తన గదిలోకి వచ్చాడు. కుర్చీలోకి కూలబడి టేబిల్‌మీదికి కాళ్ళు జాచాడు టేబిల్‌మీద తా నుంచిన కేరియర్ టేబిల్‌క్రింద వుంది! కమలపని కాబోలు......

అమ్మయ్య! ఆ మెదడు ఆపరేషన్ సరిగానే జరిగింది. ఆవిడకు పాతికే

ళ్ళుంటాయేమో! మాటి మాటికీ 'ఫిట్సు' రోజుకు ముప్పైసార్లు నలభైసార్లు వస్తాయిట! అందుకు కారణమైన చెడిన మెదడుభాగాన్ని తీసివేయడానికి సాహసించాడు సారధి. ఆపరేషన్ ఫలితంగా ఫిట్స్ ఆగుతాయేమో కాని, ఎక్కడ ఆమెకు చూపు పోతుందో, లేక ఏ పక్షవాతం వస్తుందో— అని తాను భయపడ్డాడు. కాని దైవకృపవలన అట్లాంటిదేమీ జరగలేదు. ఆమెకు బహుశ 'ఫిట్స్' ఇక రానేరావు। ఆమె నిండుఆరోగ్యంతో హాయిగా బ్రతికుతుంది. ఎంత అద్భుతమైన మార్పు!! ఇదంతా కేవలం ఆ ఆపరేషన్ ఫలితం.

డాక్టరుది-చావుబ్రతుకులమధ్య ఆదొక లోకం. మనిషికీ దేవుడికీ మధ్య అదొక ఎత్తు. అక్కడినుండి దిగివచ్చాడు తను.

అన్నట్లు!— హఠాత్తుగా ఏదో గుర్తుకొచ్చింది: గభుక్కున లేచాడు కృష్ణమూర్తి ఆ క్షణాన్నే పరుగెత్తుకుంటూ వచ్చింది కమల.

"డాక్టర్! ఆ అబ్బాయి మరణించాడు. అయిదారు నిముషా లయింది—"

ఇంక తనెళ్ళి చూసేదేమీ లేదు. వెనక్కెళ్ళి కుర్చీలో కూలబడ్డాడు కృష్ణమూర్తి.

హుఁ! ఆపరేషన్ తర్వాత ఇందాకటి ఆ భావం ఎగిరిపోయింది— అదొక ఎత్తుట, అదొక లోకంట. ఎంతటి అహంభావం... ఇప్పు డేమైంది?!

"మీరు ఆపరేషన్ థియేటర్‌లో వున్నారని డాక్టర్ శ్రీధర్‌ని పిలిచాను. గంటసేపునుండీ ఆయన ఆ అబ్బాయి పక్కనేవున్నారు. ఇప్పుడే వెళ్తున్నారు."

"ఆయనకి నాథాంక్స్ చెప్పు కమలా."

కమల మెల్లవెపు పరుగెత్తింది.

రెండు చేతుల్నీ మెడవెనుక వుంచుకుని తల పైకెత్తి దీపాన్ని చూశాడు డాక్టర్ కృష్ణమూర్తి. పురుగులు రెండో మూడో ఎగురుతున్నాయి; దీపాన్ని తాకేంత దగ్గరగా వస్తున్నాయి. మరుక్షణం దూరంగా వెనక్కు పోతున్నాయి.

చూడగా చూడగా ఆ దీపం రెండు దీపాలైంది. ఆ రెండు దీపాలు కళ్లగా— ఆ కళ్ళు తన బిడ్డకు ప్రాణం పోయమంటున్న తల్లిగా కనుపించింది.

ఎట్టకేలకు దీపాన్ని తాకిన ఒక పురుగు చచ్చి కృష్ణమూర్తి మెడమీద పడింది. ఉలిక్కిపడ్డాడు అతడు

ఎప్పు డొచ్చాడో మరి-తన రెండవ బిడ్డను కొన్ని నిముషాలక్రింతం పోగొట్టుకున్న ఆ తండ్రి - టేబిల్ ప్రక్కగా నిల్చుని వున్నాడు. పెదవులు కదిలాయి.

"డాక్టర్! మా అబ్బాయి దేహాన్ని శవపరీక్షకు తీసుకోండి!"

కృష్ణమూర్తి చెవులు సమ్మనన్నై. ఏదో అందామంటే గొంతు పెగల్లేదు.

ఆ తండ్రి మొహం నిశ్చలంగా - తపస్సునుండి లేచివచ్చినవాడిలా వుంది.

"రెండు నెలలక్రింద మా మొదటిబిడ్డ దేహాన్ని పరిశోధనకిచ్చి మీకప్పగించి వుంటే మా రెండో అబ్బాయి బ్రతికేవాడేమో - కాని మా రాత అడ్డువచ్చింది—"



కృష్ణమూర్తిలో. తుఫాను రేగింది మొత్తంమీద అతడు చెప్పగలిగాడు

"ఇప్పుడు ఈ అబ్బాయి దేహాన్ని పరీక్షించినా వచ్చేలాభ మేమీ లేదు—"

"తెలుసు డాక్టర్. నాకా విషయం. కాని, వాడి దేహాన్ని పరీక్షించి ఏం రేమయిందో తెలుసుకుంటే ఆ జ్ఞానం ఇంకెక్కడో, ఎప్పుడో, ఎవరి బిడ్డనో రక్షించవచ్చును. అపుడు – మా రెండవ బిడ్డను చంపుకున్న మా పాపం కాస్తా తీరుతుంది!" అన్నాడు ఆతండ్రి. ఆ గదిలో వెయ్యిదీపాలు వెలిగినట్లయింది.

అవన్నీ ఆ తండ్రి కళ్లల్లోనివే – అనుకున్నాడు కృష్ణమూర్తి అతడి చేతుల్ని తన చేతుల్లోకి తీసుకున్నాడు.

"భగవాన్! నీ చేతి సాధనంగా ఎన్నుకున్నావు. దారి చూపే బాధ్యత కూడా నీదే?" అనుకున్నాడు డాక్టర్ కృష్ణమూర్తి.

# కల్యాణమందిర్

కోడూరి కౌసల్యాదేవి

జరిగినకథ

ప్రకాష్ ఉంచిన బందిఖానానుంచి తప్పించుకుని కల్యాణి బయటపడి, అనేక కష్టాలకు లోనై తన స్వగ్రామం చేరుకుంది. కాళ్ళు పీక్కుపోతూ, కడుపు దహించివేస్తూ ఎరిగున్నవాళ్ళ ఆదరణకోసం తిరిగి, నిరాదరణకు బలైంది. చివరకు తన పాతయింటిదగ్గర నిలబడి మైత్రేయిగృహం చూచింది — మనసులో మైత్రేయిని శాపాలకు గురి చేసింది. చివరకు పడవల రేవుకు చేరుకుంది. — ఇక చదవండి

"శ్రీరామనవమికి భద్రాచలంలో స్వాములవారి కళ్యాణం; అక్కడికి." ఒకతడు చెప్పాడు.

"చూడయ్యా, నాదగ్గ రేమీ డబ్బులేదు. స్వామివారి కళ్యాణం చూడాలనీ, భద్రాచలం చూద్దామనీ ఎంతో కోర్కెగావుండి, దూరంనుండి వచ్చాను. కాని దార్లో నాపెట్టె పోయింది. డబ్బంతా దానిలోనే వుండిపోయింది. ఇదుగో చార్జీలకు ఈగాజు తీసుకొని, నన్ను పడవెక్కనీ." చేతి బంగారుగాజు తీసి అతడి కిచ్చింది.

ఆవ్యక్తి వింతగా చూచాడు కళ్యాణిని మనుష్యుల స్థితిగతులనూ, అంతరంగాలనూ చూపులతోనే కొలిచి అంచనా వేయగలదిట్ట అతగాడు; క్షణంలో కళ్యాణి జీవితాన్ని చదివేశాడు. తనలో తాను ఏమేమో ఆలోచించుని తల పంకించాడు.

"ఊఁహూ నగ పనికిరాదమ్మా. అయినా అదేటో ఎలా తెలుస్తది? బంగారమే అని భరోసా ఏంటి?"

కళ్యాణికి అతడియుక్తి అర్థంకాలేదు దీనంగా అన్నది: "ఏం చేయనుమరి? పోనీ యిది వజ్రాలనెక్లెన్. ఇదైనా తీసికొని నన్ను రానీ." మెడలో దేదీప్యమానంగా మెరుస్తూన్న రవ్వల నెక్లెస్ తీసి అనాలోచింతగా అతడి చేతిలో వుంచింది అతడి ముఖం సంతృప్తితో వికసించింది

"నడమంత్రపుసిరిలాగా వుంది. నగలువిలువ అసలు తెలియదు." అతడి నేస్తగాడు మెల్లగా గొణిగాడు.

"నోర్మూయ్‌రా!" అతడిని మందలిస్తూ ఆవ్యక్తి వెళ్ళి ఎవరితోనో మాట్లాడి వచ్చాడు. "వెళ్ళి పడవ ఎక్కండమ్మా. దారిపొడుగునా ఏం కావలసివచ్చినా నేనే చూస్తాను." అంటూ స్త్రీలు కూర్చున్నచోట పడవలో కళ్యాణినికూడా కూర్చుండ జేశాడు.

ఆమాట వినడంతోనే కొండంత ఆశ కలిగింది కళ్యాణికి. "చాలా అలసిపోయి వన్నాను. ఆకలిగా వుంది. ఇక్కడ తినడానికేమైనా దొరుకుతాయా?" అనడిగింది.

"ఓ! ఏమైనా ఏటండమ్మా? భోజనమే తెస్తాను. చెప్పండి, ఏంకావాలో? మీరు బ్రాహ్మలా?"

"ఎవరైతే ఏంకాని. శాకాహారమే కావాలి."

విపరీత శారీరక మానసిక వేదనల ననుభవించి అలసి సొలసిన శరీరం భోజనం చేయగానే నిద్ర కుపక్రమించింది, సర్వం మఱచి.



# 13

కళ్యాణిని కాదని ప్రకాష్ నౌఖర్లందరిమీదా మండిపడి కొట్టినంతపని చేశాడు. రహస్యం బయటకు పొక్కరాదని ఆజ్ఞాపించాడు ఎలాగైనాసరే ఆమెను వెదకి తెచ్చినవారికి – లేదా, ఆచూకీ తెల్పినవారికి ఏమైనా ధనం ముట్టజెప్పుతా నని కూడా అన్నాడు.

'కళ్యాణీ! ఎంతపని చేశావ్! నన్నర్థం చేసుకోలేక చేజేతులా అనర్థం కొని తెచ్చుకన్నావ్. నీ దెప్పుడూ తొందర స్వభావమే!' తనలో తాను వాపోయాడు. ఏం చేయాలో తెలియక ఆలోచిస్తూన్న సమయంలో మామగారి పద్దనుండి జాబు వచ్చింది.

"చిరంజీవులు అల్లుళ్ళు ప్రకాష్‌ని దీవించి

చి॥ సౌ॥ మైత్రేయిని యిటువంటి దుఃఖసాగరంలో వదిలేసి వెళ్ళిపోవడం నా కేమీ బాగుండలేదు. వ్యాపారం విషయా ఉంటే తర్వాత చూచుకోవచ్చు. వెంటనే రావలసిందిగా కోరుతున్నాను ఆమెను ఒదార్చడం ఎవరికీ సాధ్యం కాకపోయినా, మీ రుంటే కొంతలో కొంత సాంత్వన. అంతే. మీ రాకకు ఎదురు చూస్తూ,

ఆశీస్సులతో,
శేషాచలం.

'అల్లుడు గ్రంధసాంగుడని ఆయనకు తెలియదు పాపం!' నిర్లిప్తంగా నవ్వుకున్నాడు ప్రకాష్.

ఆలోచించాడు, వెళ్ళనా? వెళ్ళిమాత్రం ఏంలాభం? మైత్రేయి శోకవదనం చూడ లేను. మైత్రేయివంటి ఉన్నత హృదయకి సంభవించవలసిన ఆత్మగ్లాని కాదిది. ప్రేమమూర్తి మైత్రేయి! ఆమె ప్రేమసుధను వర్షించడానికి పసిపాపలు లేక ఆ ప్రేమ హృదయం ఎండిపోతుంది. బహుముఖియై సాగిపోవలసిన ఆ ప్రేమస్రవంతి ఈ బలమైన అడ్డుకట్టకు ఆగుతుందా? నిస్పహాయతతో క్రుళ్ళిపోయి, ఉండి ఉండి ఊళ్ళనూ ఏళ్ళనూ ఏకం చేసే ఉప్పెన ఉధృతంగా ఏ అఘాయిత్యమూ తలపెట్టదుకదా! పలుముఖాల పల్లవించి వృద్ధి జెందవలసిన ప్రేమవృక్షం మోడువారిపోదుకదా! ఏలా చూడను మైత్రేయి ముఖం? ఏమని ఓదార్చగల నామెను నేను? నిక్కంగా యిది నా పాపమే. నా భార్య అయినందుకు ఈ పాపం ఆమెకు చుట్టుకొన్నది!

'అయినా నేను అక్కడకు వెళ్తే యిక యిక్కడ కళ్యాణి అజ కనుక్కొనేవా రెవరు? పాపం, అమాయకురాలు కళ్యాణి ఎక్కడ, ఏం జేస్తున్నదో! తిరిగి

ASP/GM/K-10-L TEL

Kolynos

...కోలినోస్

హాయినిగొలిపే స్వచ్ఛమైనది...

కోలినోస రుచి!
నాలుక ఝల్లుమనే ఆహ్లాదం
కోలినోస నురుగు!
తోముకొనుట తేలికచేయును, పూర్తిగా శుభ్రపరచును
కోలినోస యిచ్చే సుగంధ శ్వాస!
మీకు, యితరులకు ఎంతో యిష్టం

ఆ ఐదో ఆమెకు ఒక్క కిటుకు. కోలినోస్ వాడి, ఒక్క చిరునవ్వు. అందరిలాగే! ప్రతి రాత్రి కోలినోస్ డెంటల్ క్రీమ్‌తో పండ్లు తోముకొనండి...సహజంగా ప్రతి ఉదయము. ఈ సహవాసంలో అధిక విశ్వాసము...అధిక ఉల్లాసము.



మధురమైన చిరునవ్వులు... కోలినోస్ చిరునవ్వులు

రిజిస్టర్డ్ యూజర్: జెఫ్రి మేనర్స్ అండ్ కంపెని లిమిటెడ్.

రాగలదని నమ్మక మేమిటి? వచ్చేదైతే అలా చెప్పా చేయకుండా ఎందు కంత ర్థాన మౌతుంది? ఎక్కడని వెదకడం? ఎటు పోయిందో, ఎవడితో పోయిందో! ఒక్కసారి తన ఆలోచనకు తానే ఉలిక్కిపడ్డాడు ప్రకాష్ కాని ఆ అభిప్రాయాన్ని మాత్రం త్రోసివేయలేకపోయాడు. 'అవును; తెగించి నాతో వచ్చినది, ఇంతకంటె ఎక్కువవాడితో పోయినా ఆశ్చర్యం లేదు ఏమైనా ఆ తెగిన గాలి పటం గురించి చింత అనవసరం. అల్పమైన కాగితం ఎక్కడో ఏ చెట్టుకో తగులుకొని చినిగిపోతుంది. చేతిలో మిగిలిన దారం గట్టిది. విలువైనది. విలువ లేని మనిషిని గురించిన చింత అనవసరం. కట్టుకున్న భార్య తన గృహ జీవనానికి సూత్రధారిణి. సంసార జీవనానికి చక్రధారిణి అయిన అర్ధాంగి ముఖ్యం!'

ఆ తరహాలో సాగిన ఆలోచనల ఫలితంగా, ప్రకాష్ ఆ మర్నాడే యిల్లాలు మైత్రేయి చెంత వాలాడు, రెక్కలు గట్టుకున్నట్లు.

ప్రస్తుతం మైత్రేయి దుఃఖించడంలేదు. అపార దుఃఖసాగరం యొక్క రూపాంతరమైన విషాద గంభీరాన్ని ఆమె మోస్తున్నది

"మైత్రీ! ఎప్పుడూ అంత దిగులుగా వుంటే ఎలా చెప్పు?" సాయంసమయాల మేడ పై అంతస్థులో ఒంటరిగా కూర్చుని చింతాక్రాంతయై, గోదావరీ జలాలను తిలకిస్తూన్న భార్యచెంత కూర్చుని మెల్లగా ఓదార్పుగా అన్నాడు ప్రకాష్.

"ఉన్నదే దిగులు, చింతే ఆత్మీయురాలు అయ్యింది నాకు." శూన్యంలోకి చూస్తూన్న మైత్రేయి నిర్లప్త సమాధానం.

"మైత్రీ!" జాలిగా, అనునయంగా పిలిచాడు ప్రకాష్. "మనకు యింతకంటే ప్రాప్తం లేనప్పు డేం చేస్తాం? ఇలా నిత్యం చింతిల్లుతూ కూర్చుంటే మాత్రం ఫలితం కనిపిస్తుందా చెప్పు?"

అతని చేతులలో వాలిపోయి వెక్కివెక్కి ఏడ్చింది మైత్రేయి

అనునయంగా ఆమె కన్నీ ళ్లొత్తుతూ అన్నాడు ప్రకాష్. "ఎవరు లేకపోయినా ఫర్వాలేదు మైత్రీ. నీకు నేనూ, నాకు నువ్వూ వున్నాం; చాలదూ? విధి లిఖితం అలాగుంది."

మైత్రేయి చూపులు చటుక్కున భర్తపైకి త్రిప్పి అన్నది "విధిలిఖితం కాదు: మనమైదం తెలిసివుండీ చేసిన పాపం కట్టికుడుపుతున్నది!"

అదరిపడ్డాడు ప్రకాష్. "ఏమిటి మైత్రీ నువ్వనేది? మన మేం పాపం చేశాం?" ఆడగలేక అడగలేక ఆడిగాడు.

టివియస్ రిట్రెడింగ్ వైశిష్ట్యానికి నిదర్శనము

# ఇది టివియస్ రిట్రెడ్ చేసిన టైరు 56,394 మైళ్ళు వచ్చింది ఇంకా పనిచేస్తుంది*

| టైర్ల రికార్డు | |
|---|---|
| మొట్ట మొదటి క్రొత్తటైరు– | 36,987 మైళ్ళు |
| తొలిసారి టివియస్ రిట్రెడ్– | 41,073 మైళ్ళు |
| రెండోసారి టివియస్ రిట్రెడ్ | 15,321 మైళ్ళు, ఇంకా 10,000 మైళ్ళుకూడా వస్తుంది. |



ఇది రెండవ రిట్రెడ్ మీదున్నది. మరొకసారి కూడా రిట్రెడ్ చేయవచ్చు టివియస్ రిట్రెడ్‌లలో ఇటువంటి అసాధారణమైన మన్నిక సామాన్యం. శాస్త్రీయంగా, శ్రద్ధగా, జాగరూకతతో రిట్రెడింగ్ చేయడంవల్లనే ఇది సాధ్యమయింది.

ఇదే మేము ఇక్కడ చేసేది:

1. టైర్లను శుభ్రపరచి, గాజు పెంకులు, మేకులు, రాళ్ళు మొదలగు బాహ్య పదార్థాలను తొలగించి, లోపలి దెబ్బతిన్న భాగాలను జాగ్రత్తగా రిపేరుచేసి, మేలిరకం రిట్రెడింగ్‌కి సిద్ధం చేస్తాము. 2. అవసరమైనచోట క్రొత్త ప్లైలను చేర్చి కేసింగులను దృఢపరుస్తాము. 3. రిట్రెడింగుకు ఉపయోగించే మిక్కిలి దళసరి కామెల్‌బాక్ రబ్బరులోని జిగురును కాపాడడానికి, ఎయిర్ కండిషన్డ్ గదులలో భద్రపరచి ఉంచిన రబ్బరు అది.

టివియస్ రిట్రెడ్ టైరు మొత్తముమీద చాలా మైళ్ళు వస్తుంది మీరు వెచ్చించే ఒక్కొక్క రూపాయికి మీకు ఎక్కువ మైళ్ళు గిట్టుబడి.




*టివియస్ – ఇండియాలో రిట్రెడ్ చేసే సంస్థల్లోకల్లా పెద్దది.*

**సుందరమ్ ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్**

(టివియస్ సంస్థ)
ఫ్యాక్టరీలు పుదుక్కోటై–మద్రాసు–కోయంబత్తూరు
బెంగళూరు–తిరునల్వేలి–సికింద్రాబాదు

*చూడండి ఇది ప్రస్తుతం వాడకంలో ఉన్న టైరు చిత్రము. రికార్డులు మా మద్రాసు ఆఫీసులో చూడవచ్చు.

JWT/TVS/SI/2904

సూటిగా అతడి కండ్లలోకి చూచింది మైత్రేయి. "తెలియకే అడుగుతున్నారా?"

వెఱ్ఱివానిలా మూఢుడై చూడసాగాడు ప్రకాష్.

మైత్రేయి తన మాటలను పొడిగించింది: "యౌవన మదంలో గ్రుడ్డి ధైర్యంతో మీరు ప్రవర్తించారు. పరువూ ప్రతిష్ఠా, మంచీ చెడూ, అనే పిరికితెరలతో నేను కట్టుబడిపోయాను. ఫలితంగా ఒక సాటియువతి జీవితం నాశనమైపోయింది. ఒక సామాన్య కుటుంబపు మానమర్యాదలు మంటగలసిపోయి, అవమానానికి ఆహుతైపోయి, ఛిద్రాంతరమైపోయి, చెట్టూ షట్టా పట్టిపోయారు ఆ ఉసురంతా మనల్ని బెడిసికొట్టింది. ఇంకా ముందేమేమి కానున్నదో?"

"మైత్రి" బాధావమానాలతో ఊగిపోయిన ప్రకాష్ రెండు చేతులతో ముఖాన్ని ఆచ్ఛాదించుకున్నాడు.

''అవును!' మైత్రేయి తొణకలేదు, బెదరలేదు. "మీ మైత్రినే— మీ అర్ధాంగినే మాట్లాడుతున్నాను. మీరు చేసిన పాపకృత్యం గురించే మాట్లాడుతున్నాను. కల్యాణి జీవితాన్ని మీ రెండు కలా భగ్నం చేశారు? ఒక అయినింటి ఆడదాని జీవితంతో అలా ఆడుకుంటారా?" కన్నీళ్ళు కట్టలు త్రెంచుకున్న ఏరులా ప్రవహిస్తున్నాయి చెక్కిళ్ళపై.

"నీ కెలా... తెల్సు?" అడగలేక అడిగాడు నీరసించిపోయిన ప్రకాష్. "నౌకర్లు చెప్పారా?"

"లేదు. వాళ్ళ నడిగేంత నైచ్యం నాలో లేదు. నాకు కావలిస్తే మిమ్మల్నే అడిగి తెల్సుకుంటాను."

ప్రకాష్ మాట్లాడలేదు. భార్య మాటలకై మౌనంగానే ఎదురుచూస్తున్నాడు.

"వినాలనుకున్నా లేకున్నా కొన్ని మాటలు వాటంతటవే వచ్చి చెవుల సోకుతాయి. 'పోనీ. తెలివి తక్కువగా ప్రవర్తించింది— ఎక్కడో ఓ చోట సుఖంగా వుంది— చా'లనుకున్నాను. కల్యాణిపై వ్యక్తిగత ద్వేషం పూనకుండా, కేవలం ఒక తోటి స్త్రీగానే చూచాను. యువతిగా ఆమె యౌవనపు బలహీనతను అర్థం చేసుకొని క్షమించాను. సపత్నిగా అమెకూడా నాలాగే సుఖించాలని కోరుకున్నాను. కాని కలనైనా ఆమె గురించి మత్సరపడలేదు. ఆమె యిప్పు డెటువంటిదైనా ఒకప్పుడు నా స్నేహితురాలు అసంతృప్తికీ, అత్యాశలకూ లోనైన అమాయకురాలు. మీరు ఉన్నత హృదయులు — ఆమెను మనసారా ప్రేమించారు; సుఖపెడ్తారని భ్రమపడ్డాను. కాని సామాన్య స్వార్థపురుష లందరిలాగే ఆమె నొక విలాసస్త్రీగా



చూచి, విలువలేనిదాన్ని చేసి నడిరోడ్లపాలు చేస్తారని ఎన్నడూ అనుకోలేదు. ఆమె ఉసురే మనల్ని కొట్టింది "

"ఆపు నీ ప్రొలాపన ;" రోషంగా లేచినిల్చున్న ప్రకాష్ పట్టరాని ఆగ్రహంతో మైత్రేయి చెంప ఛెళ్ళుమనిపించాడు.

"ఆపను, ఆపలేను. కళ్యాణికి మీరు చేసిన అన్యాయాన్ని యింతకాలం ఎవ్వరికీ తెలియకుండా ఒక్కతెనూ లోపల దాచుకుని గరళంలా మ్రింగలేక క్రక్కలేక బాధ పడ్తున్నాను. ఈనాడు కళ్యాణి భగ్నజీవితంగురించి పూర్తిగా తెలిసిన నేను లోలోన చెలరేగిన ఈ దావానలాన్ని భరించలేకుండా వున్నాను. నా మనస్సు అనేక

కారణాలతో ఏడుస్తున్నది. భరించలేని ఈ ఏడుపు, మోయలేని ఈ బాధ ఎప్పు డెక్కడ ఎవరిదగ్గర వెళ్ళగ్రక్కేస్తానో అనే భయంకొద్దీనే మీతో చెప్పుకుని ఏడుస్తున్నాను విన్నసాయంత్రం కళ్యాణి వచ్చి ఈవీధి అందర్నీ తన తలిదండ్రుల వృత్తాంతం అడిగిందట. అందరూ ఆమెను వీధికుక్కనులాగా తరిమికొట్టారు. ఎక్కడా ఆశ్రయం దొరక్క గోదావరి కట్టవెంబడి నడచిపోతూండగా చూచానని పనిమనిషి చెప్పింది

'తీసికెళ్ళినవాడు వదిలేశాడు కాబోలు!' ఎవరు అన్నా యి దేమాట.

ఆమాట లనేవాళ్ళకు ఆ వ్యక్తెవరో తెలియకపోవడం నా అదృష్టం. అది నా ఒక్కతికి మాత్రమే తెలియడమనేది నా దురదృష్టంకూడా! అందరూ పోటీ కొచ్చినట్టు అనుకునేమాటలు వచ్చి నాకు ములుకులై తగుల్తున్నాయి." కుమిలి కుమిలి ఏడ్చింది.

అయోమయంగా వింటూ కొయ్యబారిపోయినట్లు నిల్చున్నాడు ప్రకాష్. మాటా పలుకూ లేకుండా.

తిరిగి వెక్కుతూ అన్నది మైత్రేయి: "పనిమనిషితో చెప్పాను—ఆమె ఎక్కడున్నా వెదకి తీసుకురమ్మని. లాభం లేకపోయింది, కన్పించలేదట. కళ్యాణికి జరిగిన ఈ అన్యాయం మనల్ని కట్టి బాధించదా?"

ప్రకాష్ ముఖ కవళికలలో భావాలు త్వరత్వరగా మారిపోయాయి. అతడి అంతరంగం బ్రక్కలైపోయినట్లు అతడి చూపులే స్పష్టం చేస్తున్నాయి. మైత్రేయి చెంప సవరిస్తూ దగ్గఱకు తీసుకుని సౌమ్యస్వరంతో అన్నాడు: "నన్ను నువ్వు తప్పు అంచనా వేసుకున్నావు మైత్రీ. కళ్యాణి విషయంలో నేనూ నిశ్చింతగా లేను. కాని నే నంతటి దుర్మార్గుడిని కాను. కేవలం స్వయంకృతాపరాధంవల్లనే కళ్యాణి అలా అయిపోయింది. ఇంతకంటె నే నేమీ చెప్పలేను, నువ్వు ఎంతటి ప్రమాణం చేయమంటే అంత......" అంతలోనే ప్రకాష్ వదనమూ స్వరమూ కూడా కఠినంగా మారిపోయాయి. "అయితే మైత్రీ, ఒక మాట—తప్పంతా మగవాడిదే కాదు; ఆడదాని బుద్ధిహీనతను గురించికూడా ఆలోచించు ఇందులో ఎవరి పాపమూలేదు. ఆమె ప్రలోభం ఆమెది, నా ప్రలోభం నాది. సుఖాన్ని వెదుక్కోవడం మగవాడి లక్షణం. తన జాగ్రత్తలో తా నుండడం స్త్రీకి అవసరం అంతే. మన వివాహవిషయం యింతకాలం ఆమెకు తెలియదు. ఇప్పుడు తెలిసి భరించలేక, నా కన్నుగప్పి యిల్లువదలింది, కళ్యాణి శరీరానికున్న అందం మనసుకులేదు."

అతడి తెగింపునకు నివ్వెరపోయి నిలబడింది మైత్రేయి.

# కాశ్మీరులో

## అద్భుతంగా గడపడానికి
## మీ సెలవు రోజుల్ని వినియోగించండి

మహిమాన్వితమయిన మంచుకప్పిన కొండలు, వసంతంలో మంచు కరిగి స్వచ్ఛమయిన సరస్సులు, వెండిలా మెరిసిపోయే సెలయేళ్ళు, షాలిమార్, నిషాత్, చష్మ షాహి, నసీమ్ వంటి సుందర మొఘల్ వనసీమలు, సాటిలేని [illegible] నైపుణ్యాలు, చేపలు పట్టుట, ఆటలు, వాహ్యాళి, స్వారి, ఈత—ఎన్నెన్నో.

31వ అక్టోబరుదాకా హైవేద్వారా రోడ్డుద్వారా వెళ్ళడానికి కన్సెషన్. ఢిల్లీ-శ్రీనగర్‌ల మధ్య ప్రయాణీకుల కొరకు రెండు వైకౌంట్ విమానాలు రోజూ ప్రయాణిస్తాయి. అందులో ఒకటి బొంబాయి-ఢిల్లీ క్యారవేల్ విమానాన్ని అందుకొని బయలుదేరుతుంది. హౌస్ బోట్‌లో వసతి ఏర్పాటు చేసుకోవడం మీ కోరుకున్న దానికన్నా చవక. మీ సెలవు రోజుల్ని ఎట్లా గడపాలా-అన్న విషయంలో మీకు జమ్ము-కాశ్మీరు టూరిజమ్ డైరెక్టరు సహకరిస్తారు.


భారత ప్రభుత్వ యాత్రా విభాగము

DA-65/184

"మరెప్పుడూ ఈ ప్రసక్తి నా దగ్గర తీసుకురాకు మైత్రీ, జాగ్రత్త." నిప్పులు కురిపిస్తూ నిష్క్రమించాడు ప్రకాష్.

"మగావాడు!" అనుకొంది ఒంటరిగా మిగిలిపోయిన మైత్రేయి తనలో తాను.

## 14

ఎవరో నిదుర లేపగా మేల్కాంచింది కళ్యాణి.

ఉదయం పదకొండు గంటల సమయం అది!

"ఏదమ్మా? చార్జీ చెల్లించావా?" విసుగ్గా అడుగుతున్నా డోవ్యక్తి.

క్షణకాలం నిర్వేరపోయిన కళ్యాణి, తన శరీరంపై ఒక్క నగకూడా లేక పోవడం గుర్తించి మరింత కొయ్యబారిపోయింది. జరిగిన విషయమంతా చెప్పలేక చెప్పింది. నమ్మినవారు జాలిపడ్డారు. నమ్మనివారు గేలిచేసి నవ్వారు. కళ్యాణి యిల్లు వదలినతర్వాత నేర్చుకున్నవాటిలో యిది మూడవగుణపాఠం. 'ఎదుటివారి నిస్సహాయస్థితిని తమ స్వార్థం కొఱకై వినియోగించుకుంటారు క్రూర మానవులు!'

పడవగుమాస్తా వచ్చాడు: "ఏం చేయడం తల్లీ? మాకు అధికారం లేదు. మరి నిన్ను ఈ పడవలో ప్రయాణం చేయనీయడానికి. నువ్వు గొలుసెవరి కిచ్చావో మాకు తెలియదు. వాడెవడో మోసగాడై వుండాలి!"

నిలువునా నీరైపోయింది కళ్యాణి. అప్రయత్నంగానే కనుకొలుకులలో నీరు నిలిచింది.

"పడవసిబ్బంది నంతనూ వెంటనే యిక్కడ హాజరు పెట్టండి. వాళ్ళలో ఎవరో ఆమె గుర్తుపడుతుంది." ప్రయాణీకులలో ఒకవ్యక్తి తనకు తానై కల్పించుకుని అధికారం చేశాడు. వెంటనే ఆమాట అమలు జరిగింది.

వరుసగా నిల్చున్న సిబ్బందినంతనూ పరీక్షగా తిలకించిన కళ్యాణి నీరసంగా తల అడ్డంగా ఊపింది. "వీ రెవరూ కా"రంటూ!

"పోనీ ఆవ్యక్తి ఎలా వుంటాడో చెప్పగలరా?" ఒకరి ప్రశ్న.

కళ్యాణి వర్ణించింది.

ఆఁ! వాడా? వాడైతే యిక లాభంలేదు. ఇవ్వాళ యిక్కడుంటే రేపు బెజవాడలో వుంటాడు; మరో క్షణానికి నాగాపూర్‌లో వుంటాడు. పెద్ద పేరు మోసిన కేడీ! వాడి నెవరూ తెలిసుండీ ఏమీ చేయలేరు." పడవ సిబ్బంది అంతా ముక్తకంఠంతో తెలియజేసిన ఆ సత్యానికి నిర్జీవ పడిపోయి, అయోమయంగా చూస్తూ కూర్చుంది కళ్యాణి.

"మీ దేవూరా,"

"ఎవరూ లేరా :''

"మీవా ళ్లెక్కడ ?''

ప్రేక్షకుల ప్రశ్నాపరంపరలకు చెవిటిదై పోయిన కళ్యాణి కర్తవ్యం ఆలోచి స్తూండగా ఒక సిల్కు లాల్చీ, బంగారు ఫ్రేము కళ్ళద్దాలు, గ్లాస్కో పంచెలవ్యక్తి దగ్గరగా వచ్చి అన్నాడు; "పోనీ మీ కవసరమైన డబ్బు నా దగ్గర తీసుకోండి. మీరు యింటికి వెళ్ళినతర్వాత పంపించవచ్చు.''

కళ్యాణి ఆ వ్యక్తిని ఎగాదిగా చూచింది. ఏమీ సద్భావం కలగలేదు. మనస్సు చెడును శంకించింది.

"కృతజ్ఞురాల్ని. కాని అక్కర్లేదులెండి. ఇక్కడ దిగిపోయి నా దారేదో నేను చూసుకుంటాను."

"మొగమాటపడకండి. ఆపద, అవసరం ఎవరికైనా వస్తాయి. ఒకరికొకరం సాయపడనిదే యింకెందుకు ?'' హుందాగా అన్నా డతడు.

"అవునమ్మా, అలా సిగ్గుపడితే ఎలా. ఏం చేస్తావు? కష్టకాలం! ఎవరికైనా వస్తుంది.''

అయినా ఈ పరిస్థితిలో అంతకంటే చేయగలిగిం దేముంది ?''

"నయం, ఆయన దైవంలాగా సాయం చేస్తానన్నారు; లేకుంటే అల్లరి పాలై పోదువు."

మళ్ళీ రకరకాల సలహాలూ, వ్యాఖ్యానాలూ మొదలు!

నాలుగోపాఠం నేర్చుకుంది కళ్యాణి; "వ్యక్తికి స్వంత మెదడు, అభిప్రాయమూ, ఆలోచనాపటిమా ఉన్నంతమాత్రాన సరిపోదు. చుట్టూ వున్న గ్రహాల ప్రభావం బాగా రాజ్య మేల్తుంది!"

తప్పనిసరిగా అతడి సహాయాన్ని స్వీకరించింది కళ్యాణి.

# 15

పవిత్ర గోదావరీ తీరాన పావన చరితంతో విలసిల్లుతూన్న భద్రాద్రి పుణ్య క్షేత్రం చూచినవారి జన్మ పావనమైనట్లే. ఆ రామదాసు ఎంతటి పుణ్యమూర్తో—యిలా కలకాలం కీర్తింపబడేపని చేశాడు. దైవాల కతడు చేయించిన జహ్వారీ ఎంత బాగున్నది! ఆత డీ దైవాన్ని స్తుతించిన కీర్తన లెంత మృదుమధురంగా తేనె లొలుకుతూంటాయి!

"..........కలికి తురాయితో నీవు కులుకుచూ తిరిగేవు— ఎవరబ్బసొమ్మని కున్నావు రామచంద్రా?"

## మీరు వ్యాపారంలో వున్నారా
## ఉద్యోగంలోనా?

### ఒక 10-సంవత్సరాల లేదా 15-సంవత్సరాల

# క్యుములేటివ్ టైమ్ డిపాజిట్ అకౌంట్

### మీ కీ సదుపాయాలు కల్పిస్తుంది...

**1**

*గడువు పూర్తి అయిన తరువాత, 10-సంవత్సరాల అకౌంటుమీద 4.5%, 15-సంవత్సరాల అకౌంటుమీద 4.8%, సంవత్సరం ఒక్కంటికి పన్నులేని చక్రవడ్డీ లభిస్తుంది. ఇందులో గడువు పూర్తి అయినాక లభించే బోనస్ కూడ వుంటుంది.*

**2**

*ఆదాయపు పన్ను చెల్లించే విషయంలో ఆదాయంనుండి మినహాయింపు లభిస్తుంది. మీ డిపాజిట్లలోని మొదటి 5,000 రూ.లలో 60%, తక్కిన విలువల్లో 50% మినహాయింపు. కాని ఇది ఒక షరతుమీద ఆధారపడి వుంటుంది—సీలింగ్ రూ. 12,500 వుండాలి. లేదా ప్రావిడెంట్ ఫండ్ నిధులు, జీవితభీమా ప్రీమియమ్‌లతో సహా మీ డిపాజిట్లపై ఆదాయంలో నాలుగవవంతు మినహాయింపబడుతుంది.*

**3**

*గడువు పూర్తి అయినాక ఒకే మొత్తంగా లభిస్తుంది.*

**4**

*ఉపసంహరించుకోవడానికి సౌకర్యాలు—10-సంవత్సరాల అకౌంటులో రెండుసార్లు, 15-సంవత్సరాల అకౌంటులో మూడుసార్లు.*

ఏ పోస్టాఫీసులోనయినా
తెలుసుకోండి



జాతీయ పొదుపు
ఉద్యమ సంస్థ

DA 65/83

భక్తులు పాడుతూన్న పాట లన్నిటిలోనూ కళ్యాణి నెక్కువగా ఆకర్షించినది ఆ పాట. ఇటు జాలీ, ఆటు నవ్వూ, భక్తీకూడా కలుగుతాయి ఆచరణం వింటూంటే.

పర్ణశాలలలో మాయలేడి పరుగులెత్తిన ఆనవాళ్ళు. శ్రీ సీతా రామ లక్ష్మణుల పాదాలు, సీతామహాలక్ష్మి చీరలు ఆరవేసుకున్న ఆనవాళ్ళు. ఆనాడు ఆ తల్లి స్నానం చేసిన వేడినీటిగుండం, పసుపుకుంకుమలు వాడిన నిదర్శనాలు— అన్నీ చూస్తూంటే ఆశ్చర్యమే కలుగుతుంది. భగవంతునిముందు మానవుని అల్పత్వం స్పష్టంగా కన్పించి ఒకవిధమైన వైరాగ్యభావం కలుగుతుంది.

కళ్యాణి మనస్సు మాత్రం సిగ్గుతో అవమానంతో కుంచించుకుపోయింది. ఆత్మనింద తలెత్తింది. తనపై తనకే అసహ్యం కలిగింది. మిథిలాధీశుని గారాబుతనయ, దశరథచక్రవర్తి ముద్దుల కోడలు, శ్రీరామచంద్రుని అనుంగు అర్ధాంగి, సకలైశ్వర్యాలనూ త్యజించి భర్తతో కారడవుల కేగి స్త్రీలోకానికే తలమానిక మైంది! అందుబాటులో లేని ఆ అయిశ్వర్యాలను అనుభవించటానికి తనవంటివారు అక్రమ ప్రవర్తనలతో అసహ్యకరంగా ప్రవర్తించి, ఆత్మీయులను నగుబాటుపాలు జేసి, స్త్రీజాతికే తలవంపు తెస్తున్నారు!

'ఛీఛీ, నాదీ ఒక జన్మేనా? నాదీ ఒక బ్రతుకేనా? నేను లేకపోతే నేం? ఈ పృథ్వికి కాదు సరికదా, కనీసం ఒక్క మనిషికైనా ఏమీ లోటు జరగదు. మీదు మిక్కిలి ధరణీభారం తగ్గుతుంటేమో కూడ.' పవిత్ర గోదావరిలో లీనమైపోయే తలంపుతో కొన్నిగంటలు ఆ నదిఒడ్డున గడిపేసింది కళ్యాణి. ఆ ప్రవాహం లోనికి దిగను సాహసించలేకపోయింది. 'ఎవరికోసమూ కాదు. ఎవరికైవారే బ్రతకాలి. అందుకే ఎవరి ప్రాణంపై వారికంత తీపి! ప్రపంచం అయుపుపట్టు ఈ తీపిలోనే యిమిడివున్నది!' అని గ్రహించింది కళ్యాణి.

'ఇక్కడినుండి ఎక్కడికి పోను? కనీసం నా వా రెక్కడున్నారో వెదకి వెళ్ళితే మాత్రం వారు రానిస్తారా?' ఆలోచనతో పాటే చిత్తం ధుమధులాడ్తూండే తల్లి రౌద్రాకారం మనసున మెదిలింది. వెంటనే కన్నవా రింటికి వెళ్ళే తలంపు నీరస పడిపోయింది. వసుంధర కరుణామయి; జానకి పుణ్యచరిత. అందుకే ఆమెను లోకదృష్టులనుండి, అవమానాలనుండి తొలగించి తనలో యిముడ్చుకున్నది తల్లి ధరణి. ఈనాడు అటువంటి మాతలూ లేరు, పుత్రికలూ లేరు!

భద్రాద్రిలో శ్రీ సీతారాముల కల్యాణాన్ని నేత్రపర్వంగా చూచిన అనంతరం భక్తు లందరూ తిరుగుప్రయాణసన్నాహంలో వున్నారు.

కల్యాణి దిక్కుతోచని దైంది.

"మీ రెక్కడికి వెళ్ళాలి?" ఇంతవఱకూ సాయంచేస్తూన్న అపద్బాంధవునిచే ప్రశ్నకు తడబడిన కల్యాణి మౌనంగా నిల్చింది. నిస్సహాయతతో ఉడికిపోతూన్న హృదయాన్ని ప్రతిబింబింపజేస్తూన్న అశ్రుధారను అతడికి కన్పించకుండా దాచుకోవాలనే తలంపుతో తల వాల్చుకొంది.

పరీక్షగా చూచా డతడు. "మీ రెక్కడికి వెళ్ళాలో చెప్తే తీసుకువెళ్ళి దిగ విడుస్తాను."

కొద్దిసేపు ఆలోచించిన కల్యాణికి ఏమీ తోచలేదు 'ఎక్కడికి వెళ్ళను? ఏం చేయను?' అంతా అయోమయమే!

"నిజం చెప్పండి. మీ కెవరూ లేరా? అత డెంతో సన్నిహితంగా ఆత్మీయునిలా ప్రశ్నించాడు.

కల్యాణి దుఃఖం కట్టలు త్రెంచుకున్నది. "మీరు నా కొక్క సహాయం చేసి పెట్టగలరా?"

"ఏమి టది?"

"నా కెవరూ లేరు. హైద్రాబాదులో నాబోటి అనాధలకు ఆశ్రయ మిచ్చి, ఏదైనా వృత్తి నేర్పి, జీవనోపాధి చూపే సంస్థ లున్నాయని విన్నాను. నన్ను అటువంటి చోట జేర్పించి, మీరు పుణ్యం కట్టుకుంటే, జన్మజన్మాలకూ మీ ఋణం మఱచిపోను. బ్రతికి బాగుంటే జీవికకు ఏదైనా మార్గం దొరికితే తప్పక మీ డబ్బు పూర్తిగా తీర్చేసుకుంటాను."

వెంటనే "సరే" అన్నాడు సిల్కులాల్చీ.

# 16

కళ్యాణితోపాటు హైద్రాబాద్ స్టేషన్‌లో ట్రెయిన్ దిగిన సిల్కులాల్చీ టాక్సీలో హోటల్ జేరాడు.

"ఇదేమిటి, ఇక్కడి కొచ్చాం?" అనడిగింది కళ్యాణి విస్మయంగా.

అతడు ఆమె అవివేకాన్ని హేళన చేస్తూన్నట్టు నవ్వాడు. "బాగుంది, లేడికి లేచిందే ప్రయాణమా? ఇక్కడ ముందు భోజనం చేసి, ఆకలి తీర్చుకోవాలి. ఆ సంస్థ లెక్కడున్నాయో ఏమిటో ఆరా తీయాలి. ఈ అపరాత్రివేళ మన కివన్నీ ఎవడు చెప్తాడు? రేపు ఆ పని చూస్తాను."

కళ్యాణి ఆ మాటలను నమ్మింది.

అతడు టాక్సీ దిగుతూండగానే చూచిన హోటల్ మానేజర్, గుమాస్తాలు

పరుగెత్తుకువచ్చి అతివినయం ప్రదర్శించుతూ మాట్లాడడం గమనించిన కళ్యాణి, అతడు చాలా పలుకుబడిగల వ్యక్తే నని గ్రహించింది.

మేడమీద చిత్రవిచిత్రంగా వున్న ఎయిర్‌కండిషన్డ్ రూమ్‌లో అతడితోబాటు అడుగుపెట్టిన కళ్యాణి మనసూ, శరీరమూ ఒక్కసారి జలదరించాయి

"ఒక్క గదేనా? డబుల్‌రూమ్ తీసుకోండి." అంటూ అతడి వెనక చూచిన కళ్యాణి, అతడి చూపులకూ మాటలకూ నివ్వెరపోయింది.

"అట్టే నటించకు పతివ్రతలాగా ఎన్నిచేతులు మారావో, యింకెందర్ని చూడబోతున్నావో! నీకు అనాథశరణాలయూ లెందుకుగానీ, నాదగ్గరే వుండు; ఏ లోటూ రానివ్వను."

కళ్యాణి నిశ్చేష్టయై నిలబడింది.

తిరిగి అతడన్నాడు: "పెంకెతనం చేసినా లాభంలేదు నా బంధానుండి యిక తప్పించుకోవడం సాధ్యంకాదు. మర్యాదగా నాదగ్గరుండు నే నెవరినో నీ కింకా తెలియదు. మహామహావాళ్ళంతా నాకూ నా ధనానికీ సలాములు చేస్తూంటారు."

అంతలో మానేజర్, సర్వర్‌చే భోజనం పట్టించుకురావడంతో అతడి వాగ్ధోరణి ఆగిపోయింది.

మానేజర్‌తో అతడు మాట్లాడుతూండగా, కల్యాణికి కొంచం ఆలోచించుకోటానికి తీరిక చిక్కింది.

"మాంచి అందంగా వుంది. ఎవరీ క్రొత్తపిట్ట? హోటల్ గిరాకీ బాగా పెరుగుతుందిలే."

సమాధానంగా గర్వంగా నవ్వాడు సిల్కులాల్చీ.

మానేజర్ మాటలకు వులిక్కిపడింది కల్యాణి. తన గతి ఏమి కానున్నదో గ్రహించుకుంది

ఇద్దరూ కొంతసేపేదో ఇంగ్లీషులో మాట్లాడుకున్నాక మానేజర్ వెళ్ళిపోయాడు.

క్షణాలలో కర్తవ్యం నిర్ణయించుకున్న కల్యాణి, తన వదనంలో క్రోధంగానీ, మాటలో కరకుతనంగానీ ద్యోతక మవకుండా జాగ్రత్తపడింది

"అయితే మీకు కారుందా?" అతి అమాయకంగా ప్రశ్నించిం దతడిని.

నిర్లక్ష్యంగా నవ్వుతూ చూచాడు. "ఒకటా?"

కల్యాణికూడా చిన్నగా నవ్వి ఊరుకుంది.

"ఏం? ఎందుకు? నేను బీదవాడినో, ధనవంతుడినో పరీక్షిస్తున్నావా?" నవ్వుతూనే అడిగాడు సిల్కులాల్చీ.

"కాదు, ఇందాక టాక్సీలో వస్తూంటే అన్పించింది – చక్కగా స్వంతకారులో, ఈ వెన్నెలలో, ఈ నగర వీధులవెంట తిరిగితే ఎంత హాయిగా వుంటుందో నని." కళ్లు అందంగా త్రిప్పుతూ, ఆశగా అమాయకంగా అంది.

"ఓస్, అంతేగదా!" బిగ్గఅగా నవ్వేశాడు "పద. భోజనం కాగానే కాస్సేపలా తిరిగివద్దాం. ఇక రేపట్నుంచీ రోజూ షికార్లూ సినిమాలేగా?"

ప్రక్కన కూర్చున్న కళ్యాణితో కబుర్లు చెప్తూ మైమఱచి కారు నడుపుతూన్న అతడి ధోరణి రకరకాలుగా సాగిపోతూంది.

"ఇది మూసీనది. చూశావా? నగరం మధ్యనుంచి ప్రవహిస్తోంది!" అని చూపించాడు.

నదీమధ్యంగా అడుగడుగునా వున్న నల్లబండరాళ్ళు చూస్తే కళ్యాణికి గుండె గుభిల్లుమన్నది.

"ప్రశాంతంగా ఉండేచోట కూర్చుందాం. హిమాయత్ సాగర్ దగ్గర బాగుంటుందే"

"నీకలా తెలుసివన్నీ?"

"వెనకోసారి మా స్నేహితురాలు చెప్పింది ఈ ఊరునుగురించి."

# అమృతాంజనం

## వాడి శీఘ్రంగా నివారణ పొందండి

స్థానికంగా ఉండే బాధను నివారణ చేసుకోడానికి ఊరికే మందులు ఎందుకు పుచ్చుకుంటారు? నొప్పి ఉన్న చోటుమీద అమృతాంజన్ రాసి అమోఘంగా శీఘ్రంగా నివారణను పొందండి ఏ అపాయం లేకుండా బెణుకులకు కండరాల నొప్పులకు తలనొప్పికి ఇంకా కీళ్ల నొప్పులకు అమోఘంగా గుణమిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు అమృతాంజన్ గుండెజలుబుకు సాధారణ జలుబులకు కూడా మంచి మందు కొంచెం కొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది. కాబట్టి ఒక సీసా మీ కుటుంబానికంతా కలిసి నెలలు తరబడి వస్తుంది అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి అమృతాంజన్ 70 ఏళ్ల ప్రసిద్ధిని పొందిన నమ్మకమైన గృహ ఔషధం

అమృతాంజన్ నొప్పుల జలుబుల నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు

బెణుకునొప్పి
ఎంత ఎక్కువగా ఉన్నా
బెణికినచోటేకదా!




అమృతాంజన్ లిమిటెడ్

మద్రాసు బొంబాయి - కలకత్తా ఢిల్లీ

JWT/AM/2869

"ఆల్‌రైట్."

రాత్రి మీరినందువల్ల జనం అంతగా లేరు. ఒక సోఫాలో ఎవరో ఒకతడు కూర్చునివున్నాడు.

"మనం అక్కడ కూర్చుందాం." దూరంగా వున్న సిమెంటుబెంచీవైపు దారి తీశాడు సిల్కులాల్చీ.

వెనువెనుకనే నెమ్మదిగా అడుగులు వేస్తూన్న కళ్యాణి అదను చూచి, ఒక్క పరుగుపెట్టింది.

అతడు తిరిగి చూచి, నివ్వెరపాటునుండి తేరుకుని, ఆమె ననుసరించబోయే సరికే ఆమె చాలా దూరమై, ఆ చీకటిలో కలిసిపోయింది. అతడి దారికి కార్లూ, సైకిళ్లూ అన్నీ అడ్డుపడ్డాయి.

అతడు కారెక్కి వెదకినా ప్రయోజనం లేకపోయింది. అంతకంటె అతడికి ఆచూకీ తీయగల సాహసం, అవకాశంకూడా లేదు – సంఘంలో తానొక పెద్దమనిషాయె!

'డామిట్! చిక్కినట్టే చిక్కి తప్పించుకుపోయింది. ఎంతటి ఆడది!' కసిగా అనుకొని వదిలేశాడు.

# 17

కాలికి దొరికినబాట పట్టిన కళ్యాణి ముందుగా తిసకుతానే ధైర్యం చెప్పుకొంది– ఎవ్వరినీ తేలికగా విశ్వసించరాదనీ, ఆ ప్రాంతాలకు తాను క్రొత్తదానిగా ఎవ్వరూ గ్రహించగల అవకాశం యివ్వరాదనీ.

ఎక్కడా తడబాటూ తచ్చాడడం లేకుండా, అడుగు ముందుకు వేయడమేగాని, వెనుకకు లాగకుండా అతిధైర్యంతో సాగిపోయిన ఆమె పోయిపోయి ఒకచోట చెట్టుక్రింద కూలబడిపోయింది.

నిర్జనప్రదేశం. నిబిడనిశీధి. మూసినది అక్కడ చాలా లోతుగా ప్రవహిస్తున్నట్లు పరిసరాలే చెప్పక చెపున్నాయి ఆ భయంకర వాతావరణంలో ఒక్కసారి మేను జలదరించింది కళ్యాణికి; గుండె ఆగినట్లే అయ్యింది. తన కెప్పుడూ చీకటిని చూస్తే భయం దెయ్యాలుంటాయని బెంగ! అంతలోతిరిగి తనలోతానే నవ్వుకొంది. ఒక విధమైన నిర్లిప్తత ఆవహించేసింది. 'ఈ స్వార్థమానవులకంటె దయ్యాలూ, భూతాలూ, పిశాచాలూ ఏమంత ప్రమాదకరమైనవికావు! ఏ విషజంతువో వచ్చి కాటు వేయకూడదూ? ఈ కొండలమీదినుండి ఏ పులో వచ్చి ఆహారంగా స్వీకరించరాదూ?'

గుడ్లగూబల అరపులమధ్య, పావురాల గుడుగుడలు వింటూ, దిక్కుమాలిన

పక్షిగా ఐపోయిన తన స్థితికి రోస్తూ, రోదిస్తూ చింతిలి చింతిలి, అక్కడే ఆ చెట్ల క్రిందనే దుమ్ములో, చలిలో ఓటికినేలపై పడి నిద్రపోయింది.

ఉదయం ప్రకృతి సవ్వడికి మేల్కొన్న కల్యాణికి తానున్న ప్రదేశ మేమిటో తెలియలేదు. రాత్రి అంధకారంలో వివరాలు తెలియక అంతగా భీతి కలుగలేదు కాని, ఇప్పుడు వెలుగులో అతిభీతావహంగా వున్న నిర్జనప్రదేశం చూడగానే అంత భయం ఆవరించింది. ఏదో అదృశ్యశక్తి అక్కడ తాండవ మాడుతున్నట్టు గుండె వేగంగా కొట్టుకోసాగింది నదీ ప్రవాహపు భయంకర ధ్వనీ, అప్పు డప్పుడు ఆ మార్గంగా ఎగిరిపోతూన్న రకరకాల పక్షుల అరుపులూ, బలమైన గాలి నిరాటంకంగా చెట్ల ఆకులతో జరుపుతూన్న గలగలల మంతనాలూ, అంత కంతకు తీక్షతర మౌతూన్న ప్రభాకరుని తాపకిరణాలూ తనను హేళన చేస్తు న్నట్లు, వచ్చి తమలో లీనమైపొమ్మని ఆదేశిస్తూన్నట్లు అనిపించింది కల్యాణికి.

'ఏమి టిలా వచ్చేశాను? ఎందు కింత బుద్ధితక్కువగా ప్రవర్తించాను?

---

అందని అమృతాన్నంకోసం అఱ్ఱులు చాచి, ఉన్న అంబలికూటిని కూడా కూల ద్రోసుకుని అక్షరాలా పిచ్చగత్తెగా మారిపోతాను! ఏమాత్రం జాగ్రత్తగా లేక పోయినా ఇకమీదట వడుపుగత్తెగా కూడా మారిపోతాను దానికి తోడు గర్భవతిని! ఏది దారి?'

కాలగమనమే గమనించకుండా స్థాణువై ధరణి కతుక్కుపోయి కూర్చున్న కల్యాణిని, కడుపులో ఆకలి స్థిమితంగా కూర్చోనివ్వక వేధించసాగింది. చుట్టూ ఆశగా కలియజూచిన ఆమెకు ఏమీ కన్పించలేదు. అక్కడ వున్న వృక్షాలలో ఏ ఒక్కదానికీ భుజింప యోగ్యమైన ఫలాలు లేవు. నిస్పృహతో లేచి, నది దగ్గరకు పోయింది. నీరు త్రాగటానికి. కాని అక్కడెక్కడా నదిని సమీపించగల రేవు లేదు. చాలా భయంకరంగా వుంది. నదిలోకి దిగి నీరు త్రాగగల చోటును అన్వేషిస్తూ నది కట్టవెంబడి నడక సాగించింది కల్యాణి.

నడవగా నడవగా ఓ చోట ఆమె ఆశించినట్లే రేవు కన్పించింది. మానవులు రాకపోకలు జరుపుతూన్నట్లు నిదర్శనంగా అడుగుల ఆనావాళ్ళున్నాయి దప్పిగొని వున్న కళ్యాణి. ఆత్రంగా నదిలోకి దిగి మంచినీరు త్రాగుతూండగా ఎక్కడినుంచో కిలకిలలూ, వికవికలూ విన్పించి, వులికిపాటుతో చేతులలో నీళ్ళు జారవిడిచి తలెత్తి పరిసరాలు పరికించింది. కనుచూపు మేరలో ఓ పాతికమంది స్త్రీలు నదివొడ్డున తమలో తాము పలురకాల వినోదిస్తున్నారు. చెట్లెక్కేవారు, పాటలు పాడేవారు, ఆటలు ఆడేవారూ.........సంతోషమంతనూ తమ స్వంతం చేసుకొన్నట్లు సంచరిస్తున్నారు వారిని చూస్తూన్న కళ్యాణికి మతిపోయింది.

'మనుష్యులంటే అలా వుండాలి. ఛీ, నాదీ ఒక బ్రతుకేనా?' అనుకొంటూనే ఒక్కసారి కళ్ళు మూసుకొని, నదీమధ్యంగా నడచి, ఆనదిలో లీనమైపోయింది.

# 18

"నేను చావలేదా?"

"నన్ను ఎందుకు చచ్చిపోనివ్వలేదు?"

పిక్నిక్‌లో వినోదిస్తూన్న ఆ స్త్రీలు రక్షించగా, కళ్ళు తెరిచిన కళ్యాణి మొదట అన్నమాట లివి.

"నీ కేం పరవాలేదు. బ్రతకాలి గనుక బ్రతికేవు; గాభరాపడకు." ఓ ప్రౌఢస్త్రీ కళ్యాణి తల నిమురుతూ అన్నది. మరొక యువతి కాఫీ తెచ్చి త్రాగించింది.

తేరుకొన్న తరువాత కళ్యాణి విరక్తి కారణాలను వారు తరచి తరచి అడిగారు.



అయిష్టంగానే చెప్పింది కల్యాణి "భర్త మోసగించి వదలి వెళ్ళిపోయారు కన్నవా రెక్కడున్నారో తెలియదు. తెలిసినా రానివ్వరు. పూర్తి నిరాధారస్థితిలో వున్నాను అంతే."

అంతకంటే వివరాలను ఆమెనుండి రాబట్టలేకపోయారు ఆ రంక్షించినవారు.

వారిలో పెద్దామె అన్నది: "సరే. ఇప్పుడు నువ్వేమీ చెప్ప నవసరం లేదు. మేము నీవంటి స్త్రీలను కష్టాలనుండి ఆదుకోవడానికే వున్నాము. వచ్చి మా అనాథ శరణాలయంలో వుండు"

పులిక్కిపడింది కల్యాణి. "అనాథశరణాలయం! భగవంతుడా కడ కీగతికి తెచ్చావా?" నుదురు కొట్టుకొంటూ విలపించింది.

"ఏడవకు, వీళ్ళ నందరినీ చూడు." అక్కడ వున్న స్త్రీ లందరినీ చూపించుతూ ఆమె అన్నది; "వీళ్ళలో కొందరు ఇక్కడకు వచ్చినప్పుడు నీకంటె విరక్తిలో వున్నారు: మరికొందరు నీకంటె మంచి ఇండ్లలోని సుఖభోగులు. కాలం, ఖర్మం అలా యీడ్చేయి - ఏమి చేస్తారు! వారంతా ఇప్పుడు మా శరణాలయంలో ఏవో విద్యలు నేర్చుకొని సుఖంగా వున్నారు. కొందరు అదృష్టవంతులను సంస్కార హృదయులైనవారు ఉదారంగా వివాహం చేసుకొని తీసుకుపోయారు.

మౌనంగా వింటూ, వా రందర్నీ విస్ఫారితనేత్రాలతో చూడసాగింది కల్యాణి.

అనాథాశ్రమం అధికారిణి యింకా యిలా చెప్పసాగింది: "ఇంకా నువ్వదృష్టవంతురాలవు గనుక మా చేతులలో పడ్డావు. దిక్కూ, దివాణం లేకుండా అనేక రకాల మోసాలలో పడి రకరకాలుగా సర్వనాశన మైపోతున్నా రెందరో స్త్రీలు. నీ స్థితి యింకా చాలా నయం."

కళ్యాణికి హఠాత్తుగా హోటల్లో జరిగినవిషయం మనసున మెదిలి, శరీరం

జలదరించింది. రెండుచేతులూ ఎత్తి తనకు హితబోధ చేస్తూన్న ఆమెకు నమస్కరించి, మెల్లగా దృఢంగా అన్నది కళ్యాణి

"అవునమ్మా, ఇక మీరే నాకు దిక్కు; నా కెవరూ లేరు, ఉండబోరు."

"తప్పు. అలా అనకు." ఆశ్రమవాసినులలో ఒకామె అన్నది. "నీకడుపులో, పాప వుంటుంది నీకు!"

ఆ మాటకు మరోపదిమంది గలగలా నవ్వారు. అంత దయనీయస్థితిలోనూ, కళ్యాణి మనస్సు ఏదో ఆశకూ, ఆనందానుభూతికీ లోనైంది 'ఫర్వాలేదు తనకు ఒక నిశ్చలమైన నీడంటూ దొరికింది తనబిడ్డ రహదారిప్రక్కన చెట్టుక్రింద పుట్టవలసిన అగత్యంలేదు!' తృప్తిగా నిట్టూర్చింది

## 19

కళ్యాణికి తానున్న అనాధాశ్రమపు అసలుతీరూ రహస్యాలూ మెల్లగా గ్రహింపుకాసాగాయి. అందులో శరణుజొచ్చిన ఒక్కొక్క స్త్రీజీవితం ఒక్కొక కన్నీటిగాధ: దారిద్ర్యంవల్ల, విధి బలీయతవల్ల, బుద్ధిహీనతవల్ల మత్తిల్లిన మదంవల్ల — ఒక్కొక్కరు ఒక్కొకతీరున వంచితులై, అనాధులై అల్లాడి కడకు ఈతావున తల దాచుకొన్నవారే. ఆయితే, వారిలో ఏ ఒకరిద్దరో మినహాగా మిగిలిన ఎవరికీ

కూడా తమస్థితికి చింతగాని, సిగ్గుగాని, ఏవగింపుగాని లేవు. తమలోతాము మోటు హాస్యాలాడుకొంటూ మామూలు అమ్మలక్కల్లాగే లోకులగురించి నానాచత్తా చర్చించుకుంటూ మహోల్లాసంగా వుండేవారు. కొందరు క్షణానికి నవ్వుతూ, క్షణానికి ఏడుస్తూ, అంతలో అంతరిలో కలసిపోతూ, అసలు ఆంతర్యమేమిటో ఎవరికీ అవగాహన కానీయకుండా ప్రవర్తిస్తారు. వారిలోవారికి మళ్ళీ పార్టీలు, కక్షలు, నాయకురాండ్రు — ఎన్నో ! సెక్రెటరీకి ప్రియమైనవారు చిన్నరకం రాణీలలాగే ప్రవర్తిస్తారు, తక్కినవారిపై అజమాయిషీ చేస్తూ, తమవంతుపనికూడా ఇతరుల నెత్తిన రుద్దుతారు. కళ్యాణివంటి అమాయకులు ఎంతకూ పనితరగక సతమతమై పోతూ, ఇంకా పైవారి చీవాట్లుకూడా భరిస్తూండాలి. ఇంకా విశేషమేమంటే, అందులో వున్నవారందరూ నిజంగా అనాథులుకాదు సెక్రటరీ, ప్రెసిడెంటూ, దాతలూ మొదలైనవారికి యితరత్రా అనేక కారణాలవల్ల, వ్యావహారిక మొగ మాటలవల్ల సిఫారసులపై కొందరు కొందరిని పంపిస్తూంటారు. అన్నలూ, తలిదండ్రులూ వగైరా బంధువు లున్నప్పటికీ, ఎవరూ లేనట్లే వ్రాసి, తేలికగా 'అనాథ'ని నిర్ణయించేసి ఆ ఆశ్రమంలో ఉచితజీవనోపాధి—యింకా అవసరాన్నిబట్టి విద్యా, వివాహం వగైరాలుకూడా లభింపజేస్తారు. అందువల్ల ఆ దాతలూ, ఈ సెక్రటరీ వగైరాలు వ్యక్తిగతంగా పొందే లబ్ధికానీ, వారికీ వారికీ మధ్యవుండే

మొగమాటాలూ, వ్యవహారాలూ, రహస్యాలూ వగైరాకానీ ఎవ్వరికీ తెలియవు. తెలిసినా, తెలిసినవారు పైకి బహిరంగం చేయడానికి వీలులేదు ఆ కథలూ, గాథలూ వేరు ; ఆయా వ్యక్తులకు సంబంధించినవారు తమతమవారి రహస్యంగాని వీలునుబట్టి కల్సుకుపోతూనే వుంటారు

అన్నిటికంటె కళ్యాణిని ఆశ్చర్య పరచినదీ అసహ్యపరచినదీ మరొక విషయం వున్నది : పైపైకి చూస్తే ఆ అనాథశరణాలయం చాలా గొప్పదీ, పేరెన్నికైనదీ, అశరాలా ఆర్త స్త్రీజనుల పాలిటి కల్పవృక్షమూను మగపురుగు వాసన తగలదు. ఒక్క ఆశ్రమవాసినులకు మాత్రమె తెల్సు. అదొక భోగమందిర మని సెక్రెటరీ తండ్రీ, అన్నదమ్ములూ, ఇంకా యింకా, ఆమె పురుష స్నేహితులూ, శరణాలయానికి విరాళ మిచ్చే దాతలు కొందరు ప్రతి సాయంత్రం అక్కడకు వస్తారు ఆశ్రమ మందలి కొందరు స్త్రీలతో వారికి సన్నిహిత సంబంధం వున్నది. తమ కడచిన జీవితానికే పగస్తూ, పశ్చాత్తాపపడి, ఇక్కడ జేరిన కొందరు స్త్రీలు ఈ పాపిష్టి పనులకు ఎదురు తిరుగుతారు ఆరంభంలో. కాని గతిలేక, ఆ పట్టెడు మెతుకులూ, నీడాపూడా తిరవై వీధుల పాలౌతామనే భయంతో,

లొంగిపోయి యంత్రాలలా బ్రతుకుతారు. ఒక్క మాటలో చెప్పాలంటే, మానవతికీ, అభిమానవతికీ, సుగుణానికీ అక్కడ తావులేదు. నీచత్వానికీ, అధికారానికీ దాసోహమని, మానవత్వాన్ని మఱచి, జీవితాన్ని ప్రేమించలేక మృత్యువును ఆహ్వానించలేక బ్రతుకుతారు అక్కడి స్త్రీ లంటే రూకూడా. ఏ కొద్దిమందో అదే స్వర్గమనుకొని, సెక్రటరీ పాదా లొత్తుతూ, ఆమె కనుసన్నలలో మెలగుతూ, ఆమెకు ప్రీతిపాత్రులై, ఇతర ఆశ్రమవాసినులపై అధికారం చెలాయిస్తూంటారు, తామే సర్వాధికారులైనట్టు. అసలు ఆ శరణాలయ గౌరవాధికారిణే ఊరిలోని కొందరు ఘరానా పెద్దమనుష్యుల చేతిలోని కీలుబొమ్మ అని వదంతి! ఆ శరణాలయాని కివ్వబడిన విరాళాలలో మూడువంతు లామెకే కైంకర్యం! ఇక అటువంటి తావున పవిత్రతకు ఆస్కార మెక్కడ?

పరిస్థితు లన్నీ అవగాహన చేసుకొన్న కళ్యాణి తన స్థితికూడా అంతటి హైన్యానికి దిగజారకముందే ఏదో ఒక దారికోసం ఆలోచించసాగింది. అపురూపమైన తన సౌందర్యం చాలమంది పురుషులను ఆకర్షింపచేస్తున్నట్టూ, స్త్రీలను అసూయా పరవశులను గావించుతూన్నట్టూ కళ్యాణి గ్రహించగలిగింది.

# 20

తన గర్భస్థశిశువుపై కళ్యాణికి ఒకనాడున్న తీయని మమతానురాగాలు మాయమై క్రమంగా అసహ్యాతా ద్వేషాలు పేరుకొనసాగాయి. 'ఛీ ఛీ, ఈ పాడుబిడ్డ కడుపున పడిన దగ్గఱనుండీ నాకు అష్టకష్టాలే ప్రారంభమయ్యాయి. దానిపై నాకు ప్రేమెందుకు?' అన్పించేది అంతలో 'అయ్యోపాపం! అదేం చేసింది?' అన్పించేది ఎందరో యువతులు ప్రసవించలేక చచ్చిపోతారు వారిలో నేనూ ఒకతెనైతే?' అనే ఆశ కలిగేది.

ద్వైదీభావాలతో, ఆశా నిరాశలతో బ్రతుకుభారం మోస్తూన్న కళ్యాణికి కడకు కోరిన మఱణంకూడా గగనమే ననే విషయం గుర్తింపైంది.

అది సుముహూర్తమో, దుర్ముహూర్తమో నిర్ణయించలేని ఒక క్షణాన తానూ, తనకు పుట్టిన బిడ్డకూడా క్షేమంగా వున్నట్లు గ్రహించిన కళ్యాణి అనిర్వచనీయమైన బాధతో కుమిలి కుమిలి ఏడ్చింది. తన గతిలేని జన్మకు మరొకబంధం — అందునా ఆడశిశువు! ఛీ, ఈ విషవాతావరణంలో అదెన్ని యిడుములకు లోనౌతుందో, ఎంత నీచంగా బ్రతకాలో!

ఆ జాలి అంతా మరల క్షణంలోనే ఎగిరిపోయింది. 'ఛీ ఛీ, ఏమైతే అవనీ నా కెందు కీ చింత? ఇది ఆ వంచకుడు ప్రకాష్ బిడ్డ; నాకేమీ కాదు!'